

"డాక్టర్ చక్రవర్తి" లో జగ్గయ్య, సావిత్రి

# ఉత్తరాలు

## వ్యాసాలు

నా అభిమాన నటుడు శ్రీ యన్. టి. రామారావుగారి ప్రథమ వ్యాసం " కళా — పరమార్థము " ఉత్తేజపూరితంగాను, నిశితంగాను ఉంది. నటునిగానే గాక వ్యాసకర్తగా కూడా యన్. టి. రామారావుగారు తనకు తానే సాటి అనిపించుకున్నారు — " నటుడే పరిశ్రమ కాదు — పరిశ్రమలో నటుడొకడు మాత్రమే " నటుడై యుండి కూడా నూటికి నూరు పాళ్ల ఈ యదార్థాన్ని చెప్పగల స్థైర్యం యన్. టి. రామారావు గారికే వుందేమో !

యం. వి. నారాయణాచార్య. ( రాజమండ్రి. )

*　*　*

సినీ పరిశ్రమకు ప్రోత్సాహ మిస్తున్న ఆంధ్ర ప్రభుత్వమునకు కళాకారులు ఎంతో ఋణపడి యున్నారు. కాని ఒక ప్రక్కన ప్రోత్సాహమిస్తూ మరో ప్రక్క నుండి సినీ జగత్తులో విప్లవాన్ని రేకెత్తించ యత్నిస్తున్న ఆంధ్ర మంత్రులకు రామారావుగారి వ్యాసము కనువిప్పు కలిగించ గల దని ఆశిస్తున్నాను. రామారావుగారి వ్యాసం చాల సమంజసముగా నున్నది. వారికి నా అభివందనలు.

కిలారు శాంతిశ్రీ (చాటపర్రు)

*　*　*

మా అభిమాన పత్రికలో 15—5—64 పత్రికలో మీరు ప్రచురించిన" ఫుట్‌పాట్ బ్రతుకులు" సచిత్ర వ్యాసం నన్నెంతో అలరించింది. నన్నేకాదు చాలా మందికి ఒక సమస్య ఎదురైనట్లు బాధ పడ్డారు. మద్రాసు హార్బరు వద్ద, కష్టమ్స్‌వద్ద, రాయపురంలోనూ ఫుట్‌పాట్ బ్రతుకులు అనంత్యాకం.

ఒక సుప్రసిద్ధ తమిళ దర్శకుడు (పి. నీలకంఠం) తన సినిమాలో ( తిరుడాదే ) కూడా ఈ దృశ్యాన్ని చిత్రీకరించారు. స్వయంగా ఒక ఆస్ట్రేలియా కుటుంబం వీరిని ఫొటోలు తీస్తుంటే ఎందుకో అనుకున్నా !

ప్రత్యేకించి ఫొటోగ్రాఫర్ ప్రభాకర్‌కు నా ధన్యవాదాలు.

కానం. కోటేశ్వరరావు. (కరిచేడు.)

*　*　*

ఆరువంజయ్ కలం వ్యాసం చిన్నదిగా యున్నా చాలా బాగుంది. ఈ క్షేత్రం ఎర్నాకులంలో ఉందని చదువగానే ఆశ్చర్యపోయాను. ఎందుకంటే మేము ఈ వేసవిలో కేరలా ప్రోగ్రాం వేశాం. బొమ్మలు ఇంకా రెండు మూడు వేసి ఉంటే బాగుండేది.

ఇందిర (నిజామాబాద్)

## కార్టూన్

ది. ( 8—5—64 ) ఆంధ్ర సచిత్ర వార పత్రికలో 16వ పేజీలో వేసిన కార్టూనులో ఎడమ చేతికి కట్టిన కట్టు ( స్మాల్ ఆర్మ్ స్లింగ్ ) ఉండ వలసిన పద్ధతిలో లేదు. ఆ కట్టుయొక్క లోపలి భాగము కుడి భుజముపైనుండి యెడ తిరిగి ఎడమ భుజమునకు రాగా, క్రిందనుండి అనగా చేతి పై భాగం నుండి రెండవ కొన, ఎడమ భుజమునకు క్రిందిగా ముడివేయవలసినది. అంతేగాని, సరాసరి ఎడమ చేతి కట్టు ఎడమ భుజమునకే కట్టరు.

బి. ఆర్. జాన్. ( రాజమండ్రి. )

## కథలు

ఆంధ్రసచిత్రవారపత్రిక 22—5—64లో శ్రీ జహీర్‌గారిచే రచించబడిన "లేచిపోయింది" అన్న కథ సహేతువుగా లేదు. హిందూమత దూషణమేగాక ఆచార వ్యవహారములను, హిందూ సాంప్రదాయములను, దేవాలయములను హీనపరచేందుకు ఉద్దేశించినట్లున్నది. హిందూ దేవాలయములలో మతాంతర వివాహములకు తావు లేదు. అట్టివి చెయ్యనియ్యరు. వివాహముల విషయములో హిందూ దేవాలయములో చాల కట్టుబాట్లున్నవి. అందులో సింహాచలము, తిరుపతి, మొదలైన క్షేత్రములలో చెప్పనవసరములేదు."

ఎ. వి. ఆర్. భరద్వాజ (విశాఖపట్నం)

*　*　*

రేవనూరి శమంతగారు వ్రాసిన "హుసేన్‌సాగర్" బాగున్నది. కథ చదువుచున్నప్పుడు ప్రేమికుడైన గోపి తను ప్రేమించిన రాధను పోగొట్టుకున్నప్పుడు ఎవరికైనా కండ్లవెంట నీళ్ళు తిరగవలసిందే! వారికి ఇలాటి కథ వ్రాసినందుకు నా ధన్యవాదములు.

మిస్ వేదవతి (విజయవాడ)

*　*　*

"హుసేన్‌సాగర్" రచయిత్రి రేవనూరి శమంత గారికి కథ చదివినప్పటినుంచీ ధన్యవాదాలర్పించకుండా ఉండలేకపోతున్నాను.

గోపాల్ (పలాసా)

*　*　*

ఈ వారము ప్రచురించిన కథలలో కె. రామచంద్రారావుగారు వ్రాసిన ది గర్ల్ విత్ స్పేరింగ్ లుక్స్, కథ చాల చాల బాగ ఉన్నది. కానీ ఈ కథకు ఆ ఇంగ్లీషు పేరు కాకుండ మరేపేరైన పెట్టిన బాగుంటుందని నా అభిప్రాయము. రచయితగారికి నా ధన్యవాదములు.

దేవరాజు సత్యనారాయణరావు (ఉయ్యూరు)

*　*　*

8—5—64వ పత్రికలో ప్రారంభించిన ముప్పాళ రంగనాయకమ్మగారి సీరియల్ " కూలిన గోడలు "కు వేసిన బొమ్మలో తప్పుఎంచ వలసి వచ్చినందుకు చింతిస్తున్నాను. ' శారద ' గులాబీ రంగు చీర కట్టుకున్నట్టు రచయిత్రి వ్రాసేరు. కానీ బొమ్మలో, పరికిణీ, వోణీ వేసుకున్నట్టు చిత్రించారు. ఇది ఎవరి తప్పంటారు ?

సాధారణంగా చేతివాచీ ఎడమ చేతికి పెట్టుకుంటారు. కానీ బొమ్మలో ( శారద ) ఎడమ చేతికి లేదు. కుడి చేతికి వుందేమో అనుకోవాలంటే విచిత్రమే మరి !

బిళ్లా సూర్యప్రభ. ( మచిలీపట్నం. )

*　*　*

8—5—64 నాటి పత్రిక 4వ పేజీలో, " వదంతులను వినకండి వ్యాప్తి చేయకండి " అంటూ దాకి క్రింద " పుప్పలత చెప్పిన రహస్యం " వేశారు. దాన్ని నమ్మవద్దంటారా ?

విజయ చంద్ర ( కాకినాడ. ) ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 5—6—'64
క్రోధినామ సం॥ వైశాఖ బహుళ దశమి
సంపుటము 56 సంచిక : 40

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ 148.20

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న పై.
6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"అన్నిటికంటె ప్రమాదకరమైన వృత్తి ఏదంటారు?"

"ఉపాధ్యాయవృత్తి ... ఎందుకంటే ఆకలితో ఎలాగూ చచ్చిపోతున్నాడు. ఈ మధ్య స్కూలు పిల్లలు కూడా కొట్టడం మొదలెట్టారు!"

## మనలో మాట

ప్రముఖ నటులు శ్రీ ఎన్. టి. రామారావు వ్రాసిన నాలుగవ వ్యాసం "నేను" (38 వ పేజీ)తో 'ప్రత్యేక వ్యాసావళి' ముగుస్తున్నది. చిత్రపరిశ్రమకు సంబంధించిన సాధక బాధకాలను వారు తమ 'వ్యాసావళి'లో కూలంకషంగానే వివరించారని అనుకొంటున్నాము.

* * *

ఈ వారం 32, 33 పేజీలలో ప్రారంభమయే కొత్త సీరియల్ 'మనసున మల్లెలు' రచయిత రంగధామ్‌గారిని గురించి ఉపోద్ఘాతం అవసరం లేదనుకొంటాము. కారణం : వారు మా పాఠకులకు సుపరిచితులే.

* * *

ఈనాడు భారతదేశంలో 'వంటసామగ్రి'కి సంబంధించిన చర్చ అక్కడక్కడ వినవస్తూనే వుంది. 24 వ పేజీలోని శ్రీమతి వి. హేమలతా కైలాసంగారి వ్యాసం అందుకు సంబంధించినదే.

* * *

మేము ప్రచురిస్తున్న 'రామచరితమానస్'లో 'లవకుశ కాండ' పైవారమే ఆరంభమవుతుంది. ★

## విషయానుక్రమణిక


ఎవరి ఆలోచ
నలు వారికున్నాయి
కేంద్రోద్యోగులు
రాష్ట్రవుద్యోగులు
వాడికి ఇచ్చేదంత నాకుఇయ్యవ్!
కారు నిక్షేపంలా వుంది కాదని ఎవరంటారూ?
కామరాజ్ పథకం
యు.పి. కాబినెట్
యు పి సత్యాగ్రహం
OOMMEN



నేపాల్ రాజా శ్రీ మహేంద్ర ఇటీవలనే సతీసమేతంగా న్యూఢిల్లీ వచ్చారు. రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్‌తో ముచ్చటిస్తున్న శ్రీ మహేంద్ర, రాణిరత్నగార్లను యీ చిత్రంలో చూడవచ్చును.

# ఢిల్లీలో పాలకీ నీళ్లకీ ఎద్దడి!

ఈ మధ్యనే అనుకొంటా—ఒక అమెరికన్ వ్యాపారి బ్రిటన్‌ను గురించి వ్రాస్తూ, ఆ దేశం అర్ధ కాలపు దేశమనీ, కార్మికులు సగం పని చేస్తారనీ, అందుకు సగం జీతమే వస్తుందని, ఆ ఇచ్చే సగం జీతం కూడా యజమానులు సగం మనస్సుతో ఇస్తారనీ పేర్కొన్నాడు. అదేవిధంగా ఇండియాను గురించి చెప్పొచ్చేటప్పుడు—ఇది కూడా అర్ధ కాలపు దేశమనీ, కాని ఎవరైనా చేసే సగం పనికి ఇక్కడి నిర్లక్ష్యమైన యాజమాన్యం రెట్టింపు కూడా ముట్టచెబుతారని చెప్పొచ్చు.

ఇదే అంశాన్ని దృష్టిలోవుంచుకొని ఒక్కమారు భారత దేశపు రాజధానివైపు పరికిద్దాం. తృతీయ ప్రణాళికలోని తృతీయ సంవత్సరంలో— ఢిల్లీలోనే నీటి ఇబ్బంది సమస్య మళ్లీ తలఎత్తింది.

పోయిన సంవత్సరం లోక్‌సభలో డాక్టర్ సుశీలానయ్యర్ మాట్లాడుతూ, నీటి కొరత అన్నది ప్రతి ఏడాది వేసవిలో సంప్రదాయ బద్ధంగా వస్తున్నదని అన్నారు. ఎవరిదాకానో ఎందుకు? ఇక్కడ, నా స్వానుభవమే చెప్తాను ..... నే నుంటున్నది పార్లమెంటు వీధిలో. ఈ వీధిలో ఉండే భవనాల మొదటి 'ఫ్లోర్'కే నీరు అందటానికి. తగినంత ఒత్తిడి లేదు. ఇది ఇలా ఉండగా, ఇదే వీధిలో ఆరు అంతస్థుల భవనాలను నిర్మించటానికి 'ప్లాన్' లు వేయటం జరుగుతున్నది. అంతేకాదు, ఆరంతస్థులకన్నా పెద్ద భవనాన్నే నిర్మించాలన్న యోచన కూడా కొంద **లేకపోలేదు. ఈ ప్లాన్లను మంజూరుచేసే** 'మునిసిపల్ కమిటీ' కి ఆయా భవనాల 'బాత్‌రూం' వసతుల్లోను, విస్తీర్ణంలోను ఆసక్తి ఉంది—అంతవరకే. ఆకాశాలను అంటే యీ భవనాలకు నీరు, విద్యుచ్ఛక్తి అందుతున్నాయా ?—లేదా ?—అన్న అంశాన్ని ఆ కమిటీ పట్టించుకోదు. 'పార్కింగు' కు రవంత జాగాను ఏర్పాటుచేసే విషయాన్ని కూడా ఎవరూ పట్టించుకోరు. ఇటువంటి సమస్యలన్నీ, సమస్యలుగా ఉండిపోయాయి. వీటి జోలికి పోయేవారు ఈనాడు ఎవరూ కనుపించరు.

అసలు ఈ నీటి కొరత సమస్యను మొదట వెలికి తీసినవారు డాక్టర్ అంబేద్కర్. యుద్ధపు రోజులవి. జమునానదిలో నీటి స్థాయి తగ్గుతుండేది. అదే రోజుల్లో విద్యుచ్ఛక్తి కూడా విఫలమయే ప్రమాదం ఉండేది. అందువల్ల, విద్యుచ్ఛక్తి కేంద్రం సమీపంలో జమునానదికి ఆనకట్టను నిర్మించడానికి నిశ్చయించారు. కాని, ఆ రోజుల్లో జరుగుతుండే యుద్ధ సన్నాహాలు, తదితర కారణాల మూలంగా ఈ పథకాన్ని రద్దు చేయటం కూడా జరిగిపోయింది. క్రమేణా స్వాతంత్ర్యం రావటం, దాంతో కొందరు 'మాస్టర్—ప్లానర్ల' శకం ఆరంభం కావటం జరిగింది. **తరువాత ఆన**కట్ట నొకదాన్ని కట్టారు. కాని, ఈ ఆనకట్ట 'పంపింగ్' కేంద్రం నుంచి దాదాపు ఎనిమిది మైళ్ల దూరం ఉన్నది. ఫలితం : చాలా తక్కువ స్థాయిలో నీరు ప్రవహిస్తుండేది. ఇప్పుడు మరో ఆనకట్టను నిర్మిస్తున్నారు.

నలభై లక్షల గ్యాలన్ల నీటిని శుభ్రపరచి ప్రజలకు అందించగల జల కేంద్ర మొకటి ఈ ఏడాదిలోనే పని ప్రారంభిస్తుందని అంచనా. సిమెంటు దొరకటంలేదన్న నెపంతో యీ జలకేంద్రం **ఏర్పాటు అప్పుడే ఒక ఏడాది ఆలస్యమైంది. ఢిల్లీ** నగరంలో రోజుకో బజారు సృష్టించబడటానికి అవసరమయిన భవనాలకు సిమెంటు దొరుకుతుంటే, మరోవైపు నలుగురికీ ఉపయోగపడే ఈ జల కేంద్రానికి సిమెంటు దొరకటంలేదనే నెపం విడ్డూరంగా కనిపిస్తున్నది.

1963 లో ఢిల్లీ కార్పొరేషన్ ఒక తీర్మానం చేస్తూ, 1.40 మిలియన్ల గ్యాలన్ల నీరుకావాలని ప్రతిపాదించింది. ఆ రోజుల్లో 1.05 మిలియన్ల గ్యాలన్ల నీరు ఖర్చు అవుతూ ఉండేది. కాని, ఆనాటి కంటె ఈరోజున నగరంలో జనాభా విపరీతంగా పెరిగిపోయింది.

నీటికథ ఇలావుంది! నీటికీపాలకూ ఎప్పుడూ అవినాభావ సంబంధం వుంటుంది కనుక కొంత పాలకథను కూడా చెప్పుకొందాం.

ఈఏడాది నగరవాసులను బాధిస్తున్న కొత్తసమస్య పాలసమస్య. ప్రభుత్వంవారి పాల సరాఫరా కేంద్రంలోనే పాలకొరత ఏర్పడిందని తెలుస్తున్నది.

అసలు నిజం చెప్పాలంటే, చివరకు పబ్లిక్ అకౌంట్స్ కమిటీ, అంచనాల సంఘం కూడా యీ పాల పథకం యొక్క పుట్టుపూర్వోత్తరాలను మరిచిపోయినట్లున్నది పశువులరోగ తగ్గించి, 'డైరీ ఫారం' బెడదలు తొలగించేందుకే, యీ పథకాన్ని ప్రారంభించారు. క్రమేణా **ఈ అంశమే న్యూజీలాండ్ ప్రభుత్వాన్ని కూడా ఆకర్షించి, కొంత ఆర్థిక సహాయం అభించటానికి**

# న్యూఢిల్లీ లేఖ

దారితీసింది. ఆ పశువులన్నింటినీ సిడువట్టున ఉంచేందుకు ఢిల్లీలో కాస్త ఖాళీ ప్రదేశాన్ని ఆక్రమించుకోవాలని ప్రతిపాదించుకొన్నారు. ఈ పథకం అప్పుడే రాజకీయాల పడుమన ఇరుక్కొంది. వూళ్ళో ఉన్న పశువుల యజమానులు, 'డైరీ ఫారాల' యజమానులు కలిసి ఒక మురాగా తయారయ్యారు. ఈలోగా ఆధునికమైన ఒక పాల కేంద్రానికి పని లేకపోయింది. గ్రామాలలో నుంచి పాలను తెప్పించి, ఈ 'డైరీ ఫారం' ద్వారా పంపిణీ చేయాలని యోచించారు.... అలా తయారయ్యాయి పరిస్థితులు .... ఏది, ఏమైనా పూర్వపు పథకం ప్రకారం పశువులను వూరి వెలుపలకు తీసుకెళ్ళగలిగితే, నగరంలో ఎంతో పారిశుధ్యం వెలకొంటుంది.

ఒక రకంగా చూస్తే, ఢిల్లీ పాలసరఫరా పథకానికి ఒక ప్రత్యేకత ఉంది. దీనికి సొంత పశువులూ లేవు, కాగా, గ్రామాలలో నుంచి పాలను తెప్పించే ఆచారమూ లేదు. అయితే ఎలా నిర్వహించ గలుగుతున్నారు ? — సంగతిది — మధ్యవర్తులను పెట్టుకోవటం, ఢిల్లీ ప్రజలను దోచి ఆ మధ్యవర్తుల జేబులు నింపటం !

**ఢిల్లీ పాలసరఫరా పథకం అధ్యక్షులు ఇటీవలనే విలేఖరులగోష్ఠిలో మాట్లాడుతూ నగర వాసులకు త్వరలో ముక్తిలభించే మార్గాలు లేవని ఖండితంగా చెప్పారు.**

పైగా—ఈ పాలసరఫరా పరిస్థితి, తృతీయ ప్రణాళిక మధ్యంతర సమీక్షలో చేరిన అంశమే. సహజంగా ఢిల్లీలో సంవత్సర కాలాన్ని నాలుగు భాగాలుగా విభజన చేయవచ్చును. మొదటిది విపరీతమైన ఎండల కాలం—ఈ కాలంలో నీరు అసలు దొరకదు. రెండవది : వర్షాకాలం..... అంతకన్నా వరదలకాలం అంటేనే బావుంటుంది. విపరీతమైన వరదలతో ఢిల్లీ అంతా హాహాకారమంటూ ఉంటుంది. ప్రజలనూ, పశువులను సంరక్షించేందుకు మరోవైపు చర్యలు. మూడో సీజన్ వ్యాధుల సీజనే. నీరంతా మురికిపట్టిపోవటం, ఫలితంగా వ్యాధులు రావటం ఆచారం. ఎంతమంది ప్రజలు ఈసీజన్లో ప్రాణాలు వదులుతారో ఆ భగవంతుడికే తెలుసు. నాలుగోది పండుగల సీజను. రామలీలాతో ప్రారంభమయ్యే ఉత్సవాల సీజను హోలీతో ముగుస్తుంది. పండుగల పేరుతో ఎన్ని గలభాలు, కొట్లాటలు జరుగుతయ్యో లెక్కలేదు.

**ఢిల్లీలో ఒక పెద్ద మార్కెట్టును నిర్మిస్తున్నారు. దానితోబాటే ఒక మురికివాడనుకూడా. కేంద్ర సచివాలయమే ఆ మురికివాడ !**

ఈ సచివాలయం ఒకప్పుడు 'రైసినా హిల్లు' గా ఉండేది. 1947 వరకు యీ 'హిల్లు' ఎంతో అందంగా ఉండటంవల్ల జనం తండోపతండాలుగా వచ్చి చూచిపోతూ ఉండేవారు. కాని, అది సచివాలయంగా మారటంతో దీని ప్రాముఖ్యత తరగిపోయింది. ప్రతిరోజూ ఉదయం పది గంటల తరువాత వసారాలను కడిగిస్తారు. అట్లా కడిగిన తరువాత గంట గడవక ముందే మట్టి, మురికి ప్రత్యక్షం.

మన దేశంలో అమలు జరుగుతున్నాయ్ కొన్ని పథకాలు. మురికివాడ అభివృద్ధికి కూడా అవే పథకాలు! సచివాలయంలో ఈ పథకం బాగా అమలులో ఉంది. సచివాలయపు మొదటి రెండు అంతస్థులనూ, మొదటి రెండు పంచవర్ష ప్రణాళికల లోగానే మురికివాడలుగా రూపొందించటం జరిగింది. ఇప్పుడు నడుస్తున్న మూడో ప్రణాళికలో మరో అంతస్థును 'మురికివాడగా' మారుస్తున్నారు. ఈ అంతస్థులలో నడిచి వెళ్ళేవారు ఆ దుమ్మును,

59 వ పేజీ చూడండి



## సౌందర్యమునకై సౌందర్య సాధన!

# లక్మె

**ఉదయము లక్మె వానిషింగ్ క్రీమ్ రాసుకోండి...**

మరియు దినమంతా సౌందర్యముగా తయారై వుండండి. లక్మె వానిషింగ్ క్రీమ్ మీద పౌడర్ చాలా సేపటి వరకు కూడ అద్దుకొని వుండును. ఇందువల్ల మీ ముఖము దినమంతా అందముగాను, కోమలముగాను వుండును.

**...మరియు రాత్రి లక్మె కోల్డ్ క్రీమ్!**

మీరు విశ్రాంతిగా నిద్రిస్తారు. లక్మె కోల్డ్ క్రీమ్ వల్ల 'మేకప్' మరియు రోమ రంధ్రముల మీద వున్న ధూళి కణములు వదలిపోవును.

చర్మము కొరకు ఉపయోగకరమైన నూనెలతో తయారైన లక్మె కోల్డ్ క్రీమ్ మీ ముఖచర్మమును కోమలముగాను, ప్రకాశవంతముగాను వుంచును.

ప్రత్యేక కానుక : శృంగారము, సౌందర్యము పెంపొందించు కొనుటకై ఇంగ్లీషులో వ్రాయబడిన చిన్న పుస్తకమును ఉచితముగా పొందండి.
ఈ అడ్రసుకు వ్రాయండి. లక్మె లిమిటెడ్, బొంబే హౌస్, బ్రూస్ స్ట్రీట్, బొంబాయి 1.

రాజధాని కబుర్లు

# నగరంలో మునిసిపల్ ఎన్నికల కోలాహలం: నాటక కళాపరిషత్తు వారి బహుమానాలు!

జూన్ నెల చివరిలో, హైదరాబాదులో మునిసిపల్ ఎన్నికలు జరగబోతున్నాయి. వాటికి ఇప్పటి నుంచి, ప్రయత్నాలు ఉమ్మరంగా సాగిపోతున్నాయి ఎన్నికల నిర్వహణ తతంగంలో అధికారులు నిమగ్నులయి ఉంటే, రాజకీయ పార్టీల వారు, అభ్యర్థుల నిర్ణయం విషయంలో ఎంతో ఆవేదన పడుతున్నారు. ముఖ్యంగా కాంగ్రెసువారు, వారి తాలూకు కాబోయే అభ్యర్థులు నానాఅవస్థలు పడుతున్నారు. ఎట్లాగైనా సరే, ఈ సారికూడా మునిసిపాలిటీ ఆధ్వర్యం, తమ చేతుల్లోకి తెచ్చుకోవాలని. దీనికి కారణం, ఈసారి ప్రతిపక్షం, తమకు వ్యతిరేకంగా గట్టిగా నిలబడచ్చునే బెంగ వలనే. ఇలాంటి అపనమ్మకం కలగటానికి కారణాలు, గతంలో తాము ప్రదర్శించిన అసమర్థత, అశక్తత, పౌరులకు, నగరంలో ఉండగల స్థితిగతులు కల్పించలేక పోవటమే దీనికి ముఖ్య కారణం అనిపిస్తోంది. పాలకులకూ తెలుసు, ఆంధ్ర రాజధాని నగరం, రానురాను యే విధంగా మార్పు చెందుతోందో, అయితే అంత శ్రద్ధ, ఆసక్తి చూపించటానికి తగిన కారణాలేమీ కనిపించలేదు. ఇప్పుడయితే ఎలెక్షన్‌లు వచ్చి పడ్డాయి. ఇప్పుడయినా, గాఢ నిద్రనుంచి మేల్కొపోతే ఎట్లా! అకస్మాత్తుగా ఒకనినాదం లేవదీశారు కాంగ్రెసు వారు, మురికి వాడల నిర్మూలనమే మా పరమ లక్ష్యమని. ఇది నిజంగా చాలా హర్షించ తగ్గదే! కాని ఇన్నాళ్లు వాటి నిర్మూలనకు ఏమేమి చర్యలు తీసుకున్నారు? నిజాయితీగా, మురికి వాడల్లో నివసిస్తున్న ప్రజానీకం పట్ల శ్రద్ధ చూపించ కలిగారా! పైగా నగరం మధ్యలో హెచ్చరికల 'బోర్డు': ఈ స్థలం గుడిసెల వారిది, జాగ్రత్త అని! ఈ గుడిసెల్ని అట్లాగే ఉండి పోవాల్సిందే, నగరంయొక్క ఆరోగ్యం యెంత తీవ్రంగా దెబ్బ తింటున్నా ఫరవాలేదు. పైపెచ్చు, వాళ్లకుకావలసినంత మద్దతు, సహాయం, కనిపించకుండానూ, అవసరమయితే ఒక్కొక్కప్పుడు బాహాటంగానూ చేస్తూనే ఉంటారు కూడా. ఇదిట్లా ఉండగా ఇంకో తమాషా, నగరంలో 75 వేల మంది దాకా మురికి వాడల్లో నివసిస్తూ ఉన్నారు కాబట్టి, వారికి ప్రాతినిధ్యం ఇస్తూ, కాంగ్రెసు వారు, 'టిక్కెట్లు' (అంటే, ఎన్నికల్లో కాంగ్రెసు తరపున నిలబడే అధికారం), ప్రసాదించాలని విజ్ఞప్తులు. గుడిసెల వాళ్లకు ఎక్కువ ప్రాతినిధ్యం యిస్తే, మురికివాడల నిర్మూలం త్వరగా జరుగుతుందిట కూడా! దొంగకు తాళం చెవి ఇచ్చినట్టు! ఇదీ వీరి ప్రచార ధోరణి! అసలు మురికి వాడలనే నిర్మూలించాలని అందరూ అంటుంటే, వారికి ప్రాతినిధ్యం ఇచ్చి బలపరచమంటే, దీని ఆంతర్యమేమిటి! ఇలాంటప్పుడు వీరినినాదం కేవలం బూటకమని తేలిపోతోంది. నగర వాసులు మహా విసుగు చెందిపోయారు ఎక్కడ చూసినా అనారోగ్య పరిస్థితులతో, ఒళ్లు గలతరించి పోతోంది పిల్లల్ని స్కూళ్లకు పంపాలంటే, మహాకష్టంగా ఉంటోంది. బిచ్చగాళ్లు సరేసరి! సమయం కనిపెట్టి, మురికి వాడల నిర్మూలనకు కంకణం కట్టుకున్నామని ప్రకటించటం, ఆత్మవంచన, హాస్యాస్పదంగా కనిపిస్తోంది. ఏమైనప్పటికీ, నగరాన్ని సుందరంగానూ, ఆరోగ్యవంతంగానూ రూపొందించటానికి సమగ్రమైన పథకం తయారు చేసిన వారికి, అలాంటి పథకాన్ని అమలు పరచగల స్తోమత, తాహతు ఉన్న అభ్యర్థులకే ఈ సారి నగరవాసులు వోటు వేస్తే, కొంతవరకైనా పరిస్థితి మెరుగు పడక మానదని ఆశించవచ్చు. పథకం ఎలాంటిదో అభ్యర్థులు ఎలాంటివారో స్థానిక ప్రజలే నిర్ణయించాలిసి వస్తుంది.

మొత్తం 94 సీట్లున్నాయి. అందులో హైదరాబాదులో 66, సికింద్రాబాదు నుంచి 28 కౌన్సిలర్‌లను ఎన్నుకోవాల్సి ఉంది ఇప్పుడయితే కాంగ్రెసు వారు 60 మంది ఉన్నారు. తర్వాత ఎక్కువ సంఖ్య ఉన్నది స్వతంత్రులకే వీరు 22 మంది. ఇప్పటి ఎన్నికల్లో అన్ని స్థానాలకు కాంగ్రెసు వారు మాత్రమే పోటీ చేస్తారు. తర్వాత ఇత్తెహాదుల్ పార్టీవారు ఎక్కువ స్థానాలను పోటీ చెయ్యాలనుకుంటున్నారు కమ్యూనిస్టు, జనసంఘ, సోషలిస్టు పార్టీవారు కూడా చాలా 'సీట్లకు' అభ్యర్థులను నిలబెట్టాలని ప్రయత్నాలు చేస్తున్నారు. పార్టీ, కుల, మత, వర్గ రహితంగా, మునిసిపల్ ఎన్నికలలో పోటీ చేసే నిమిత్తంగా, డొక్కశుద్ధిఉన్న కొంతమంది పెద్దమనుష్యులను నిలబెట్టాలని కొంత మంది ఆలోచన. ముస్లిమ్‌లీగ్ వారు కూడా ఈ సారి, రంగంలోకి దిగాలని తాపత్రయ పడుతున్నారు చివరికి ఎట్లా పరిణమిస్తుందో వేచి చూడాల్సి ఉంది!

పైదంతా సాంఘికం, రాజకీయం, ఇక సాహిత్యంలోకి వస్తే —రచయిత జీవన పరిస్థితి మెరుగు పడితే ఉత్తమ సాహిత్య సృష్టికి అవకాశం కలుగుతుందంటారు గోరా శాస్త్రిగారు ప్రెస్ క్లబ్ వారు ఏర్పాటు చేసిన సాహిత్యోపన్యాసాల్లో ప్రప్రథమైన ఉపన్యాసారాంశం ఇది. జాతిని కదిలించే ఉత్తేజకరమైన నవల, తెలుగులో ఇంత వరకు రాలేదని, జాతీయ జీవనంలో వచన రచనలకు ప్రముఖమైన స్థానం ఉందని, సాహిత్యోత్పత్తి అవుతోందేగాని, సాహిత్య విలువలు పడిపోతున్నాయని అన్నారు. 'మాలపల్లి' మినహాయిస్తే, తెలుగులో సాంఘిక నవలంటూ లేదనీ, ఆధునిక కాలం వేస్తున్న ప్రశ్నలకు, రచయితలు యే విధంగా సమాధానాలు సమకూర్చాలో తెలుసుకోలేక తబ్బిబ్బు లవుతున్నారని అన్నారు.

ఏకాంకిక, నాటిక, నాటకాల పోటీలు ఆంధ్ర నాటక కళాపరిషత్తువారు జరుపుతూ ఉండటం పరిపాటే! ఈ సారి అనంతపురంలో జరిగిన పోటీలకు, రాజధాని నుంచి మూడు నాటకాలు, ఒక నాటిక అర్హమైనవిగా నిర్ణయింప బడినాయి. ఆంధ్రప్రదేశ్ సెక్రెటేరియట్ సంస్థవారి 'సత్యం సుందరం' నాటకానికి ఉత్తమరంగాలంకరణకు, ఉత్తమ నటిగా శ్రీమతి సరస్వతి గారికి బహుమతులు వచ్చినాయి. విద్యానగర్ కల్చరల్ ఎసోసియేషన్ వారి నాటకం 'మరో మొహంజోదారో' ప్రదర్శనానికి రెండవ బహుమతి, రచనకు కూడా రెండవ బహుమతి వచ్చింది. దీని రచయిత

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### సాలార్‌జంగు భోజనం

నన్ను ముంచకపోతే నిన్ను ముంచేస్తానంటుందట కందిపొడుం
నన్ను నమలకపోతే నిన్ను నమిలేస్తాను అంటాదు వక్కపొడుం
నన్ను పడకట్టకపోతే నిన్ను చెడగొడ్తాను అంటాదు కాఫీ పొడుం
అమాయకమైనవి తతిమ్మా పొడుంల్లు సర్వం
అబ్బో! కందిపొడుంవుకు మాత్రం బోలెడు గర్వం
అని మా బావగారు భావిస్తారు
అందుకే బింగతావి సేవిస్తారు
కందిపొడుంవును శిక్షిస్తారు
కడుపారా భక్షిస్తారు.



శ్రీ యన్. ఆర్. నంది. శ్రీ విజయకళా సమితి సికింద్రాబాద్ వారు ప్రదర్శించిన 'యాచకులు' నాటకానికి ప్రత్యేక బహుమతి వచ్చింది. ఈ మూడు నాటకాలు, శ్రీ కె. సత్యనారాయణ మూర్తి 'కమలాకాంత్' వ్రాసిన 'చిట్టి' నాటికకు ఉత్తమ రచనకు ఉత్తమ ప్రదర్శనకు రెండవ బహుమతి లభించినాయి. ఇంకో విశేష మేమిటంటే, 'చిట్టి' పాత్రను అభినయించిన శ్రీమతి పార్వతికి, ఉత్తమ నటిగా బహుమతి లభించింది.

రైల్వే ఇన్‌స్టిట్యూట్ సికింద్రాబాద్ వారు ఈ 'చిట్టి' నాటికను రూపొందించారు. ఈ సంస్థ చాలా పురాతనమైనది. సర్వతోముఖంగా అభివృద్ధి చెందటానికి సభ్యులందరూ ఎంతో ఉత్సా[illegible] సభ్యులంతా, రైల్వే ఉద్యోగులే. దాదాపు ఐదువేలదాకా ఉన్నారు. రకరకాల భాషల వారికి అందుబాటులో ఉండేలాగున పది వేల గ్రంథాలతో, ఒక గ్రంథాలయాన్ని కూడా ఏర్పాటు చేసుకున్నారు. జానపద నృత్యాలు, నాట్య, నాటక ప్రదర్శనాలు,

59 వ పేజీ చూడండి

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ నా వెనుక ఏదో చప్పుడయ్యే సరికి, తృళ్ళిపడి వెను దిరిగి చూచాను. ఏమీ లేదు—ఎండిన మామిడాకులు! (నేనేం చేస్తానో అన్నట్లు భయపడుతూ) గాలికి దొర్లి దొర్లి పారిపోతున్నాయి. ఆ మామిడి ఆకులు కూడా నా కళ్లకు కొంటె పిల్లల్లాగా కనుపించాయి. దానికి కారణం, గడచిన పదిహేనేళ్ళుగా నిజమైన హెడ్మాస్టరీతనం నాలో జీర్ణించి పోయి ఉండటమే ననుకుంటాను.

ఆ పండుటాకులు చెట్ల చాటుగా పోయే సరికి తిరిగి నా రచనా సాగరంలో మునుగుదామని ప్రయత్నించాను. ఆహ్లాదకరమైన పిల్ల వాయువులు నా చెవిలో ఏదో చెప్పి పారిపోయాయి.

"శోభాయమానంగా వెలుగొందే ప్రకృతి మాతను చూచి ఆనందించకుండా, కలం కాగితం పట్టుకుని చెట్టు క్రింద కూర్చుంటావేమిటీ?" అంటూ ఆ పిల్ల వాయువులు నన్ను పరిహసించి పట్లనిపించింది.

ఒక సారి చుట్టూ కలయ చూశాను. నా కెదురుగా ఒక చక్కని దృశ్యం కనుపించింది. తోటపల్లి శిఖరాగ్రాలనుంచి వచ్చే నీరు అక్కడ ఒక పెద్ద ధారగా క్రిందకు పడుతోంది. బాల భానుని బంగారు కాంతిలో ఆ నీటి ధార ఎంతో రమ్యంగా ప్రకాశిస్తుంది. ఆ నీరే ఒక పిల్ల కాలువగా మారి, నాకు చాలా సమీపంగా మధ్య మధ్య గలగలమంటూ ప్రవహిస్తోంది. పిల్ల కాలువకిరువైపులా పెరిగిన అరటి చెట్లు నాకు ఘన స్వాగతాన్ని పలుకుతున్నాయి. ఆ స్వాగతాన్ని తిరస్కరించితే బాగుండదన్నట్లు అప్రయత్నంగా కలం మూసి, అటువైపు (ఇంకా కొంచెం ఎత్తు ప్రదేశానికి) నడిచాను. అంత ఎత్తునుండి ఒక్క సారి వెనుదిరిగి చూశాను. దూరంగా శాంతి ఆశ్రమం 'శాంతి ఆశ్రమం' లాగ కనుపించింది. ఆ పుణ్య స్థలాన్ని ఆయేటి వేసవి విడుదిగా ఏర్పరచుకొన్నందుకు నన్ను నేనే అభినందించుకున్నాను.

ప్రకృతి శోభను తిలకిస్తూ, నే చేయబూనిన పద్య రచన మధ్య మధ్య కొనసాగిస్తూ, మెల్లిగా 'శాంతి ఆశ్రమం'లోని మా విడిది చేరుకునే సరికి నాకు తెలియకుండానే సూర్యుడు నడి నెత్తి మీదకు వచ్చాడు. ఇంట్లో అడుగు పెడుతూండగానే, ఇల్లంతటా నాకొక నూతన శోభ కనుపించింది. నా రాకకై నిరీక్షిస్తున్న శాంత (నా భార్య) ముఖారవిందంలో ఏదో క్రొత్తదనం కనుపించింది. పదేళ్ల నా 'రాంబాబు', వాడి అక్క పన్నెండేళ్ల 'మాలతి' నన్నుచెరో వైపు పట్టుకున్నారు. వాళ్ల ముఖాలలో ప్రస్ఫుటంగా కనుపించే ఆతురత చూస్తూనే అనుకున్నాను. ఏదో వార్త వాళ్లు నాకు చెప్పనున్నారని వసారాలో పడక కుర్చీలో కూర్చుని, ఇద్దర్నీ దగ్గరకు తీసుకుంటున్నాను.

"నాన్నారూ! మరేమో!....." ఏదో చెప్పబోతున్న మాలతి నోరు నొక్కి, "నే చెప్తానుండు!" అంటూ నా వైపు చూచాడు రాంబాబు.

"మరేమో! నాన్నారూ!.... మరేమో....." వాడి తడబాటుకు అడ్డం వచ్చింది శాంత కాళ్ళు కడుక్కో డానికి చెంబుతో నీళ్లిస్తూ—



# పరిష్కారం

## ద్విభాష్యం సూరిడు

"సత్యానందం వచ్చాడండీ! ఉద్యోగంలో చేరి నప్పట్నుంచీ మిమ్మల్ని చూడ్డం కుదర్లేదని మనకోసం మనవూరు వెళ్లాట్ట. మనం ఇక్కడున్నామని తెలుసుకొని, తిన్నగా ఇక్కడకు వచ్చాట్ట. మనిషి ఎంతలా మారి పోయాడనుకున్నారు? లాగూ చొక్కాలతో కాలక్షేపం చేసిన సత్యానందం, సూటూ, బూటు వేషంలో కనుపించే సరికి నిర్ఘాంత పోయాను. మీరలా ఎక్కడికో వెళ్లారని చెప్పాను. మధ్యాహ్నం రెండు గంటలకల్లా మళ్లీ వస్తానన్నాడు."

ఆ వార్త నాకు ఆశ్చర్యాన్ని వెంటనే సంతోషాన్ని కూడా కలిగించింది. సత్యానందం అంతటి వాడవుతాడని నేనేనాడో అనుకున్నాను. సూటు, బూటు వేసుకుంటే సత్యానందం ఎలాగుంటాడో చూడాలని నాకు అనిపించింది.

భోంచేసి, పడక కుర్చీలో కూర్చున్నాను. నా ఆలోచనలన్నీ సత్యానందం గురించే!.......

...... పదకొండు సంవత్సరాల క్రిందటి మాట..

...గుంటూరు జిల్లా బాపట్లలో ఒక హైస్కూలు హెడ్మాస్టరుగా పని చేస్తున్నాను. ఒక రోజు ఉదయం ఇంట్లో కూర్చుని, పేపరు తిరగేస్తుండగా వయస్సు మళ్లిన పెద్ద మనిషి ఒకాయన, పది పన్నెండేళ్ల ఒకబ్బాయిని వెంట బెట్టుకొని వచ్చారు. ఆయనెవరో నాకు తెలియదు కాని, ఆయన మాట తీరు, పెద్ద తరహా, నన్నిట్టే ఆకర్షించాయి. ఆయన పిఠాపురం వద్ద ఒక పల్లెటూరికి కరణం గారుట. ఆ అబ్బాయి, ఎనిమిదవ తరగతి పరీక్షలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడయాడట. హైస్కూల్లో ప్రవేశ పెడదామనే ఉద్దేశ్యంతో బాపట్ల వచ్చారుట. ఒక హైస్కూలు సీటు కోసం అంత దూరం ఆయన ఎందుకు వచ్చారో నా కర్థం కాలేదు. పిల్లవాడి వంక ఒక సారి చూశాను. ఎందుకో వాడిమీద ప్రేమ, అభిమానం పుట్టుకొచ్చాయి.

రికార్డు షీటు పరిశీలిస్తూ, 'నీ పేరేమిటబ్బాయి' అని అడిగాను.

"సత్యానందమండీ!" నమ్రతగా జవాబిచ్చాడు ఆ అబ్బాయి.

మార్కుల లిస్టు చూస్తూ అడిగాను. "మరి పిఠాపురానికింత దూరంలో ఉండి చదువుకోగలవా? అస్తమానూ ఇంటికి పోతానంటావా?"

ఆ అబ్బాయి లేత హృదయాన్ని బాధ పెట్టానని



నేను వెంటనే అర్థం చేసుకున్నాను. ముఖం క్రిందకు వాల్చి, కళ్ళ వెంట నీళ్ళు కారుస్తున్నాడు. ఆ కరణం గారు చెప్పారు. "వీడు నా స్నేహితుని కొడుకండీ. తల్లి లేదు. తండ్రి సన్యసించి ఎక్కడికో వెళ్ళిపోయాడు. నేనే వీడికి దిక్కయ్యాను. ఊళ్ళో నా బంధువులు చాలా మంది ఉండడంచే వాళ్ళకప్పజెప్పి వెళ్తున్నాను. తమరు సీటు మాత్రం తప్పకుండా ఇప్పించాలి!"

నా ప్రశ్నకు నేనే నొచ్చుకున్నాను. ఆ మధ్యాహ్నం హైస్కూల్లో కలుసుకోమని చెప్పి పంపించేశాను.

పిల్లవాణ్ణి హైస్కూల్లో చేర్చిన తర్వాత స్వగ్రామం వెళ్ళడానికి సిద్ధంగా ఉన్న కరణంగారి ముఖం ఏదో సంకోచాన్ని వ్యక్తపరచడంలో ఆయన్ను సూటిగా అడిగేశాను— "దేనికో, సందేహిస్తున్నట్లున్నారు?"

ఆయన కొంచెం సంశయిస్తూ, చెప్పలేక చెప్పారు. "పిల్లవాడు ఈ వూళ్ళో వారాలు చేసుకుని ఉండాలి. వారంలో ఆరు రోజులు ఆరుగురి ఇళ్ళల్లో ఏర్పాటు చేశాను. ఏడవ రోజుకూడా ఏర్పాటు చేయడానికి మీకు తెలిసిన దాతలెవరైనా ఉంటే చెప్తారేమోనని...."

అప్రయత్నంగానే అన్నాను. "మీకు అభ్యంతరం లేకపోతే పిల్లవాడు మాయింట్లో ఒకనాడుండవచ్చునే!"

కరణంగారు మొహం ఇంత చేసుకున్నారు. ఆయన ముఖంలో కన్పట్టే తృప్తి, ఆనందం చూసి, నాలో తెలియని అనుభూతిని పొందాను. ఎవరో స్నేహితుని పిల్లాడి గురించి ఆయన తీసుకున్న శ్రమ నిజంగా నాకు ఆదర్శవంతంగానే కనుపించింది. పిల్లాడి బాధ్యతంతా నామీదే ఉంచినట్లు చెప్పి ఆయన స్వగ్రామానికి ఆనాడే వెళ్ళిపోయారు.

ప్రతి ఆదివారంనాడూ సత్యానందం మా ఇంట్లో ఉండేవాడు. 'అమ్మగారూ!' అంటూ ముచ్చటగా వాడు 'శాంత'ను పిలవడం, ఆప్యాయంగా ఆమె వాడికి భోజనం పెట్టడం చూసి మురిసిపోయే వాణ్ణి.! ఒక ఏడాది గడిచింది. సత్యానందం మంచి మార్కులు సంపాదించుకున్నాడు. కరణంగారి కోర్కెపై వేసవి సెలవులకి స్వగ్రామం వెళ్ళాడు.

# పరిష్కారం

...మరుసటి సంవత్సరం హైస్కూలు తెరిచాము. ఆ రోజే సత్యానందం వాళ్ల వూరినుండి వచ్చాడు. రాగానే 'శాంత' దర్శనం చేసుకుని, ఏమిటేమిటో చనువుగా చెప్పుకుపోతున్నాడు. ఎక్కడిదో ఆ అనుబంధం?! తల్లిలేని సత్యానందం చాలా అమాయకంగా కనుపించాడు నా కళ్లకి. వాళ్ల సంభాషణలో కొంత సేపటికి ఏదో ప్రత్యేకత కనుపించడంలో, సంగతి తెలుసుకుందామని దగ్గరకు వెళ్లాను.

వాడేదో పెద్ద పొరపాటు చేశాడన్నట్టు చెప్పింది శాంత.

"చూశారాండీ వీడు! రైల్లో వస్తోంటే ఎవడో పిణ్నించి, ఏదో అర్జంటు అవసరం వచ్చిందని ఐదు రూపాయలిమ్మని అడిగాట్ట! వాడెవడో చెప్పిన మాటలు నమ్మి, కరణంగారు వీడికిచ్చిన ఐదు రూపాయలూ వాడి కిచ్చేశాట్ట! దరిద్రుడు వాడెవడో వీడికే పంగనామం పెట్టాలా! వీడికైనా ఆ మాత్రం బుద్ధి ఉండనక్కర్లేదటండీ!"

బిక్క మొహం వేసుకుని నావైపు చూస్తున్న సత్యానందాన్ని చూసేసరికి నాకు చాలా జాలి వేసింది. మెల్లిగా వాడి బుజంమీద చెయ్యివేసి, "ఏం జరిగిందో నాకు చెప్పు బాబూ!" అన్నాను.

కారుతున్న కన్నీళ్లు తుడుచుకుంటున్నాడు సత్యానందం.

"వాడి మొహం! ఇంకేం చెప్తాడు. డబ్బు విలువ తెలిస్తేగా వాడికి! మళ్లీ అంతదూరం స్టేషనుకు నడచి వెళ్తాట్ట.! వాడెవడో వస్తాడనే ఇంకా వీడి నమ్మకం!" కోపాన్నంతా వెళ్లగక్కింది శాంత.

ఆమె మాటలు నాకు చిరాకు కల్గించాయి. "నువ్వుండు శాంతా! వాణ్ణి చెప్పనియ్యి!" అంటూ వాణ్ణి దగ్గరకు తీసుకుని మడత కుర్చీలో కూర్చున్నాను.

కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు సత్యానందం. జరిగిన సంగతంతా చెప్పాడు. "అది కాదండి మేష్టారు! పిఠాపురంలో రైలెక్కానండి. కూర్చుందికి చోటులేక బాధపడుతున్న నాకు ఒకబ్బాయి కొంచెం చోటు చూపించి, అతని పక్కనే కూర్చోమన్నాడండీ! గుంటూరులో బి.ఏ. చదువుతున్నాట్ట. నేనేం చదువుతున్నానో ఎక్కడుంటున్నానో అంతా కనుక్కుని నాతో చాలా చనువుగా మాట్లాడాడండీ. ఈ వూరు ప్రక్కనే ఒక పల్లెటూర్లో వాళ్ల చుట్టాలున్నారుట. వాళ్లని చూసి గుంటూరు వెళ్లవచ్చని, ఈ వూళ్లో దిగాడండీ! స్టేషన్నుంచి నేను ఇంటికి వస్తోండగా మళ్లీ నాకెదురయాడండీ. "తమ్ముడూ! నాకు కావలసిన పుస్తకం ఒకే ఒక్క కాపీ ఈ షాపులో ఉంది. నేనాలస్యం చేస్తే ఎవరైనా కొనేస్తారు. నా దగ్గర దారి ఖర్చులకే డబ్బు మిగిలింది. నీ దగ్గరో అయిదు రూపాయలుందన్నావు.—అది నాకిస్తే, మా చుట్టాల నడిగి, సాయంత్రం ఆరుగంటలకల్లా మళ్లీ నీడబ్బు నీ కిచ్చేస్తాను. కొంచెం ఈ ఉపకారం చెయ్యవూ?" అంటూ జాలిగా అడిగాడండీ. మా ఇద్దరి మధ్య ఏర్పడిన చనువు మూలంగా, నా దగ్గరున్న అయిదు రూపాయలూ అతనికియ్యకుండా ఉండలేకపోయానండీ మేష్టారూ! అతను నాడబ్బు నాకు తప్పకుండా ఇస్తాడండీ! అలా మోసం చేయడండి!"

వాడి చివరి మాటల్లో దృఢత్వం కనుపించింది. వాడు చేసిన పనిలో వాడికంత విశ్వాసం ఉండడం చూసి, అప్రయత్నంగా చిరునవ్వు నవ్వాను. నా చిరునవ్వు చూసి శాంత ఉండబట్టలేకపోయింది.

"మీకు పిచ్చేమిటండీ! కుర్రాడిలో లోకువ కనిపెట్టి, వాడెవడో ఆ అయిదు రూపాయలూ కాజేశాడు. వాడు చెప్పేదంతా చూస్తే అచ్చు మోసగాడి ఎత్తులా లేదూ?"

శాంతమీద నాకు కోపం రాలేదు. సత్యానందం చెప్పినదంతా వింటే ఎవరికైనా అలాగే అనుపిస్తుంది. కాని, వాడు శాంత మాటలతో ఏ మాత్రం ఏకీభవించలేదు. తన మాటనే వ్యతిరేకిస్తున్నాడని, శాంత కొంచెం కోపం తెచ్చుకోబోయింది.

అప్పుడు నేనన్నాను. "చిన్న పిల్లాడు. ఏదో ఉద్దేశ్యంతో సాహసించి చిన్నపని చేశాడు. వాడిమీద నీకెందుకంత కోపం శాంతా! చూద్దాం! వాడెవడో వచ్చి డబ్బు తిరిగి ఇచ్చేస్తానన్నాట్టగా. వాడివ్వనప్పుడే మందలిద్దువుగాని!"

నేనుకూడా సత్యానందం వైపు మొగ్గడం చూసి

---

డాక్టరు : నీవు రాత్రులందు చాలసేపు మేలుకో కూడదు.

రోగి : మరి నా పనిమాటేమిటి సార్!

డాక్టర్ : ఇంతకూ నీ పనేమిటి?

రోగి : వాచ్ మెన్ సార్.

ఎ. కృష్ణయ్య (తిరుపతి)

---

ఇంకేం మాట్లాడలేక, శాంత కోపంగా అక్కడనుండి వెళ్లిపోయింది.

వాస్తవికతను దృష్టిలో ఉంచుకొని చూస్తే చెప్పిన దాంట్లో తప్పేమీ లేదు. కాని, అప్పటి నా ముప్ఫై ఏళ్ల జీవితంలోనూ నేనేదైనా నేర్చుకున్నానని చెప్పాలంటే ఒక్కటే ఒక్క విషయం చెప్పగలను. మోసగాళ్లకే మోసం జరుగుతుంది. సత్యం, ధర్మం, రెండింటికోసం పాటుబడుతూ అమాయకంగా మనం ఏ పని చేసినా తప్పకుండా చివరకు మేలే కల్గుతుంది. ఆమెను నా జీవిత భాగస్వామిగా చేసుకున్న నాటినుండీ, శాంతకు ఈ విషయాన్నే చెప్తూ ఉండేవాణ్ణి. శాంత, నేచెప్పేదంతా శ్రద్ధగా వినేది. అయితే అవన్నీ ఈ కాలంలో చెప్పవలసినవి కావని ఆమె నమ్మకం నా ఉపన్యాసాలలో వాస్తవికత శూన్యమని వాదించేది. నా మాటలలో నిజాన్ని శాంత అంతకంటే అర్థం చేసుకోలేకపోయినా, ఆమెపై నాకు కోపం వచ్చేది కాదు. 'ఉత్తి అమాయకురాలు' అనుకునేవాణ్ణి! కాని చిత్రమేమిటంటే శాంత దృష్టిలో నేను అంతకంటే ఎక్కువ అమాయకుణ్ణి. అందుకే సత్యానందం చేసిన ఆ చిన్నపని, మా ఇద్దరి మధ్య ఒక సమస్యను కల్పించింది.

ఆ రోజు ఆదివారం అవడంచే సాయంత్రం ఆరు గంటలు కావస్తోం దనగానే, శాంత దగ్గరకు వెళ్లి తను బజారుకు వెళ్లడానికి అనుమతి ఇవ్వమంటూ అడిగాడు. శాంత వాడిమీద మండిపడింది. "ప్రయాణంచేసి అసలే నీరసంగా ఉన్నావు. నీ మంకుపట్టు వదలకుండా ఏమిటి నీ వేషం? వెళ్లాలనుకుంటే వెళ్లు. నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి! వాడెవడో రాలేదంటూ ఏడుస్తూ తిరిగి ఇంటికి వద్దువుగాని,' వంటింట్లోకి చెరచెరా వెళ్లిపోయింది.

శాంత అనుమతి ఇవ్వలేదని తెలిసినాగాని, సత్యానందం బజారుకు వెళ్లకుండా ఉండలేకపోయాడు. వాడూ అలా వెళ్లిన పది నిముషాలకి, నా స్నేహితులెవరో రావడంతో, వాళ్లతోకలసి నేనూ బయటకు వెళ్లి పోయాను.

......తిరిగి నేనిల్లు చేరుకునే సరికి రాత్రి పది గంటలయింది. ఇంటికి వస్తూనే శాంత నడిగాను 'సత్యానందం వచ్చాడా?' అని.

"వాడెవడో డబ్బు చెల్లిస్తాడని ఇంకావాడా బజార్లోనే ఉండి ఉంటాడు. వెర్రి మొహం వేసుకుని వస్తాడు చూస్తోండండి. పట్టుమని పన్నెండేళ్లయినా లేవు. వాడి కెంత పౌరుషమో చూడండి."

శాంత మాటలు నాకు చిరాకు కల్గించాయి.

"ఏమీ తెలియని కుర్రాడితో నీకీ పంతం ఏమిటి శాంతా? నేను వెళ్లి తీసుకువస్తా నుండు!" అంటూ బయల్దేరబోయాను.

"చిన్న కుర్రాడు వాడింకా అక్కడుంటాడుటండి. ఎవళ్లింటికో వెళ్లి పడుక్కొని ఉంటాడు. అప్పుడే టైము పది దాటుతోంది. భోజనానికి రద్దురూ!" శాంత నన్ను వెళ్లనివ్వలేదు.

మరునాడుదయం లేస్తూనే వాడికోసం బజారంతా గాలించాను. సత్యానందం కనుపించలేదు. శాంతమీద చెప్పలేనంత కోపం వచ్చింది. ఆరోజు వాడు స్కూలుకు కూడా రాలేదు. నా మనసులో ఆందోళన అంతా ఇంతా కాదు. వాడు కనుపించకపోతే ఏమిటి చెయ్యాలి? కరణంగారికి ఏమని బదులు చెప్పుకోవాలి?

కలత చెందిన మనస్సుతో సాయంత్రం స్కూలు విడిచిపెట్టగానే మళ్లీ బజారుకు వెళ్లాను. అన్ని పుస్తకాల కొట్ల దగ్గరకూ వెళ్లి వాడికోసం గాలించాను. నిరాశతో తిరిగి ఇంటికి వచ్చేస్తున్నాను. నా కళ్లు ఒక్కసారిగా మెరిశాయి. ఒక పుస్తకాల కొట్టు పక్కగా రోడ్డుపైనున్న మైలు రాతిమీద బక్కచిక్కిన సత్యానందం, నన్ను చూసి, నక్కి నక్కి దాక్కోడానికి ప్రయత్నిస్తున్నాడు. నేను వాణ్ణి సమీపించేసరికి వణికిపోయాడు.

కళ్లవెంట జలజలా నీళ్లు రాలుస్తూ "అతను రాలేదండి. అమ్మగారి మాటే నిజమైందేమో! నేను తప్పే చేశానండి! అమ్మగారేమంటారో!" వెక్కి వెక్కి ఏడ్చేశాడు.

"భోంచేశావా?" నేను ప్రశ్నించాను.

"లేదండి. ఆకలేసినప్పుడల్లా చెరువులో మంచి నీళ్లు తాగుతున్నాను."

"ఇవాళ ఎవరింట్లో నీ భోజనం?"

"బట్టల కొట్టు రామారావుగారింట్లోనండి."

"సరే కాని. నాకూడ రా!" మా యింటికి తీసుకు వెళ్తాను.

శాంత తను చేసిన తప్పు తెలుసుకొని పశ్చా

55వ పేజీ చూడండి

# సరాగమాల

వి.ఎ.కె. రంగారావు

శ్రీమతి పసుపులేటి కన్నాంబ కాలధర్మంతో మనకున్న కొద్దిమంది నిజమైన నటీమణులలో ఒక తార రాలిపోయింది. సంభాషణాచాతురితో సమానమైన ప్రతిభ గాత్ర మాధురిలో కూడా చూప గలిగిన ఒక మణిపూస ఇక మనకు కాకుండా పోయింది.

సుమారు పాతికేళ్ల క్రిందట నేపథ్య గాయకులు లేనేలేరు సరికదా కన్నాంబను మించిన గాత్రమే లేదు. మా చిన్నతనంలో పాడుకునే సినిమా పాటలన్నీ కన్నాంబ పాడినవే. " చండిక " చిత్రంలో ' ఏమే ఓ కోయిలా,' ' ఆనందమాయెనహా,' " మాయా మచ్ఛింద్ర "లో ' ఓ మాలతీ,' ' ధన్యంబయ్యెను,' " మాయ లోకం " లో ' అక్షయ లింగవిభో,' ఒకటా, రెండా, పదులు, ఇరవైలు. ఆనాడు ఈ నోటా ఆ నోటా పలికిన ఆమె పాటలు. " చండిక "లో ' నేనే రాణీనైతే ఏలనే ఈధర యేకధాటిగా ' వింటుంటే కంపించని వీరుడు లేడు. ' తానా పంతము నాతోనా ' అని " పల్నాటియుద్ధం "లో ఘుంక రిస్తుంటే వణకని భీరుడు లేడు. 'రావోయి ఇటు రావోయి,' 'ప్రేమ పూజారి' అను యుగళ గీతాలు నాగయ్యతో కలిసి ప్రైవేటు రికార్డులో పాడినవి, ఆలించి శృంగార రసలోలుడు కానివాడు లేడు. కన్నాంబ వేసిన వేషాలలో పురుషుని మించిన పౌరుషం కనబడేది. లావణ్యం రూపొందిన స్త్రీత్వం కనిపించేది. శృంగారమే మూర్తీభవించిన లాలిత్యం పలకరించేది. ఇవన్నీ ఆమె పాడిన పాటల్లో కూడా ప్రతిధ్వనించాయి.

ఈనాడు శివాజీ గణేశన్ సంభాషణా విధానమన్న పేరుతో చలామణీ అవుతున్న పటహాభేరీ కాహళ ధ్వన్యనుకరణలు ఇరవై యేళ్ల క్రిందట తెలుగులో, తమిళంలో కన్నాంబ ప్రవేశపెట్టినవే అంటే ఈనాడు శివాజీని కించపరచటం కాదు. ఆనాటి కన్నాంబ ఘనత గురించి నిజం చెప్పుకోవటమే. ఆమె కంఠంలో యెంతటి శక్తి, యెటువంటి అనుపమానమైన శక్తి వుంటుందో తెలుసుకోవాలంటే ఈ క్రింది ఉదాహరణ చాలు. " దీపావళి " చిత్రంలో సత్యభామ పాడి పాడిన 'సరియామాతో సమరాన' వరస కట్టేటప్పుడు కన్నాంబ ఆనాడు పాడిన ఒక ధీరగీతిని మనసులో పెట్టుకోవటమే కాకుండా ఆమె చూపగలిగిన భావావేశంలో పదవ వంతైనా ఈ పాటలో కనబడితే చాలను కున్నారు ఆ చిత్ర నిర్మాతలు. ఆ పాట పాడిన కోమల కన్నాంబ అంత బాగానూ పాడింది. అది వేరే సంగతి.

ఇరవై యేళ్ళుగా ఆమెను, ఆమె నటననూ ఆరాధి స్తున్నా, ముఖాముఖీ కలుసుకునే భాగ్యం రెండేళ్ల క్రిందటనే కలిగింది. " దక్షయజ్ఞం " చిత్రంలో ఆమె చూపిన నటన చూసి, నా ఆరాధన తెలుపక ఆగలేక రాజరాజేశ్వరీ వారి ఆఫీసుకు వెళ్లాను. సంగీత దర్శకులు సాలూరి హనుమంతరావు పరిచయం చేశారు. ఆ రోజు శుక్రవారం అవటం మూలాన తలకూ, వంటికీ నూనెరాసుకుని అభ్యంగన స్నానానికి వెళ్లబోతున్న కన్నాంబను చూశాను. ఆ ముఖంలో జ్యోతిలా వెలుగుతున్న కళానికాసిన్ని చూశాను. పదహారేళ్ల అమ్మాయిలలో కనబడని గ్లామర్ ఆమెలో కనిపించింది. రెండే మాటలు చెప్పాను. దాక్షా యణి వైధవ్యం సంభవించిన తరువాత ప్రకృతిని శపిస్తుంది. అప్పుడు తెరపై చూపిన ఆ బద్దలవు తున్న అగ్నిపర్వతాలూ, మింటినంటుతున్న సముద్రపు కెరటాలూ, దావానలంలో ప్రజ్వరిల్లిపోతున్న మహా రణ్యాలు, మీ నోటినుండి వెలువడిన ఒక్క వాక్యానికి సరిరావేదని. ఒకమారు నవ్వి 'ఆ మీ అభిమానం' అని స్వల్పంగా, యేమాత్రం అతిశయం లేకుండా అనగలిగింది కన్నాంబ.

ఆ ప్రజ్ఞాధురీణ ఇక మనకు లేదు. కాని భారత దేశంలో చిత్రం, పరిశ్రమ నిలిచినంతవరకు ఆమె నటన ఆదర్శప్రాయమై వుంటుంది. అసంఖ్యాకులైన అభిమానుల సంతాపాంజలి ఆమె సంస్మరణకు పెట్టని గోడలై, కట్టని మేడలై అలరుతాయి. ఆమె కుటుం బానికి వారందరి తరఫున సానుభూతి.

బంగారుతిమ్మరాజు జి. ఇ. 35438—35439.

ఈ చిత్రంలో ఆదినుంచి అంతం వరకూ అంద మయినది యేదీ అంటే కోదండపాణి సంగీతం. ఇవిగో మూడు పాటలు. మొదటి రికార్డులో వీధి భాగవతం ఉంది. మొదట్లో దరువులు కథక్ పద్ధతిలో వుండటం అవివేక మనిపించినా ఆ తరువాత కథా క్రమం భలేగా వుంది. దీనిని " లేడిని సీతా చూడక పోతే రావణుడొచ్చేనా, రామరామ సీతమ్మను చెరబట్టక పోతే లంకకు చేటేనా " అని స్వర్ణలత మొదలు పెడుతుంది. " అదిగో రావణాబ్రహ్మ అరుదెంచినాడు అదిగది గదిగది గదిగది గదిగది గదిగదిగో రావణా బ్రహ్మ " అని మాధవపెద్ది కలవగా రావణాబ్రహ్మ, ఉరఫ్ రాజనాల, ఉరఫ్ సి. రామచంద్రశర్మ ( రేఖా అండ్ మురలీ ఆర్ట్సు కాళహస్తి మహాత్యంలో నాత దుడు ) ప్రవేశం " పలుకే బంగారమా, పమగరిసా..." అంటూ తన మామతో జత చేరినాడు, అంటూ తన బాధ ఇలా అశోకవనమున శోకించుచున్న సీతమ్మగారితోచెప్పుకొంటాడు." మారుడు మనవాడు కాడు, తన మామతో జత చేరినాడు," అని రచనలో వీటూరి పాత పాటలకు, వరసలో కోదండపాణి కూచి పూడి భాగవతులకు కొంత ఋణపడివున్నా ఆరు నిమిషాలలో అంతటి సరదా కలుగజేసినందుకు అభి నందనీయులు. స్వర్ణలత, మాధవపెద్ది, రామచంద్ర శర్మ ఒకరిని మించినట్టు మరొకరు పాడారు. ఇంత చెప్పుకొని చిత్రంలో అంత చాకచక్యంగా (ఎగతాళీ కాదు, అతిశయోక్తి కాదు అసలు సిసలు నిజం) నృత్యం చేసిన రాజనాలను ప్రశంశించకపోవటం దోషమే అవుతుంది. పిల్లి కాలిన కాలులా చిందులువేసి నప్పుడు, పదితలకాయలూపూడకుండా చేతిలో పట్టు కుని కుప్పిగంతులు వేసినప్పుడు తనకు తానేసాటి అని పించుకున్నారు. చిత్రంలో ఆ దృశ్యం అంత రాణించ టానికి రాజనాల ఒక కారణం.

రెండవ రికార్డులో " బలేబలే " పాడింది జమునా రాణి. " బలేబలే బాగుంది, అలా అలా ఒళ్లు తేలి పోతుంది " అట. ఎందుకూ " నిన్నటి రాతిరి నిద్రలో కల తలసుకుంటే "నట. అబద్ధం. అలా జరగటానికి ఒకటే కారణం వుండగలదు. జమునారాణి పాట వినటం ఆమె కంఠాన్ని మనసులో ఉంచుకొనే వీటూరి ఈ పాటను వ్రాయటం, కోదండపాణి ఈ వరసను

59 వ పేజీ చూడండి



'డా॥ చక్రవర్తి'లో ఒకదృశ్యం




### జ రి గి న క థ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాధను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికికూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది.

## 5

మధు సుశీలను దగ్గిర కూర్చో బెట్టుకొని ఆడుకొంటూంటే సుధ వచ్చింది. "నువ్వూ మాతో ఆడతావా సుధా ?" అన్నాడు మధు.

"నేనేం ఆడను. వూరికే చూస్తాను."

"వూరికే యేం చూడక్కర్లా. వెళ్లు."

"నీకేం ? నేను ఇక్కడే కూర్చుంటాను." మెడలో గొలుసు తీసి తమాషాగా వేళ్ళతో తిప్పుకొంటూ కూర్చుంది. సుశీల ఆశగా తదేకంగా ఆ గొలుసుకేసి చూడసాగింది.

మధు ఏదో ఆలోచన వచ్చిన వాడిలా చటుక్కున సుధ చేతుల్లోంచి గొలుసు లాక్కుని సుశీల మెడలో వేసేశాడు. సుధ కొంపలు మునిగి పోయినట్టు కాళ్ళు రెండూ నేలకేసి బాదుకొంటూ హెచ్చు స్థాయిలో శృతి ఎత్తి ఏడవటం ప్రారంభించింది. దగ్గిరగా ఉన్న గదిలోంచి పార్వతి పరిగెత్తుకు వచ్చింది.

"ఏమైందే ? ఏడుస్తున్నావు ?"

"బావ.... నా గొలుసు...." సుశీలని చూపిస్తూ బావురుమంది సుధ.

పార్వతి సుశీల మెడలో గొలుసు ఉండటం చూసింది— "దాని గొలుసు నువ్వెందుకు తీశావు?" అంది తీక్షణంగా మధుకేసి చూస్తూ.

"ఈ గొలుసు దానిదేం కాదు. మా అమ్మది. అందుకే మా చెల్లికి వేశాను." అన్నాడు నిర్భయంగా మధు.

పార్వతికి తల తీసేసినంత పనయింది— "చాల్లే ! గొప్ప అన్నగారివి బయల్దేరావ్. పిల్లమెళ్లో గొలుసు తీసి దాన్ని ఏడిపిస్తావా ?" అంటూ సుశీల మెడలోంచి తిరిగి గొలుసు వూడ లాక్కుంది.

సుశీల బిక్కమొహం వేసి మధుకేసి చూసింది. మధు కోపంతో— "పెద్దత్తా ! అది నిజంగా మా అమ్మగొలుసు కాదూ ?" అన్నాడు.

పార్వతి జవాబే చెప్పకుండా గొలుసు గట్టిగా పట్టుకొని సుధని తీసుకొని లోపలికి వెళ్లిపోయింది. ఏడవబోయి ఆగి పోయిన చెల్లెల్ని చూశాడు మధు నిస్సహాయంగా— "రా చెల్లీ ! అమ్మమ్మ దగ్గిరికి వెళ్దాం" అంటూ సుశీలను తీసుకొని సుందరమ్మగారి దగ్గిరికి దొడ్లోకి వెళ్లాడు.

"అమ్మమ్మా ! సుధ మెడలో గొలుసు మా అమ్మదేకదూ ?"

"ఇప్పు డేమైంది ?"

"అసలు అమ్మదే కదూ ?"

"అమ్మదే. అయితే యేం ?"

"చెల్లాయికి ఒక్కసారైనా వెయ్యకూడదూ? నేను వేస్తే పెద్దత్త లాక్కుపోయిందేం ?"

సుందరమ్మగారు మాట్లాడలేదు. కొంతసేపు. "నీ కెందుకు. నువ్వూరుకో."

మధు తటపటాయిస్తూనే అన్నాడు— "కాదు అమ్మమ్మా ! మన చెల్లి ఉందిగా....."

సుందరమ్మగారు మధు మొహంలోకి చూస్తూ అన్నారు— "ఆ జ్ఞానం మీ అమ్మకే లేకపోయింది నాయనా ? ఇప్పుడే మనుకొంటే ఏం ప్రయోజనం ?"

ఇక ఆ గొలుసుకోసం తను ఎంత ప్రయత్నించినా వీల్లేదు కాబోలు— మధు కొంతసేపు మాట్లాడకుండా నించుని వెళ్ళిపోయాడు.

మరొకసారి. . . .

లెక్కలు చేసుకుంటూన్న సూర్యాన్ని తొట్టి నిండా నీళ్ళు తోడమంది సావిత్రి. సూర్యం పుస్తకాలు సర్దుకో బోతూంటే— "నేను తోడతాన్లే అన్నయ్యా ! నువ్వు రాసుకో." అన్నాడు మధు.

"వద్దు. నీకు చేతకాదు." సూర్యం పుస్తకాలన్నీ సంచిలోకి ఎక్కిస్తూంటే మధు నూతి దగ్గిరికి పరిగెత్తాడు. జామచెట్టు క్రింద సుశీల వక్కతే కూర్చుని గులక రాళ్లతో బువ్వాలాట ఆడుకొంటూంది. మధు హుషారుగా చేద నూతిలో వేశాడు. ఎక్కడి నుంచో బాణంలా పరిగెత్తుకు వచ్చిన సుధ గట్టిగా అరిచింది— "ఏయ్ మూగదానా ! ఇట్కు ఇటు."

మధు చటుక్కున తల తిప్పి చూశాడు. సుధ సుశీలను పడిపోయేలా ముందుకు తోసి వెక్కిరిస్తూ సపోటా చెట్లకేసి పరిగెత్తింది— మధు గిలకమీది తాడు వదిలేశాడు. బోర్లా పడి ఏడుస్తూన్న చెల్లెల్ని లేవదియ్యలేదు. శరవేగంతో సుధ వెనక పరిగెత్తాడు.

నీళ్లతో నిండి పైకి వస్తూన్న చేద జర్రున జారి ఘాం మంటూ నీళ్లలో పడి మునిగిపోయింది. ఆ శబ్దానికి బయటికి వచ్చిన సావిత్రి తన కళ్లను తను నమ్మలేక పోయింది. మధు సుధ జడ గట్టిగా పట్టుకు నిలదీశాడు.— "ఈసారి మా చెల్లిని వెక్కిరిస్తావా ? దానికి మాటలు రాకపోతే నీకేం ? నీకు బాగా వచ్చుగా ? ఇంకోసారి దాన్ని వెక్కిరిస్తే ఏం చేస్తానో తెలుసా ?" అంటూ జడకాస్తా వూడి వచ్చేలా పైకీ కిందికీ వూపుతున్నాడు.

"ఏయ్ ! ఏమిటదీ ? దాన్నెందుకు కొట్టున్నావ్ ?" సావిత్రి రెండంగల్లో వెళ్లి పడింది. మధు అప్పటికి సుధ జుట్టు వదల్లేదు. మరోసారి కసిగా వూపాడు.

"ఇంకోసారి వెక్కిరిస్తావా ? చెప్పూ !"

"అమ్మా !" అంటూ బావురుమంది సుధ. సావిత్రికి తగని కోపం వచ్చేసింది— "చాల్లే ! వూరుకో."

విసురుగా మధుని తోసి కూతుర్ని దగ్గిరికి తీసుకొంది. భయంతో బిర్ర బిగిసి పోయిన సుధ తల్లిని కావులించుకుని ఏడ్చేసింది. సుధ జడ వూడిపోయి వెంట్రుకలన్నీ చిందర వందరగా చెదిరి పోయాయి. బంతిపూలు నలిగి కింద రాలిపోయాయి. సావిత్రి మధుకేసి చూస్తూ కోపంగా అడిగింది— "ఏమిటి నీ పెంకితనం ? వూరుకొంటూన్న కొద్దీ మితిమీరిపోతున్నావే ! ఎందుకిలా పిల్లని వుత్త పుణ్యానికి..."

"అది మా చెల్లిని వెక్కిరించి తోసేసి పరిగెత్తుతోంది. తెలుసా ?" దురుసుగా అన్నాడు మధు.

"ఓహో ! ఇంతోటి అందకత్తెని వెక్కిరిస్తే ఏం నష్టం వచ్చిందీ ?" అంది సావిత్రి వెటకారంగా.

మధుకి మండి పోయింది— "మీ అమ్మాయిని రెండు తన్నే ఏం నష్టం వచ్చిందీ ?"

సావిత్రికి ఉక్రోషం వచేసింది— "గొప్పగా తయారవుతున్నావ్‌లే. తులశమ్మ కడుపున దురద కాడ పుట్టిందట. ఆ మహాతల్లి కడుపున నువ్వెలా బయల్దేరావు బాబూ ?" అంది ఈసడింపుగా. గల్లంతు విని సుందరమ్మగారు బయటికి వచ్చింది. సుధని మధు కొట్టి ఉంటాడనీ అందుకే కోడలు ఆర్భాటం చేస్తోందనీ వస్తూనే గ్రహించింది. అయినా ఏమీ తెలీని దానిలా అడిగింది— "ఏమైంద్రా ?"

సావిత్రి రుసరుస లాడుతూ కూతురి జుట్టు సరిదిదుతూ— మాట్లాడలేదు.

సుందరమ్మగారు మనవణ్ణి అడిగింది— "నువ్వు గాని సుధని కొట్టావా ?"

"ఆఁ కొట్టాను. ఏం ? వూరికే కొట్టానా ? ముందు అదే కదా సుశీలని తోసి పరిగెత్తింది ?"

సావిత్రి కోపంగా చూసింది— "చిన్న పిల్లలు ఏవో ఆడుకుంటారు. ఆటల్లో ఏడ్పుకుంటారు. అంత మాత్రానికి పిల్ల జుట్టంతా పీకి నిలదీస్తావా?"

"అసలు సుశి సుధతో ఆడనే లేదు. నీకు తెలుసా ?"

"ఛీ ! నీతో నాకు వాగుడేమిటి ?" చీదరించుకొంది సావిత్రి— "రావే వెధవ ముండా ! ఇంకా ఏడుపెందుకు ? ఆ పిల్లతో ఆడుకోపోతేనేం ? ఈ సారి వెళ్ళు. కాళ్ళు విరగొడతాను." అంటూ కూతుర్ని విసురుగా లాక్కు పోయింది.

సుందరమ్మగార్ని చూసి మధు కొంచెం జడిసినట్టు నిలబడ్డాడు.

"ఇలాంటి గొడవలు తేవద్దని నీకు ఎన్నిసార్లు చెప్పాను ? ఒక్క ఇంట్లో పిల్లలు అస్తమానూ దెబ్బలాడుకో వచ్చునా ?"

మధు నిర్దోషిలా అన్నాడు— "అది కాదు అమ్మమ్మా ! సుధ సుశీలని......"

"పోనీలే. సుధ మాత్రం చిన్నది కాదూ ? పాపం దానికి ఏం తెలుసు ? అత్తకి చెప్తే మందలించేదిగా ?"

మధు తప్పుచేసిన వాడిలా తల దించుకున్నాడు.

"ఇంకెప్పుడూ సుధని కొట్టకమ్మా ! అనవసరంగా నిన్ను చెడ్డవాడంటారు."

మధు మాటాడలేదు.

ఇంట్లో వాడకానికి నీళ్ళు లేవు. చేదవెళ్ళి నూతిలో కూర్చుంది. ఆ రోజు వంట వంతు పార్వతిది. నీళ్ళు లేక పని ఆలశ్య మవుతోందని విసుక్కొంది. పక్కింటి వాళ్ళ దగ్గిర చేద తెచ్చి నీళ్ళు తోడుకుని వంట చేస్తున్నంత సేపూ "పాడు మేళం— వెధవ సొద." అంటూ విసుక్కొంటూనే ఉంది. సుధ పెంకిగా విశ్వనాథయ్య భోజనానికి వచ్చేవరకూ ఏడుస్తూ కూర్చుంది.

"ఎందుకు తల్లీ ఏడుస్తున్నావు ?" అంటూ విశ్వనాథం సుధను ఎత్తుకొని బుజ్జగిస్తోంటే పార్వతి సావిత్రిద్వారా విని .... ఏకరువు పెట్టింది. అసలు జరిగిన దానికీ విశ్వనాథయ్యకు తెలిసిన దానికీ పోలికే లేకుండా పోయింది. మధ్యమధ్య బావగారికి విన్పించేలా తలుపు చాటున నిలబడి సావిత్రి కూడా అందించింది— "సూర్యాన్ని నీళ్ళు తోడనివ్వలేదు సరిగదా తను ఒక్క చేదడైనా తోడలేదు. అంతలోనే నూతిలో ఎత్తేసి పరిగెత్తాడు." సారాంశం— మధు బాగా పెంకితనం చేస్తూ పెద్దవాళ్ళందర్నీ ధిక్కరిస్తున్నాడు. ప్రొద్దున సుధ ఏదో చేసిందని వంక పెట్టి దాన్ని చావగొట్టి చెవులు మూశాడు. కేకలేస్తే ఎదురు తిరుగుతున్నాడు. నువ్వెంత అంటే నువ్వెంత అంటున్నాడు. కాబట్టి ఆ పిల్లవాడికి కాస్త మొగవాళ్ళ భయం ఉంటేనే గాని బావుండదు.

విశ్వనాథానికి— చాలా కోపం వచ్చింది. మధు గురించి చెప్పింది స్వయంగా తన భార్యే. పార్వతి ఎప్పుడూ అబద్ధం చెప్పదు— ఆ కోపంతో అరుగు మీద సుశీలకు కబుర్లు చెప్తూ కూర్చున్న మధువెనకగా వెళ్లి చెవిపట్టుకు లేవదీశాడు. చెంప మీద ఛెళ్ళున చరిచాడు. నిర్ఘాంత పోయిన మధు బాధతో బావురు మన్నాడు.

"నోర్ముయ్ ! అల్లరి వెధవా ! పెద్ద వాళ్ళందర్నీ ధిక్కరించేంత మొనగాడివై పోయావేం ? జాగ్రత్త ! కాస్త కడుపులో భయం పెట్టుకు తిరుగు." విశ్వనాథం— మళ్ళీ చెయ్యి ఎత్తబోతే కెవ్వుమంది సుశీల. మదుని మరోసారి హెచరించి



# కూలిన గోడలు

కొవలికి వెళ్ళిపోయాడు విశ్వనాథం— వెక్కివెక్కి ఏడుస్తూ నిలబడ్డాడు మధు. సుశీల దగ్గిరగా వెళ్ళి మధు చెయ్యి పట్టుకొంది—"ఏడవకన్నయ్యా!" సుశీల నేత్రాలు జాలిగా ప్రాధేయ పడుతున్నాయి.

మధు చొక్కాతో కళ్ళు ఒత్తుకొంటూ౦టే సూర్యం వచ్చాడు— "ఏమైంది మధూ ? ఏమైంది ? ఏడుస్తున్నావా ? ఎందుకురా ?"

సుశీల చెంపల మీద కొట్టుకుని చూపించింది.

"కొట్టారా ? ఎవరు ?"

చెయ్యి ఎత్తుగా పెట్టి చూపించింది.

"పెద్ద మామయ్యా ? ఎందుకు ?"

దానికేమీ జవాబు చెప్పలేక పోయింది సుశీల.

సూర్యం మధు చెయ్యి పట్టుకొంటూ అడిగాడు— "మామయ్య నిన్నెందుకు కొట్టాడురా? ఏం జేశావ్ ?" మధు ఒక్కసారిగా సూర్యాన్ని కావిలించేసుకున్నాడు.

"అన్నయ్యా ! నేనేమీ చెయ్యలేదు. మామయ్య వూరికే కొట్టాడు." అంటూ ఏడ్చాడు.

సూర్యం చాలాసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు. మధు తలమీద చెయ్యివేస్తూ— "ఏడవకు తమ్ముడూ ! అమ్మమ్మకి చెప్దాంగా ?" అన్నాడు. ఆ సంగతి తెలిసినా సుందరమ్మగారు నిట్టూర్చటం తప్ప ఏమీ చెయ్యలేక పోయింది.

జానకి మాత్రం కొంచెం సేపు బాధగా ఏదో అనుకొంది.

ఆ సంఘటనతో సుధ మీద మధుకి చాలా కోపం సేరుకొంది. ఎప్పుడు కసి తీర్చుకుంటానా అన్నట్టు సుధకేసి ఎర్రగా చూశాడు.

*   *   *

ఆ రోజు పిల్లలంతా వీధిలో చింతచెట్టు కింద ఆడుకొంటూ౦టే మధు సుధని ఉద్దేశ్యించి పరోక్షంగా వెక్కిరించాడు— "ఒరేయ్ ! హరీ ! నేను ఒక అమ్మాయిని చూశాను. అది ఉత్త అబద్ధాల కోరు. ఛీ ! ఎన్ని అబద్ధాలు చెప్తుందో తెలుసా ?"

"ఎవర్రా అది ?"

సుధకేసి సైగ జేశాడు మధు— "నీకు తెలీదురా! ఉందిలే. ఎర్రగా పండుకోతిలా ఉంటుంది. వెధవ పిలకజడా అదీనూ."

సుధ విసురుగా లేచి నిలబడింది పిలక జడ ఎగిరి పడేలా.

"తెలిసి పోయిందిరోయ్ ! నాకూ తెలిసి పోయిందిరోయ్ !" ఉత్సాహంగా అరిచాడు హరి.

"దానికి ఉత్త కుళ్ళుపోతు గుణంరా."

"ఏయ్ బావా ! నువ్వు నన్నే అంటున్నావు కదూ ?" ఉక్రోషంగా అడిగింది సుధ.

"నిన్నేంకాదు లేవోయ్ ! నువ్వేం ఎర్రగా ఉన్నావా ఏమిటి ?"— మధు.

"నీకేం పిలకజడ ఉందా ఏమిటి ?"— హరి.

"అయినా ఒరే హరీ ! ఆ పిల్లకి మరీ చెడ్డ గుణంరా ?"

"అవున్రోయ్ ! చాలా చెడ్డగుణం."

"దానికి తొస్సి పన్ను కూడా ఉందిరోయ్."

సుధ పళ్ళు కెలుక్కుంది. నిజంగా మొన్న పన్నొకటి వూడిపోయిందిగా ?

"ఆ పిల్ల అందంగానే ఉంటుంది కదురా ?" —హరి అడిగిన దానికి చప్పరించేశాడు మధు— "ఆఁ పోదూ ? సింగినాదం. అదిగో — ఆచెరువు గట్టున మేస్తోంది. గాడిద పిల్ల అందంగాలేదా ఏమిటి ?"

"మధూ హరీ అరుచుకొంటూ౦టే ఏమిట్రా ?" అంటూ మరి నలుగురు పిల్లలు చేరారు.

మధుగాడితో వో పిల్ల దెబ్బలాడిందిరా ! అది అస్సలు మంచిది కాదు....." వివరించాడు హరి సుధకేసి సైగచేస్తూ. పిల్లలంతా ఘొల్లు మన్నారు.

"అలాగే. అలాగే. మా అమ్మతో చెప్తాను ఉండండి." అంటూ పరిగెత్తింది సుధ. హరికి కొంచెం భయం వేసింది — "ఒరేయ్ మధూ ! మీ అత్త తిట్టదుట్రా"

"ఓస్ ! ఎందుకు తిడుతుందేవిటి ?"

"మరి మీ మామయ్య కొట్టడుట్రా ?"

కొంచెం ఆలోచనలో పడ్డాడు మధూ— సుధ వెళ్ళిందో లేదోనని చూశాడు.

సుధ పరిగెత్తుకు వెళ్తో౦టే సుందరమ్మగారు ఎదురు పడింది— "ఏమిటే ఆ పరుగు ? ఏమైంది ?"

"చూడు నాయనమ్మా ! బావ నన్ను వెక్కిరిస్తున్నాడు. నేను ఎర్రగా కోతిలా ఉన్నానట. నా జడ వెధవ పిలకలా ఉందట. నేను అన్నీ అబద్ధాలే చెప్తున్నానట.

సుందరమ్మగారు నవ్వింది— "అంత మాట అన్నాడూ ? రానీ ! నేను అడుగుతాను." నాయనమ్మ వోదార్పు సుధకి చాలలేదు— "వూహూ ! నేను మా అమ్మకే చెప్తాను. అస్తమానూ నన్నెందుకు వెక్కిరించా లేమిటి ?"

అంతలోనే మధు పరిగెత్తుకు వచ్చాడు—

"ఉత్తదే అమ్మమ్మా ! నేను సుధని అనలా. కావాలంటే హరిని అడుగు."

సుధ ఎగిరి పడింది — "నువ్వు నన్ను అనలా? ఎర్ర కోతిలా ఉన్నాననలా ?"

"నువ్వు ఎర్రగా ఉన్నావు గానీ కోతిలా ఉన్నావా ఏమిటి ? అందంగా ఉన్నావుగా ?"

"నా జడ వెధవ పిలకలా ఉందన్నావుగా ?"

"నీ జడ పిలకలా ఏం లేదు. ఎంచక్కా పొడుగ్గా ఉంది."

"నేను అన్నీ అబద్ధాలే చెప్తా ననలేదూ ?"

"నిన్ను కాదే సుధా ! మా క్లాసులో ఒక పిల్ల ఉంది. అది అన్నీ అలాగే చెప్తుంది— అస్సలు నువ్వు అబద్ధాలు చెప్పవుగా ?" సుధని సమర్థించేసరికి మధుకి మండి పోయింది ఒళ్ళు.

51వ పేజీ చూడండి




నీలాంటికళ్ళ కెక్కడా చూడలా ... ఎన్ని అద్దాల్లో చూసినా సరిగానే చదవ లేవేమిటీ ? ?!

"నా కసలే చదువు రాదండి ! !"



బహుశా మీరు చెప్పలేరు...
కాని ఆమె ముఖము
మీద మచ్చలున్నవి !

కొంచము నిదానించి చూడండి...
ఇప్పుడు ఈమె ముఖము మీద
మచ్చలు కనిపించుట లేదు !




మీరు ఎల్లాగ చెప్పగలరు. ఈమె తన ముఖమందలి మచ్చలను లాక్టొ-కేలమైనుతో మరుగు పరుచుకొంది. లాక్టొ-కేలమైను ఒక అత్యుత్తమమైన 'పౌడర్ బేస్.' దీనిని ఉపయోగించుట వలన మీ ముఖ చర్మమందలి దోషములు మరుగుపడును. మీ చర్మము మృదువుగాను మరియు కాంతివంతముగాను వుండును.

# లాక్టొ-కేలమైను ముఖములోని మచ్చలను మొటిమలను కప్పిపుచ్చును!

లాక్టొ-కేలమైనులో శీఘ్రముగా పని చేసే ఉత్తమమైన కేలమైను వుంది. అది ముఖ చర్మమునకు చాలా లాభదాయకమైనది. దీనిని ఉపయోగించుటచే చర్మము మృదువుగాను మరియు కాంతివంతముగాను వుండును. దీనివలన మీ సౌందర్యమధికమగును. లాక్టొ-కేలమైను ముఖము మీది మచ్చలను మొటిమలను కప్పిపుచ్చి వాటిని తొలగించుటకు సహాయపడును.

లాక్టొ-కేలమైను ముఖము మీది మచ్చలను తొలగించును. ఎండ తీవ్రతవలన కలిగిన మచ్చలను పోగొట్టి వేడిగాలినుండి చర్మమును రక్షించును. చంటిపిల్లల రేగిన చర్మమును కూడా మృదువుగా నుంచును.

సౌందర్యసాధకమైన లాక్టొ-కేలమైను శ్రేణికి చెందిన లోషన్, క్రీమ్, మరియు టాల్కమ్ పౌడర్ కూడా దొరుకుచున్నవి.

లాక్టొ-కేలమైను—మీ సౌందర్య సాధనము! క్రూక్స్ ఇంటర్‌ఫ్రాన్ లిమిటెడ్, బొంబాయి-18
BI-CI-5 TEL.

# సుఖం ఎరుగని



# జీవితం

## సింగరాజు చంద్రశేఖరరావు

"వెరైటీ చౌకు" వైపుగా నడుస్తున్నాను.

'రాజా!' పరిచయ కంఠం వినిపించేసరికి గబుక్కున వెనక్కు తిరిగాను.

నవ్వుతూ, ఎదురుగా కనిపించింది పిన్ని కూతురు పార్వతి!

ఆశ్చర్యంతో స్తబ్ధుడనయ్యాను. ప్రెసిడెంటు కెనడీ దారుణంగా హత్యగావించ బడ్డాడని ప్రముఖ దిన పత్రికలు ఘోషించిననాడుగాని, అనుకోని అదృష్టము మిత్రుడు భాస్కర్రావ్ని వరించిన నాడుగాని అంతగా ఆశ్చర్య పడలేదు కాని ఇప్పుడు — ఈ క్షణంలో — ఆశ్చర్యపడుతున్నాను. కారణం — పిన్నికూతురు పార్వతిని ఈ ఛాయల్లో చూడటమే....

నన్ను నేను నమ్మలేని స్థితిని వచ్చాను.

నిత్య జీవితంలో ఇలాంటి సందర్భాలు, సన్నివేశాలు సంభవించడం సహజమని తెలుసుకునే వయస్సులో ఉండి కూడా ఆ విధంగా తబ్బిబ్బు కావడం అనేది చెప్పుకోతగ్గ విశేషం!

'సందేహం లేదు. ఆమె పార్వతే!'

మనిషి లావెక్కినా ఆమెలో వెనుకటి పోలికలు ఇంకా మాసిపోలేదు.

యాంత్రికంగా ముందుకు నడిచాను.

నిశితంగా ఆమెను ఆపాదమస్తకం పరిశీలించడం తప్ప అప్పట్లో మరింకేమీ చేయలేక పోయాను.

"అన్నయ్యా! నేను పార్వతిని గద్రటా.... మరి, అట్లా చూస్తావ్? ...... పరాయి మనిషిలా!" చిరునవ్వు చిందిస్తూ పార్వతి అనేసరికి ఈలోకంలోకి వూడిపడ్డాను. పార్వతి ఎర్రగా, బొద్దుగా, చక్కగా ఉంది.

"నువ్వా పార్వతీ! ....... ఎంతగా మారిపోయావ్? ............ గుర్తు పట్టలేదంటే నమ్ము!" ఆపుకోలేని ఆనందంతో గబ, దబ మాట్లాడేశాను.

నాగపూర్ విద్యార్థి సంఘం నిర్వహించిన కథల పోటీలో మొదటి బహుమతి పొందిన కథ.

"ఆవరయ్యా బాబూ ! అవ్వు ....... నీతో ఏమొచ్చినా కష్టమే -- ఒట్టి కంగారు మనిషివి....... సరే.......... ఈ కబుర్లకేంగాని, నీముందున్న పెద్దమనిషి ఎవరో తెలుసు కున్నావా ? ........ నువ్వెవరివో ఆయనకు తెలుసా ?....... అందుకే అన్నారోయ్ — మనని ఆంధ్రులమని !" చిలిపిగా నవ్వుతూ ఆయన వంక చూసింది

అప్పటికిగాని, పార్వతి ప్రక్కనఉన్న యువకు డెవరో తెలుసుకుందామన్న అభిలాష కలుగలేదు.

"మరి పరిచయం చెయ్యి. చంపక, పెద్ద నస్పెన్సూ, సుస్పెన్సూ !" చిరుకోపం నటించాను.

"అబ్బో ! అన్నయ్యగార్కి కోపం వస్తోంది బాబోయ్ -- వదినగారు కూడా దగ్గర లేదు." అని నవ్వి.

"వీరు శ్రీధరం — మా శ్రీవారు.
వీడు మా అన్నయ్య — రాజశేఖరం."
గౌరవపూర్వకముగా కరస్పర్శ చేశాను.

"ఇది సర్ ఫెక్కు నార్తు ఇండియన్ స్టైలు ..... ఏమంటావ్ మేడమ్ ? ........" చిలిపిగా అంటు న్నారు. శ్రీధరం ఆమె కళ్ళలోకి చూస్తూ "కరెక్టు!" అంటోంది పార్వతి ఆయన చూపులనుండి తప్పించు కుంటూ.

శ్రీధరం చొరవ చేసుకొని మాట్లాడసాగారు. పరధ్యానంగా ఇష్టంలేని సంభాషణలో తలదూర్చానన్న మాటేగాని, బుర్ర పరి, పరి విధాల పోసాగింది. అనేకమయిన గతస్మృతులు నన్ను కలవర పెట్ట సాగాయ్. ముఖ్యంగా నన్ను వేదించే ప్రశ్న ఒకటే —

"అమరేంద్ర ఏమయ్యాడు ? ..." ఆలోచన లతో సతమతమవుతూ కూడా, పార్వతి ప్రశ్నలకు సమాధానమిస్తూన్నానే కాని మనసు అక్కడలేదు.

"మీరేం చేస్తున్నారు ?" శ్రీధరంగారి ప్రశ్న.

"ఎం. ఏ. చదువుతున్నాను — ఎల్. ఎ. డి. కాలేజీలో !" ఆలోచించకుండానే తపిమని సమాధా నమిచ్చాను. శ్రీధరం పెద్ద పెట్టున నవ్వారు.

"వండ్రఫుల్ ! అన్నయ్యా, అమ్మాయిల కాలే జీలో అబ్బాయికి ...... అందులోనూ .... ఎం. ఏ.లో సీటు ఇచ్చారా ? ..... భలే. భలే .... ఏం, నీమనసు ఇక్కడ లేదేంటి ? — వదినగారి యోగక్షేమములు గట్రా తెలుస్తున్నయ్యా లేక వన్ వే ట్రాఫిక్కా ..." చురుకుగా నావంక చూసి.

"నయం, 'సరస్వతీ విద్యాలయం'లో ఏదో క్లాసు చదువుతున్నావేమో, కొంపదీసి జ్ఞాపకం చేసుకో" కిల, కిలా నవ్వేసింది పార్వతి.

అప్పటికి తెలిసింది నాతప్పు. పరధ్యానకు నన్ను నేను తిట్టుకొని వాళ్ళతో మాటలు కలిపాను.

"'వదినా' 'వదినా' అని పట్టించావేమిటి?.. నాకింకా ఒడదిక్కు లేదు తెలుసా !" అన్నాను కళ్ళు పెద్దవి చేస్తూ.

"మైగాడ్! ఈజ్ ఇట్? .... అయితే మంచి వదినను వెతుకుదాములే ....... ఐప్రామిస్ ......ఇక్కడ కాదు — మనదేశంలో !" చిలిపి పిల్ల పార్వతి ! తను నవ్వుతుంది, ఇతరులను నవ్విస్తుంది. ముగ్గురం 'రెస్టారెంటు 'లో కాఫీ త్రాగాము. శ్రీధరంగారు 'సిగిరెట్ ' కొరకై బయటకు వెళ్ళారు.

"పారూ ! అమరేంద్ర ఏమయ్యాడు ? ..." సందేహానివృత్తికై సాధ్యమయినంత తగ్గు స్థాయిలో అడిగాను. వెంటనే పార్వతిలో మార్పు రావడం గమనించాను. ఆమె ముఖం నల్లబడింది. కళ్ళు జేవురించి నాయ్. అప్రయత్నంగా ఆమె కన్నీటి బొట్టు నా పాదాలమీద పడింది. ఆకస్మిక సంఘటనకు అదిరిపోయాను. కాని తమాయించుకొని.

"అదేమిటి పారూ, ఏడుస్తున్నావా ? ... ఛా ! తప్పుకదూ ! నువ్వు ఒకప్పుడు అన్నావు గుర్తుందా — 'పుట్టింది అమ్మాయిలా, అయినప్పటికి బెంబేలు పడి విచారించవని' మరి ఈ కన్నీళ్ళకు అర్థం ?...." సముదాయింపు ధోరణిలో అన్నాను.

పార్వతి జీరబోయిన గొంతుకతో "వద్దు రాజా ! ఎందుకు నావేత చెప్పిస్తావ్ ? .... ఒకనాటి నానిర్ల క్ష్యపు చేష్టలకు బలి అయ్యాడు అమరేంద్ర. పాపం., మొన్ననే తెలిసింది ఆతనికి పిచ్చి ఎక్కిందట" పెద్ద రాయితో నెత్తిమీద కొట్టినట్లుగా ఫీల య్యాను. గుడ్లప్పగించి చూడటం తప్ప ఆలోచనా శక్తి నాలో నశించింది. ప్రాణమిత్రుడు, సహృద యుడు అయిన అమరేంద్రకు పిచ్చి ఎక్కడానికి మూర్తీభవించిన కారణం పార్వతి ! పార్వతిని ఏమి చేసినా పాపం లేదన్నంత కోపం వచ్చింది. ఆమెను చూడాలంటే చాలా అసహ్యం వేసింది. ఆవేశంతో అన్నాను......

"మంచీ, చెడూ యోచన కలిగిన మానవుడెవ్వడూ నీ ప్రవర్తనను హర్షించలేడు. పార్వతీ ! — అమాయ కుడ్ని నాశనం చేశావ్. — నిన్ను భగవంతుడు మెచ్చడు."

"క్షమించరా, అన్నయ్యా ! సమయము వచ్చి నప్పుడు సవిస్తరముగా చెబుతా కాని, ఆవిషయములు ఆయనకడ ఎత్తి వచ్చటి నా సంసారంలో చిచ్చు పెట్టవని ఆశిస్తున్నాను." అంతటి కోపంలోనూ పార్వతిని చూశాను. దీనంగా ఆమె తలవంచుకొంది. జల, జల కన్నీళ్ళు ప్రవహిస్తున్నాయి. ఎందుకో ఆమెపై అమితమయిన జాలి కలిగింది. తప్పు చేసినా, చెల్లెలి జీవితంతో చెలగాటమాడుటకు మనస్సంగీ కరించలేదు. క్రమంగా కోపం చల్లారింది.

"నీ సుఖం కంటే ఎక్కువగా ఆశించేది ఏదీ లేదు పారూ — నన్ను పూర్తిగా నమ్ము !" ఆప్యా యంగా ఆమె భుజంపై చెయ్యి వేశాను.

"నాకు తెలుసు, నువ్వు మా రాజన్నయ్యవు కదూ !" నిండుగా నవ్వింది పార్వతి. కన్నీళ్ళు పైట చెంగుతో తుడుచుకుంటూ.

తృప్తిగా ఆమెవంక చూశాను.
ఇంతలోకి శ్రీధరంగారు వచ్చారు.

"నాగపూర్ గురించి మీ అభిప్రాయం ? " విలాసంగా పొగ వదులుతూ ప్రశ్నించారు శ్రీధరం.

"అందమయిన నగరం" తాపీగా అన్నాను.

"మీతో పూర్తిగా ఏకీభవించ నప్పటికొంత వరకు ఒప్పుకుంటాను — కలకత్తాలాంటి 'డర్టీ' నగరాల కంటే చాలా మెటుకు నయం — పరి శుభ్రత విషయంలో" ఆయనే అన్నారు.

"ఇక్కడ స్త్రీకి చాలా విషయాలలో మన ప్రాంతాలలో కంటే ఎక్కువ స్వాతంత్ర్యము ఉంది. కాని చెప్పుకో తగ్గ విశేషం ఏమంటే ఆమె తన స్వేచ్ఛను చెడుమార్గాలలో వినియోగించుకోదు."

నిజమేనని ఒప్పుకున్నాను. బజారు వైపుగా చూశాను. రెండు జడల మరాఠీ అమ్మాయిలు జంటలుగా సైకిళ్ళమీద వెళుతున్నారు.

అటే వైపుగా చూస్తున్న శ్రీధరం "చూడండి, స్త్రీలు కూడా విచ్చలవిడిగా సైకిళ్ళమీద పోతు టారు. అది ఆంధ్రదేశంలో మచ్చుకైనా కనిపించదు." అని "బావగారూ, మీ చెల్లెలి 'అద్దె గుర్రం' స్టోరీ వింటారా ? ...... అదో పెద్ద గాధలెండి..." ఈమధ్యగారు నేర్చుకుందామని కసిపట్టిన సైకిలు ముచ్చటగా మూల బడింది. పాపువాడు ఒకటే గోల. వోదార్చలేక చచ్చాను అనుకోండి" శ్రీధరంగారు పెద్దగా నవ్వారు.

"పచ్చి అబద్ధం ! — సైకిలుకేం విక్షేపంలా వుంది. కావాలంటే మిమ్మల్ని కూడా ఎక్కించుకొని తొక్కగలను తెలుసా !" పార్వతి అంది కళ్ళు పెద్దవి చేస్తూ.

"ఆ పని మాత్రం తలపెట్టకు ప్రమాదం ఉంటుంది" ముగ్గురం నవ్వాము.

కొంతసేపు మాట్లాడిన తరువాత, శ్రీధరం గారు రిక్షా మాట్లాడుతున్నారు. పార్వతి వెళ్ళడానికి ఉద్యుక్తురాలయింది. ఆయన వాళ్ళ ఇంటి యడ్రసు నాకు ఇచ్చి నన్ను రమ్మని ఆహ్వానించారు.

"ఒరేయ్ ! అన్నయ్యా ! నేను ఆదివారం ఎని మిది గంటలకు — ఉదయం — నీ కోసరకై మా వాకిట్లో నిలబడి ఉంటాను — రిసీవ్ చేసుకొనే ఫోజులో. శ్రీవారు పేపరు చదువుతూ ప్రక్కనే కూర్చుని ఉంటారు. అట్టి సమయమున నీవు మా ఇంటికి .... అనగా ... యడ్రసులో ఇవ్వబడిన 'ప్లాటు' నకు రావాలి — అంతే ! లేకపోతే తెలుసుగా. నా సంగతి . . సోమహారం నీ 'రూం' ముందు సత్యా గ్రహం. పికెటింగు వగైరా, వగైరా .... గుర్తుం చుకో" పార్వతి నవ్వుతూ రిక్షా ఎక్కింది. పోతున్న ఆ దంపతులను చూస్తూ నిలబడ్డాను.

అన్యోన్యమయిన దాంపత్యం -- ఈడూ, జోడూ -- చూడదగిన జంట !

"కాని అమరేంద్ర ......" వెనుకటి ఆలో చనలు నన్ను కలవర పెట్టసాగాయి.

"నడిచిన చరిత్రలో పార్వతి తప్పు చేసిందా ? .... ...... ఆతనిని వదిలి రావలసిన అగత్యం ?"

వేధించుచున్న ప్రశ్న. అనేక ప్రశ్నలకు తావి స్తోంది. అప్రయత్నంగా పార్వతిపై కోపం వచ్చింది.

"రేపు శ్రీధరంను కూడా అట్లాగే చేస్తుం దేమో ? ........"

మొదటి నుంచి పరిస్థితులను అర్థం చేసుకుని, సంఘంలో తన స్థానమును గుర్తించుకొని నడిచే స్వభావము కాదు. పార్వతి భగవంతుని కూడా లక్ష్య పెట్టదు. 'పెంకితనానికి' నిర్లక్ష్యమునకు ఆమె మారు పేరు .......

భోజనం చేసి 'రూం' లో చాప సంచంమీద కూర్చుని ఆలోచిస్తున్నాను.

పార్వతి ..... శ్రీధరం .... అమరేంద్ర. శ్రీధరం గురించి నాకేం తెలియదు — పార్వతి భర్త అని తప్ప.

స్నేహానికంటే ప్రాణమిచ్చే ఆ మిత్రుడు అమరేంద్రను చెడు దృష్టితో ఆలోచించుటానికి మనస్కరించలేదు. నవనీతం లాంటివాడు అమరేంద్ర. ఆతని వ్యక్తిత్వమునకు తప్పుడు అర్థం చెప్పుకోవడం, నావండి కాని పని. 'రూం'మేటుగా డిగ్రీ క్లాసులో ఆతని హృదయ వైశాల్యతను గమనించ గల్గాను. ఎంత సున్నితమయిన మనస్తత్వం ఆతనిది. ఇక, పార్వతి స్వభావం అగ్రం పాలేటా తల్లీ, దండ్రీ లేరని అల్లారు ముద్దుగా పెంచిన మామయ్య

# సుఖం ఎరుగని జీవితం

కుటుంబమునకు దూరమై అమరేంద్రతో వెళ్లిపోయింది.

ఆమె జీవిత సర్వస్వంగా భావించి, లక్షలాది ఆస్తిని కాలదన్ని పవిత్రప్రేమను ఆదర్శంగా పెట్టుకొని, ఆమెతోపాటు వచ్చిన అమరేంద్రను విడిచి ఈనాడు శ్రీధరంను చేపట్టింది.

జీవితంలో అంతూ, పొంతూలేని సుఖాన్ని చవి చూడాలని ఆమె కాంక్ష. మామయ్య ఈనాటికీ కుమిలి పోతాడు పార్వతిలేని వెలితికి. సామాన్య కుటుంబీకుడయి నప్పటికీ, సాధ్యమయినంత వరకు ఉన్న వాటిలో మంచి సంబంధం చూట్టానికి ఆయన ఎప్పుడూ వెనుకంజ వేసేవాడు కాదు. ఇప్పటికీ ఆయనకు ఆమె మీద గల అభిమానం ఈ విషయానికి నిదర్శనం. సక్రమంగా ఆయనింట్లో ఉంటే సలక్షణముగా పార్వతి వివాహము జరిగిపోయేది.

బాల్యస్నేహితుడు శంకరం సిగ్గు విడిచి అడిగాడు ' ప్రేమిస్తున్నాను ' అని. అతనికేం తక్కువ — అందం, చదువు, సంస్కారం — అన్నీ కలవాడు. కాని నిర్లక్ష్యంగా తృణీకరించింది — ' ఇంత తేలిగ్గా హృదయాన్ని అమ్ముకునే అసమర్థుడవనుకోలేదు.' అని పెంకిగా అంటూ — పాపం, అతను అవమానం భరించలేక ఇల్లు విడిచి మిలటరీలో చేరిపోయాడు.

లక్షాధికారి అమరేంద్ర ఈమెను నమ్మి ఈనాడు చిమ్మిడీ ఎత్తు విలువ చేయకుండా పోయాడు. తనకు వచ్చే జీతంలో ఆమెను తృప్తి పరచలేక పోయానని బాధపడే అమరేంద్రను ఆమె ఏనాడూ అర్థం చేసుకోలేదు. పై పెచ్చు అతనికి తనపై మోజు తగ్గిందని వూహించుకొంది. స్థిమితమైన ఆలోచనలు లేక అల్లుకున్న ఈ వూహలే, బహుశా, ఆమెను పెడత్రోవ త్రొక్కించి ఉంటాయి.

అనుభవించే ' గీత ' అందరికీ ఉండాలంటారు. ఆ 'గీత ' లేక పోవడం మూలకంగా కాబోలు పార్వతి ఈనాటి వరకు జీవితంలో స్థిరపడ లేక పోయింది.

తరచు శ్రీధరం గారింటికి వెళ్లే వాడిని. గమనించిన విశేషం ఏమిటంటే పార్వతి ప్రవర్తనలో మార్పు. పరిస్థితిని అర్థం చేసుకొని మెలగడం నేర్చుకుంది ఆమె. వ్యక్తుల స్వభావాన్ని నిర్మల హృదయంతో చదువ సాగింది. వల్లమాలిన 'లక్ష్యం' ఆమెలో ఇమిడి పోయింది. కనుకనే పొరపొచ్చాలు లేకుండా వారి దాంపత్య జీవితం నడిచి పోతోంది. శ్రీధరంగారు భార్యను పువ్వులలో పెట్టి పూజిస్తున్నారంటే ఆశ్చర్య పడవలసిన అగత్యం లేదు.

" బావగారు మా అబ్బాయికి కట్నం ఎంత ఇస్తారు ? ........ ఎందుకయినా మంచిది ఇప్పుడే తేల్చి చెప్పండి " నవ్వుతూ అనేవారు ఆయన.

పార్వతి సిగ్గుతో కుంచించుక పోయేది. మొదట్లో అర్థం కాకపోయినా దరిమిలా అర్థం చేసుకున్నా పార్వతి గర్భవతి అని. ఈ విషయానికి సంతోషించ తగ్గ ఆప్తుడను ఆమెకు, ఇక్కడ నేనొక్కడనే. పార్వతి నాలుగు కాలాలపాటు సుఖంగా వర్ధిల్లాలని మనసులో దైవాన్ని అర్థించాను.

చక్కని పార్వతి సంసారాన్ని ఎక్కువ కాలం తిల

కించే అవకాశం లేకపోయింది. హఠాత్తుగా శ్రీధరం గారికి ఉద్యోగరీత్యా బదిలీ కావడంతో వాళ్ళకు దూరం కావలసిన అగత్యం ఏర్పడింది. మొదట్లో నిరుత్సాహ పడ్డాను. బిగువైన సన్నివేశాలతో, రసవత్తరముగా నడుస్తున్న సినిమా మధ్యలో కరెంటు ఆగితే ఎట్లా వుంటుందో ఆ విధంగా ఫీలయ్యాను. విధి నిర్ణయం, తప్పుతుందా మరి. కన్నీళ్లతో వీడ్కోలిచ్చాను.

"రాజా ! కావలసిన వాడివి, నిన్ను దూరం చేసుకోవాలంటే నా మనస్సెంతో క్షోభిస్తుందిరా. ఏం చెయ్యను ? ...... దైవ నిర్ణయాన్ని తోసిపుచ్చ గలమా ? ...... నువ్వెక్కడ వున్నా నీ కోసం పరితపించే ఈ చెల్లెల్ని మాత్రం ఎన్నడూ మరువకుండా ఉంటావని నమ్ముతున్నాను" అంది కన్నీరు మున్నీరుగా విలపించుచూ.

ఎంత ఆపుకుందామనుకున్నా నాకు కన్నీరు ఆగలేదు. జేబురుమాలుతో తుడుచుకున్నాను.

శ్రీధరంగారుతో కాస్సేపు మాట్లాడిన తరువాత "ఒరేయ్ అన్నయ్యా ! నాకు తెలియకుండా పెళ్లి చేసుకున్నావో మళ్లీ సత్యాగ్రహం, పికెటింగు వగైరా, వగైరా గుర్తుంచుకో." అంత ఏడ్పులోనూ నవ్వ గలిగింది పార్వతి.

"శ్రద్ధగా చదువు. లేకపోతే గాంధీగారి క్లాసు — అదే — మూడు గీతల కంపార్టుమెంటు." ఆఖరి సారిగా ముగ్గురం నవ్వుకున్నాము. అనుబంధాలను తెంచడమే విధిగా పెట్టుకొన్న 'జి. టి. ఎక్స్‌ప్రెస్' రావడమేకాక 'నీకెక్కేమిటన్నట్లు' వారిని కూడా తనవెంట తీసుకొని పోయింది. నీరసంగా నడుస్తున్నాను.

నిర్మల మయిన ఆకాశం. ఉధృత మయిన చలిగాలి. తన ఉనికిని తెలియ జేద్దామని విఫలమవు తున్నాయి. మొత్తం మీద చలి ప్రభావం అధికంగా ఉంది. అంత ఎండలోనూ వణుకు పుట్టుకొస్తోంది. ఉత్తర దేశంలో చలికి దక్షిణాది మానవుడు దడుసుకోవలసిందే. సమయానికి చిక్కిన 'సిటీ బస్'లో ఎక్కి కూర్చున్నాను. చల్లగా ఉన్న పరిసరాలను బస్ కిటికీ ద్వారా నిర్లక్ష్యంగా చూశాను. చటుక్కున ఆంగ్ల కవి షెల్లీ వాక్యాలు గుర్తుకు వచ్చాయి.

"శీతాకాలం వచ్చినంత మాత్రాన వసంత కాలం రాకుండా ఉంటుందా ?......" ఈ వాక్యాలు "పార్వతి నిత్యజీవితంలో ఆచరణలోకి వస్తాయా ?" వస్తే బాగుండునని అనుకొన్నప్పుడు హృదయం తేలిక పడింది.

పార్వతి ఇంతకు మునుపు సాఫీ అయిన బ్రతుకు పొందలేదు. అర్థంలేని సన్నివేశాలతో అనుకోని సంఘటనలతో ఆమె వెనుకటి జీవితం జరిగి పోయింది. శ్రీధరం సాంగత్యంలో ఇప్పుడిప్పుడే ఒక దారిన పడుతోంది.

"సాఫీ అయిన బ్రతుకును ఆమెకు ఎల్లకాలం ప్రసాదించు భగవాన్ !" చేతులు జోడించి భగవంతుని ప్రార్థించాను మనస్ఫూర్తిగా.

* * *

హైద్రాబాద్‌లో లెక్చరరుగా స్థిరపడి పోయాను. దూరంగా ఉన్నప్పటికీ పార్వతితో ఉత్తరాల సంబంధం పోలేదు. నేను వూహించిన పార్వతి భావిజీవితం తారుమారు అయింది. శ్రీధరం చాల మారి పోయాడట ! అతనిలో మానవత్వం నశించిందని, 'మంచి—చెడూ' అన్న ఇంగిత జ్ఞానం లేకుండా పోయిందని పార్వతి ఉత్తరాలలో చెప్పుకొని ఏడ్చేది.

మళ్ళీ కష్టాలకు ఎర అయింది ఆమె.

నేను కంట తడిపెట్టా— అకస్మాత్తుగా ఆమె జీవిత పథంలో తిరిగిన ఈ మలుపుకు సార్థక మయిన బ్రతుకుకొరకు, లోకం మెచ్చుతగిన స్థానం కొరకు ప్రాకులాడే పార్వతి ఆశలు ఎండమావులుగా నిలచిపోయాయ్. ఇంటికి వచ్చిన నేను పార్వతి వ్రాసిన ఉత్తరము చూసి స్తంభీభూతుడ నయ్యాను. తెప్పరిల్లి వణుకుతున్న చేతులతో చదువసాగాను !

'రాజా !'

హృదయాన్ని కలచివేసే బాధను ఆప్తులకు, అర్థం చేసుకో కలిగిన వాళ్ళకు చెప్పుకుంటే ఒక విధమయిన ఉపశమనం కలుగుతుందంటారు. ఓర్పుగా వినకలిగిన వాడవు నీ ఒక్కడవే ! కనుక నా నిస్సార జీవితాన్ని నీకు తెలియజేస్తాను.

ఒకసారి, పెద్ద ఆఫీసరొకరు టెలిఫోన్లో తన గుమాస్తా మీద చీవాట్లు వేస్తున్నారు.

"ఈ టెలిఫోను చివర నున్న వాడు ఇంత అప్రయోజకుడని నే నెన్నడూ అనుకోలేదు." అన్నాడాయన.

గుమాస్తా వెంటనే అందుకొని "ఏ చివరసార్" అని ప్రశ్నించాడు.

రవిబాబు (విజయవాడ)

ఎవ్వరినీ, లక్ష్యపెట్టకుండా, దేనిని లెక్క చేయకుండా, పాపభీతి అనేది లేక సంచరించిన సంవత్సరాలు నా జీవితంలో ఉన్నాయి. స్వర్గ తుల్య మయిన బ్రతుకును కాంక్షించి, స్థిమిత మయిన ఆలోచనలు లేక పోవడంతో, కొరగాని పనులెన్నో చేశాను. కాని ఫలితం !— సాఫీ అయిన జీవితం అంటే ఏమిటో తెలియకుండా పోయింది.

అనుభవించతగ్గ యోగ్యత ఉండీ కూడ, తెలివిమాలి వచ్చిన అవకాశములు జారవిడచాను. నా చేష్టలకు.... బలిఅయ్యారు కొంత మంది అమాయకులు ! అప్పట్లో వాళ్ళ గురించి ఆలోచించవలసిన అవసరం నాకు కలగలేదు. నాకు, నేనుగా ఏ వ్యక్తిని సానుభూతితో అర్థం చేసుకోలేక పోయాను. అది ఆ నాటి నా బలహీనత.

కొంత కాలానికి పశ్చాత్తాపం పొందాను. తత్ఫలితంగా నాలో మార్పు వచ్చింది. క్రమంగా పరిస్థితులకు అనుకూలంగా ప్రవర్తించడం నేర్చుకున్నాను.

భర్త అయిన శ్రీధరం గారిని దైవాన్ని కంటె ఎక్కువగా ఆరాధించాను. ఆ విధంగా చేయడంతో ఒక విధమయిన సంతృప్తిని పొందకల్గాను.

"నీ దెంత నిష్కల్మష హృదయంపారూ ? !!" —నిజంగా నేను ధన్యుడ్ని అనేవారు ఆయన.

ఆయన సుఖం, ఆనందం నావిగా ఎంచి పట్టుదలగా, ధైర్యంతో సంసార సాగరాన్ని ఈదడానికి, నా గమ్యమును చేరడానికి యత్నించాను.

అందుకు అవరోధంగా నిలచింది మోహిని. కాలేజీ రోజులలో శ్రీవారికి మోహిని సహాధ్యాయి నట. క్రమంగా ఆమె.... చుట్టమై చూడ వచ్చిన ఆమె.... శత్రువుగా మారి నాపై కత్తి కట్టింది. మావారిని ఆకర్షించి ఆయనను నాకు కాకుండా చేసింది. యోచించకుండా తప్పటడుగు వేసి విషవలయంలో చిక్కుకున్నారు ఆయన. వారికిప్పుడు మోహినితోడిదే లోకం. ఆమె సాంగత్యములో, అనేక దుర్వసనాలకు లోనయ్యారు. అడగడానికి నాకు అధికారం లేదు. 'నువ్వెవరవు?' అన్న ప్రశ్న ఎదురు అవుతోంది.

గుట్టుగా జరుగుతున్న మా కాపురం బజారు పాలయ్యింది. సంసారం చిన్నా భిన్నం అవుతోందని తెలుసుకునే శక్తి మా వారిలో నశించి పోయింది.

భర్తను దైవాన్నిగా భావించి ఆయన నీడలో తల దాచుకుందామని ఉవ్విళ్ళూరులాను నేను.

జీవిత నాటకంలో నిముషానికి ఒక రంగు మార్చి స్వలాభమునకు ఇతరులను నాశనం చేసే స్వభావము కలది మోహిని.

మా ఇద్దరిలో కల తారతమ్యతను గుర్తించ కలిగిన స్థితిలో లేరు మీ బావ. తాగిన మైకంలో ఇష్టం వచ్చినట్లు బాది, చెప్పకుండా ఇల్లు విడచి ఏ పదారురోజులకో వచ్చేవారు.

ఏ చేతులతో ఎత్తుకొని ముద్దాడేవారో అవే చేతులతో నా బాబును, మా పవిత్ర ప్రేమకు చిహ్నంగా విలసిల్లిన ఆ పసికందును దూరంగా తోసేవారు. అక్కడికీ 'రోజులు మంచివికావని' సహనంతో ప్రవర్తించాను.

ఆడదానికి తోటి ఆడదే శత్రువు అన్న విషయం నా పట్ల నిజంగా రూపొందింది. మోహిని నన్ను హత్య చేసే ప్రయత్నాలు కూడ చేస్తున్నదని చూచాయగా గ్రహించగల్గాను.

'జీవచ్ఛవం'లా బ్రతుకడమే కాక దిక్కుమాలిన చావుకు కూడ నోచుకోవడం నా కిష్టంలేదు. అందుకనే నా అంతట నేను శాశ్వతంగా ఈ లోకం నుంచి నిష్క్రమించదలచాను.

నా బాబును అయినా కనీసం మోహిని కనికరిస్తే కొంత ఆత్మ శాంతిని పొందుతాను.

జీవితంలో చెడుగాను, మంచిగాను ప్రయత్నించి, తుట్ట తుదకు ఏ మార్గంలోను గమ్యాన్ని చేరలేక పోయాను.

పరాజితను !— నన్ను క్షమించు.

పార్వతి

ఏడ్చి, ఏడ్చి నా గుండెలు అలిసి పోయినాయ్. నిస్సహాయుడైన పార్వతి అన్నయ్య అంతకంటె ఏమి చేయలేడుగా !

మంచిగాను, చెడుగాను ప్రవర్తించి ఈ లోకం ఎవరి మన్ననకు పాత్రురాలు కాలేకపోయింది.

ఆమెది సుఖం ఎరుగని జీవితం ! ★

# 'ప్రత్యేక వ్యాసావళి' లో మూడవ వ్యాసం!



## వంటసామగ్రి సాధనాల విషయంలో మనంచాలా వెనుకబడి వున్నామా? ఎటువంటి మార్పు అవసరం?

వి. హేమలతా కైలాసం



"ఇల్లుచూసి ఇల్లాలిని చూడమన్నారు" మనపెద్దలు ఇల్లాలు శుచీ శుభ్రమూ కలదైదే ఆయిల్లు ఆరోగ్యానందాలతో తులతూగుతుంది. పిల్లలూ, మనం ఆరోగ్యంగా వుండాలంటే వంటింటి శుభ్రత, సంపూర్ణ ఆహారం చాలా ముఖ్యం.

రోజులో నాలుగైదు గంటలు వంటింట్లో గడిపే గృహిణి అస్తమానూ వచ్చే పోయే పిల్లలకీ, శ్రీవారికీ చీకాకు కలిగించకుండా ఆకర్షణీయంగా సర్దుకోవాలి. వంటిల్లు అనేది కేవలం మూడక్షరాల పదమే కాక మన సమర్థతకి, సంస్కారానికి గీటురాయి.

## పొయ్యిదే ప్రథమస్థానం

వంటిల్లు సామాను అనగానే ముందు మనస్సులో మెదిలేవి గిన్నెలు, గరిటలు అయినప్పటికీ 'పొయ్యి' అనేది లేనిదే ఏం చెయ్యలేం కనుక వంటింట్లో ప్రథమస్థానం 'పొయ్యికే' ఇయ్యాలి.

గుండె లారిపోయేటట్టు పొయ్యి వూది, మండక తిప్పలు పెడుతోంటే కళ్ళూ, ముక్కూ ఏకం చేసుకొనే రోజులు పోయాయి. వంట చెరుకునే ఉపయోగిస్తూ ఎక్కువ మందికి తక్కువ పుల్లల ఖర్చుతో పొగలేకుండా స్నానానికి నీళ్ళతో సహా అన్నం, పప్పు, కూరా, పులుసు, ఒక్క సారే చేసుకొనేటట్టు, "యల్" ఆకారములో ఉన్న "డాక్టర్, స. వ. రాజు" గారి పొగలేని పొయ్యి మధ్య తరగతి కుటుంబీకులకు అందు బాటులో ఉంది. దీనిలాగే బీడుతో పోతపోసిన "స్పెన్సర్" వారి "కుక్కింగ్ రేంజస్" వచ్చాయి. ఇవి కాస్త ఖరీదెక్కువ.

పొట్టు పొయ్యి, పొయ్యి, కుంపటి అనగానే మసీ, మసీ తప్పవు. ఇవి లేకుండా అందరికీ తెలిసి అందుబాటులో ఉన్నవి కిరసనాయిల్ ఉపయోగించే "విగ్‌స్టౌ"లు "ప్రెషర్ స్టౌ"లు. వీటిల్లో చాలా రకాలు ఉన్నాయి.

నాగరికంగా ముందుకు సాగిన మన దేశంలోని గృహిణి వంటిల్లు కూడా ఆధునికంగా అంకరించుకోవాలని ఆశ పడడంలో ఆశ్చర్యం లేదు. ఆర్థికంగా వెనుక పడిన మనదేశంలో తల సరి ఆదాయం హెచ్చితేగాని 'కాల్ గ్యాస్ బర్నర్లు' 'ప్రెషర్ కుక్కర్లు' 'రిఫ్రిజిరేటర్లు' ఎలక్ట్రిక్ 'కుక్కింగ్ రేంజస్', 'వాటర్ హీటర్స్' మొదలైన ఆధునాతన వంట సామగ్రి ప్రతీ వారికీ అందుబాటులో ఉండవు.

## కొత్తవంట సామాగ్రి

ప్రస్తుతం వస్తోన్న కొత్త రకాల వంట సామాన్లు, పాతరకపు సామానుల స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఈ కొత్త రకాల వల్ల పని సులువై చూసేందుకు శుభ్రంగా ఉండి 'స్టైల్' కలసి వస్తుంది. వీటిలో కొన్ని "అన్ టచ్‌డ్ బై హ్యాండ్" అనేటట్లు "జ్యూస్ ఎక్స్‌ట్రాక్టర్స్" "ఎగ్ బీటర్స్". "వెజిటబుల్ స్క్రేపర్" దీంతో ఎండు కొబ్బరీ కోరుకోవచ్చు, చిప్స్ చేసుకోవచ్చు. రకరకాల షేపుల్లో వస్తున్న కజ్జికాయల బల్లలు, ఆల్ చిప్పలు లేకుండా చెక్కుతీసేవి, నిమ్మకాయ రసం పిండేవి, బాదం, పిస్తా, చితక్కొట్టేవి. "ఇండియా కాఫీ హౌస్" వారి "కాఫీ పిల్టర్", "ఐస్‌క్రీమ్ మేకర్" దీంట్లో ఐస్‌క్రీమే కాక "ఫ్రిజిడేర్" కొనుక్కోలేని వారు "రెక్స్" వారి "జెల్లీ క్రిస్టల్స్" పాలల్లో కలిపి దీంట్లో పెట్టి జెల్లీ తయారు చేసుకోవచ్చు.

ఇదివరకు అన్నానికి, కూరలకి, ఇత్తడి గిన్నెలు, చారుకి, పులుసులకి సత్తెప్పాలాలు" రాచ్చిప్పలు పాలకి పెరుక్కి కుండలు సిల్వరు గిన్నెలు వాడేవారు. ఇప్పుడు వాటి స్థానాల్లో స్టీల్ గిన్నెలు వెలిశాయి. వీటితో "స్టౌ" మీద వండుకొంటే పని మనిషి లేకుండా మనమే తోముకోవచ్చు.

## ఇద్దరికీ వుద్యోగాలుంటే

భార్యా భర్తలు ఇద్దరూ ఉద్యోగాలు చేసుకొనే వారు కుక్కర్స్‌తో వండుకొంటే ఎక్కువ గిన్నెలూ అవవు, వంట తొందరగానూ అవుతుంది. ఆవిరి మీద ఉడకటం వల్ల విటమిన్లు నశించవు. పూర్వం నుంచీ ఉన్నవి "అన్నపూర్ణా కుక్కర్" "రుక్మిణీ కుక్కర్" ఇవి అందరికీ అందుబాటులో ఉంటాయి. ఇప్పుడే వస్తోన్న "ప్రెషర్ కుక్కర్" సామాన్యులు కొనుక్కోలేరు. ఇది ఒక రిద్దరికే సరిపోతుంది.

ఇత్తడి, అల్యూమినియమ్ 'స్టీల్'లో వచ్చే క్యారియర్స్ అందరికీ తెలిసినవే. కానీ ఇప్పుడిప్పుడే వస్తోన్న "థర్మల్" క్యారియర్‌లో పెట్టిన పదార్థాలు తొందరగా చల్లారవు. ఇందులోనే "వాటర్ జగ్స్" కూడా వస్తున్నాయి. వీటిలో నీళ్ళు పోసి ఐస్ ముక్కలు వేసి ఉంచితే "ఫ్రిజిడేర్" అక్కర లేదు. ఇల్లాంటివే "పాలిథిన్"లో "ఐస్ బకెట్స్" అని వస్తున్నాయి.

ఇత్తడి, స్టీల్‌లో వచ్చే పంపు ఉన్న నీళ్ళ డబ్బా కొనుక్కొంటే పిల్లలు ఎంగిలి గ్లాసులు ముంచ

వదంతులను వినకండి
వదంతులను ప్రచారం చేయకండి

## 5-6-1964 శుక్రవారము మొదలు
## 11-6-1964 గురువారము వరకు

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం ప్రారంభంలో అంత అనుకూలంగా కనపడక పోయినా క్రమంగా అన్ని వ్యవహారాలు నెరవేరి భవిష్యత్తుపై విశ్వాసం యేర్పడుతుంది. ఇతరులపై విశేషంగా ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం మంచిది కాదు. వృత్తి వ్యాపారాల్లో వారాంతానికి ప్రోత్సాహం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వృత్తితో ఇంతవరకు ఉన్న పోటీ చాల వరకు తగ్గిపోతుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో కొన్ని మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఇంకా చెప్పతగిన అభివృద్ధి ఉండదు. బంధుమిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు— వారాంతం నుంచి ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి,
మృగ 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు మీరు వాంఛించని పరిస్థితులు యేర్పడినా నష్టం మాత్రం కలగదు. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉండవచ్చును. వ్యాపారంలో మామూలుగా జరిగే పనులకు కూడా ఆటంకాలు రావచ్చును. వ్యాపారంలో మీ ఆలోచనలు మీ నిమిత్తం కాకుండా ఇతరులకు సలహా రూపంలో బాగా తోడ్పడతాయి. వృత్తిలో చెప్పతగిన మార్పులు రావు. ఉద్యోగంలో మీ మాటకు విలువ పెరుగుతుంది. ఆరోగ్యం వారాంతంలో అంత బాగా ఉండదు. కుటుంబ కార్యక్రమాలు జయప్రదంగా నెరవేరతాయి. రాజకీయాల్లో ప్రతిపక్షాల ఒత్తిడి కొంత తగ్గడం వలన నూతన ఉద్యమాలను గురించి ఆలోచిస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరగడం వలన తీరిక లభించదు.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు,
1, 2, 3 పా.)

ఈ వారం కూడా అనుకూలంగా ఉంటుందని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాల్లో మున్ముందు ప్రయోజనం గల వ్యక్తులతో పరిచయం కలుగుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు జయప్రదంగా ఉంటాయి. కాని వాటిని నిమిత్తం మీరు మొదట వూహించిన దానికంటే వ్యయ ప్రయాసలను అధికంగా పొందవలసి ఉంటుంది. వృత్తిలో అనుకూల వాతావరణం యేర్పడి ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగస్థులు తమ అభిప్రాయాలను అమలు జరిపి అధికారుల అభిమానానికి పాత్రు లవుతారు. కోర్టు వ్యవహారాల్లో అనుకూల

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| చం | కు గు | ర బు | శు రా |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | |
| కే | | | |

తను ఆశించడానికి ఇంకా సమయం కాదు. ప్రయాణ మూలంగా కార్యసాధన చేయగల సూచనలు ఉన్నాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

స్త్రీలకు— వారం మధ్యలో అనారోగ్యం చేయ వచ్చును. సాంఘిక కార్యక్రమాల్లో కొన్ని మార్పులు వస్తాయి. అలంకార వస్తువులు కొంటారు.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

వృత్తి వ్యాపారాల్లో మీ ప్రజ్ఞ రాణించే సమయం. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి అన్నట్లుగా మీ అభివృద్ధికి దోహదమిచ్చే కార్యక్రమాల్ని అమలు జరుపడానికి తగిన సమయం. వ్యాపారంలో పలువిధాలుగా లాభం రాగల సూచనలు ఉన్నాయి. ఇతరుల సలహాలను పాటించడం కంటే స్వయంగా ఆలోచించి వ్యవహరించడం శ్రేయస్కరం. వృత్తి ఉద్యోగాల్లో అనుకూల పరిణామాలు యేర్పడతాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. బంధువులకు సంబంధించిన వ్యవహారాలు విషమించడం వలన, మీరు వాటిలో చిక్కుకొని పోయే ప్రమాదం ఉంది. విద్యారంగంలో మీ కృషి రాణిస్తుంది. సత్పురుషుల సహవాసం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో పలుకుబడి లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం మీరు ఘనవిజయాల్ని యేమీ సాధించలేక పోయినా నిరుత్సాహం పడవలసిన అవసరం ఉండదు. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధి ఉంటుంది. వారం ప్రారంభంలోనే అనవసరమైన ఆందోళన కలుగ వచ్చును. మీరు ఇదివరకు జరిపిన ఆర్థిక వ్యవహారాల్లో కొన్ని చిక్కులు రావచ్చును కాని నష్టం కలిగే సూచనలు లేవు. వృత్తి ఉద్యోగాల్లో మీ శ్రమకు తగిన ప్రయోజనం ఉంటుంది. నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది వృత్తిలో సాటివారితో పోటీ పెరగవచ్చును. ఆరోగ్యం వారాంతం నుంచి బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధి

### ఈ వారము ధరలు

ధాన్యం ధర కొంచెం పెరిగే సూచనలు ఉన్నాయి. అపరాల ధరల్లో చెప్ప తగిన మార్పులు రావు. బెల్లం ధర వార ప్రారంభంలోనే కొంచెం పెరిగి నిలకడగా ఉంటుంది. నూనె, నువ్వుల ధరలు తగ్గే సూచనలు ఉన్నాయి. వస్త్రాల ధరలు కొంచెం తగ్గుతాయి.

ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం వారం మధ్య నుంచి బాగా ఉంటుంది. బంధువుల కార్యక్రమాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్యం, సంతోషం లభిస్తాయి.

### కన్య :

(ఉత్తర 2, 3. 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమంగా అనుకూల వాతావరణం యేర్పడుతుంది. రావలసిన డబ్బు చేతికి రాక ఇబ్బంది పడవలసి వస్తుంది. అధికారుల వలన జరుగ వలసిన పనులకు యేవో ఆటంకాలు రావడం వలన నిరుత్సాహానికి లోను అవుతారు. వృత్తిలో ప్రయోజనం లేని శ్రమ పొందవలసి వస్తుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో ఇదివరకు యేర్పడిన చిక్కులు తగ్గి మీకు అనుకూలంగా పరిష్కారం కాగల సూచనలు ఉన్నాయి. వారం మధ్యలో కొంచెం అనారోగ్యం చేయవచ్చును. మీ స్వంత వ్యవహారాల్లో విశేషంగా ప్రోత్సాహం లేక పోయినా మిత్రుల కార్యాల్ని సాధిస్తారు. అయిష్టంగానైనా అనవసర వ్యయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం సంతృప్తికరంగ ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు కుటుంబంలో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును

### తుల :

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీ ఆలోచనలకు ఒక రూపాన్ని ఇవ్వడాని ప్రయత్నం చేస్తున్న సమయంలో ఆకస్మికం కొన్ని ఇబ్బందులు రావడం వలన ముఖ్యమై కార్యక్రమాలు వాయిదా పడగల సూచన ఉన్నాయి. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లోను, వ్యాపా విస్తరణ ప్రయత్నాల్లోను తొందరపాటు తగద మీరు అనుకొనని ఖర్చులు జరగడం వలన ఆ కంగా ఒత్తిడి వచ్చినా కొంత మంది మిత్రు సమయానికి తోడ్పడతారు. వృత్తి ఉద్యోగాల కొన్ని భేదాభిప్రాయాలు రావచ్చును. ఆరోగ్య సామాన్యంగా ఉంటుంది. కుటుంబంలో పె లకు అనారోగ్యం చేయువచ్చును. వస్తువులు గ ముఖ్యమైన కాగితాలుగాని పోవచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా వారాంతం జాగ్రత్త చాలా అవసరం. వినోద కార్యక్రమాల పాల్గొంటారు. అనవసరంగా మానసికాందో కలుగుతుంది.

# వారఫలాలు

## వృశ్చికం :
(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ,) 1, 2, 3 పాదాలు )

ఇంతవరకు మీరు ఒక దారికి తెచ్చిన వ్యవహారాల్లో కొన్నిచిక్కులు రావచ్చును గాని మీ చాకచక్యం వలన వాటిని అధిగమిస్తారు. వచ్చిన చికాకులను తొలగించుకొనడంలో నిమగ్నులై ఉండడం వలన వృత్తి వ్యాపారాల్లో చెప్పతగిన అభివృద్ధి కన్పించదు. అధికులతో పరిచయం కలుగుతుంది. ఉన్నత సమాజంలో మీ శక్తి సామర్ధ్యాలు గుర్తింపబడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. రాజకీయాల్లో మంచి ప్రోత్సాహం లభిస్తుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ప్రయోజనం లేని ప్రయాణాలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత కన్పిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి.

## ధనుస్సు :
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని మీరు ధైర్యంగా వ్యవహరిస్తే మంచువలె విడిపోతాయి. వ్యాపారంలో ఇదివరకు చేజారిపోయిన అవకాశాలు కూడా తిరిగి వస్తాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో కొన్ని భేదాభిప్రాయాలు వచ్చినా వాటివల్ల యేకార్యమూ ఆగిపోదు. ఇది వరకటి కంటే లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాల్లో క్రమంగా అనుకూల వాతావరణం యేర్పడుతుంది. కోర్టు వ్యవహారాల్లో యేర్పడిన ప్రతిష్టంభన తొలగిపోతుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం సంతోషంలభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. బంధువుల కార్య భారాన్ని వహించవలసి వస్తుంది. అధిక వ్యయం చేస్తారు.

## మకరం :
(ఉషా 2 3, 4 పా, శ్రవణం, ధనిష్ట 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో మామూలుగా జరిగిపోయే కార్యక్రమాలకు కూడా యేవో ఆటంకాలు రావచ్చును. యేదో ఒక విధంగా డబ్బు చేతికి అందడం వలన ఆర్థికంగా ఒత్తిడి ఉండదుగాని ఆదాయం పెరగగల సూచనలు లేవు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు, నూతన వ్యాపారాలు ఇంకా కొంత కాలం పాటు వాయిదా వేయడం మంచిది. వృత్తి ఉద్యోగాల్లో పోటీ పెరిగినా మీకు నష్టం రాదు. గాని ప్రత్యర్థులు కొంతమంది పని గట్టుకొని వదంతులను ప్రచారం చేయడం వలన ఆందోళన కలుగ వచ్చును. ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. సాహిత్య, వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి పరిగణన లభిస్తుంది. రాజకీయాల్లో ముఖ్యమైన సంఘటనలు కలుగ వచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ప్రయాణం చేయవలసి వస్తుంది. సంఘంలో గౌరవం, కుటుంబంలో సంతోషం లభిస్తాయి.

## కుంభం :
(ధనిష్ట 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1,2,3 పా.)

ఈ వారం యోగవంతమైనదే. ప్రయత్నించిన ప్రతి పనీ నెరవేరుతున్నా మీరు వాటి నిమిత్తం యెంతో శ్రమను సహించవలసివస్తుంది. వృత్తి వ్యాపారాల్లో ఇంత వరకు మీకు వ్యతిరేకంగా ఉన్న వారు కూడా మీ అభిప్రాయాలను ఆమోదిస్తారు. ఆదాయం స్వల్పంగా పెరగగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో కొన్ని సమస్యలు తల యెత్త వచ్చును. వృత్తిలో ఇప్పుడు కొంత నిర్లక్ష్యం చేయడం వలన మున్ముందు పశ్చాత్తాప పడవలసి వస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో కొన్ని మార్పులు రావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయకూడదు. కుటుంబ కార్యక్రమాల్లో చిన్న చిన్న మార్పులు వచ్చినా అన్ని పనులూ నిరాటంకంగా సాగిపోతాయి.

## మీనం :
(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)
శ్రవణం, ధనిష్ట 1,2 పాదాలు.

గతవారం కంటే ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పనులు చురుకుగా సాగి లాభించగల సూచనలు ఉన్నాయి. అన్ని విధాలా బాగా ఉన్నా కొంత మంది శ్రేయోభిలాషులు మీ ప్రవర్తనను అపార్థం చేసుకొనే ప్రమాదం ఉంది. అధికారులవలన జరుగవలసిన పనులు నెరవేరి లాభం కలుగుతుంది. వృత్తి ఉద్యోగాల్లో మార్పుల కోసం ప్రయత్నించడానికి ఇది సమయం కాదు. ఆదాయముతో పాటు వ్యయము కూడా పెరుగుతుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయాల్లో బాధ్యతలు పెరగడంవలన తీరిక లభించదు. విద్యారంగంలో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ప్రేమ వ్యవహారాల్లో అంతగా అభివృద్ధి ఉండదు.

స్త్రీలకు — ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. కుటుంబంలో స్వల్ప బేదాభిప్రాయాలు రావచ్చును.

# జన్మదినఫలం

## జూన్-5

ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో శ్రమకు తగిన ప్రయోజనం లభిస్తుంది. వ్యాపార విస్తరణ కోసం చేసే ప్రయత్నాలు ప్రారంభంలో ఫలించక పోయినా మొత్తం మీద సంతృప్తికరంగా ఉంటాయి. వృత్తిలో పోటీవారితో పోటీ పెరిగే సూచనలు ఉన్నాయి కాని మీ ఆలోచనలకు కార్యక్రమాలకు భంగం కలగదు. ఉద్యోగంలో స్వల్పంగా అభివృద్ధి ఉంటుంది. స్థాన చలనమునకు అవకాశం ఉన్నది. మీరు యెంత జాగ్రత్తగా ఉన్నా అధిక వ్యయం చేయవలసిన పరిస్థితి యేర్పడుతుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది కాని అప్పుడప్పుడు ఉష్ణాధిక్యత కలుగుతుంది. కుటుంబ కార్యక్రమాలు సులభంగా నెరవేరతాయి. కొంత మంది బంధువులు మీకు వ్యతిరేకంగా ప్రవర్తించవచ్చును. ప్రేమ వ్యవహారాల్లో స్వల్పాభివృద్ధి ఉంటుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## జూన్-6

ఈ సంవత్సరం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఆదాయం విశేషంగా పెరగకపోయినా పలుకుబడి బాగా ఉంటుంది. వ్యాపారంలో ప్రయోజనం గల పనులను అధికారుల సహాయం ద్వారా సాధిస్తారు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు మాత్రం ఆడంబరం యెక్కువ అనుభవం తక్కువ అనే ధోరణిలో ఉంటాయి. వృత్తిలో మీకు అనుకూలంగా మార్పులు రావచ్చును. ఉద్యోగానికి సంబంధించిన విద్యలో కృతార్థులు కాగలరు. ఆదాయం సామాన్యంగా ఉన్నా సమయానికి యేదో ఒక డబ్బు అందుతూ ఉండడం వలన ఇబ్బంది లేకుండా అన్ని వ్యవహారాలూ నెరవేరతాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. విరుద్ధాభిప్రాయాలు గల బంధువులను ఒక త్రాటి మీద నడిపిస్తారు. సాంఘిక కార్యక్రమాల్లో కొన్ని మార్పులు రావచ్చును. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## జూన్-7

అన్ని విధాలా ప్రోత్సాహంగా ఉండే సమయం. వృత్తి వ్యాపారాల్లో మీ అభిప్రాయాలకు తగిన అవకాశం లభిస్తుంది ఆదాయమూ, అంతస్తూ రెండూ పెరుగుతాయి. మీరు ఇదివరకు ప్రయత్నించి వదలివేసిన వ్యవహారాలు కూడా అతి సులభంగా నెరవేరతాయి. రావలసిన బాకీలు కూడా పూర్తిగా వసూలు కాగల సూచనలు ఉన్నాయి. భాగ స్వాములతో కలిసి చేసే వ్యాపారాలు కూడా ఇదివరకటి కంటే బాగా ఉంటాయి. ఉద్యోగంలో పై అధికారుల అభిమానం లభిస్తుంది. ఉన్నత స్థానము లభింప వచ్చును. స్థిరాస్థి వ్యవహారాలు గృహ నిర్మాణ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కాని అప్పుడప్పుడు అకారణంగా ఆందోళన కలుగుతుంది. శుభ కార్యాల విషయంలో బంధువుల తోడ్పాటు లభిస్తుంది. దూర ప్రయాణాలు చేస్తారు. విద్యార్థులకు క్లాసు రాగల సూచనలు ఉన్నాయి.

## జూన్-8

ఆర్థికంగా విశేష యోగాన్ని ఆశించడానికి సమయం కాదు గాని మిగిలిన అన్ని వ్యవహారాల్లోను మీ మాటకు ఆటంకం ఉండదు వృత్తి వ్యాపారాల్లో క్రమంగా అభివృద్ధిని సాధిస్తారు. మీ అభిప్రాయాలు సరియైనవని కాలక్రమంలో రుజువు కావడం వలన మీకు ఆత్మబలం, భవిష్యత్తు మీద విశ్వాసం లభిస్తాయి. మీతో యెప్పుడూ తిరిగే వారే మిమ్మల్ని మోసం చేయ

డానికి ప్రయత్నం చేస్తారు కాని కృతార్థులు కాలేరు. ఉద్యోగంలో పెద్ద మార్పులేమీ రావు. వృత్తిలో గత సంవత్సరం కంటే ఈ సంవత్సరం చాలా బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో కొంచెం శ్రమమీద అనుకూలత లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో స్వల్ప లాభం రావచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగా జరిగి పోతాయి. సంతానానికి సౌఖ్యం సంతోషం లభిస్తాయి. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

**జూన్-9**

ప్రతి అడుగునా యేవో సందేహాలు కలుగుతూ ఉండడం వలన సాహసించి యే పనీ చేయలేరు. కాని చేసిన పని వ్యర్థం కాదు. వృత్తి వ్యాపారాల్లో సంవత్సర ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా సంవత్సరాంతానికి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మీ అభిప్రాయాలకు విరుద్ధంగా వ్యవహరించ వలసిన పరిస్థితి యేర్పడుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ప్రోత్సాహకరంగా ఉంటాయి. కొంతమంది స్నేహితులు సహాయానికి తోడ్పడుతూ ఉండుట వలన ఆర్థికంగా ఇబ్బంది లేకుండా గడచి పోతుంది. ఉద్యోగములో స్థాన చలనము కలగవచ్చును కాని మారబోయే స్థానం కూడా అనుకూలంగా ఉంటుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభకార్యాలు శ్రమ మీద నెరవేరతాయి. అనవసర వ్యయం చేస్తారు. విద్యార్థులు కొంత శ్రమమీద కృతార్థులు కాగలరు.

**జూన్-10**

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది. మీకు ఇష్టులైన వారికి దూరంగాను, ఇతరులకు సన్నిహితంగాను, వ్యవహరించవలసి ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో చెప్పుకోతగిన అభివృద్ధి లేక పోయినా నష్టం రాగల సూచనలు లేవు. మీ అభిప్రాయాలను అమలు పరచడం భాగస్థుల సలహాలను పాటించడం లాభకరంగా ఉంటుంది. వ్యాపారంలో పెట్టుబడి చాలని లోపం కన్పిస్తుంది. వృత్తిలో ముమ్ముందు లాభించుటకు అవసరమైన మార్పులు కలగవచ్చును. ఉద్యోగంలో పై అధికారులతో భేదాభిప్రాయాలు కలగవచ్చును. అన్ని వ్యవహారాలూ మీ ఓర్పుకు పరీక్షలుగా నిలుస్తాయి. సంవత్సరాంతంలో అనారోగ్య సూచనలు ఉన్నాయి. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. విలువైన వస్తువులు కొంటారు. విద్యార్థులు మొదటనుంచీ శ్రద్ధగా చదువవలసి ఉంటుంది.

**జూన్-11**

ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే బాగా ఉంటుంది. గత సంవత్సరాంతంలో ప్రారంభించిన పనులన్నీ ఇప్పుడు నెరవేరి లాభం కలుగుతుంది. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. వ్యాపారస్థులకు ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆదాయం కూడా పెరుగుతుంది ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొని మీ అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసికొనే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని అప్పుడప్పుడు బలహీనత ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ శక్తి సామర్థ్యాలు రుజువు అవుతాయి. బాధ్యతతో కూడిన పదవిని నిర్వహించగల సూచనలు ఉన్నాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. ★

# ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డితో

# ప్రత్యేకమైన ఇంటర్వ్యూ



పి. వి. ఆర్. శర్మ

(గతసంచిక తరువాయి)

## ముఖ్యమంత్రి : నాయకత్వము

రాష్ట్ర ముఖ్యమంత్రి—శాసనసభా కాంగ్రెసు పక్ష నాయకుడూ ఒక్కరే అయితే బాగుండును గదా అన్న ప్రశ్నకు ముఖ్యమంత్రి—"నాయకుడు—ముఖ్యమంత్రి ఒక్కరే అయితే బాగానే ఉంటుం దనేది సిద్ధాంతరీత్యా బాగానే ఉంటుంది" అన్నారు.

ముఖ్యమంత్రి పదవీ స్వీకారానికి ముందు, పదవీ స్వీకారానంతరం మీ భావం ఎల్లా ఉన్నదీ అనగా ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ఇల్లా అన్నారు: "ముఖ్యమంత్రి పదవి బ్రహ్మాండమైన బాధ్యత గలది. వీడు నావాడు, వాడు పరాయివాడు అనే భేద భావం లేకుండా, రాగ ద్వేష రహితముగా, నిర్మోహమాటముగా నిర్ణయాలు తీసుకోవలసి ఉంటుంది. ఆ నిర్ణయానికి రావడానికి ఆప్తులైన వారిని సంప్రతించవచ్చు, అనుకోండి. సత్పరిపాలన కావాలంటే, నిష్కల్మషమైన పరిపాలన జరగాలంటే కటువుగా కనిపించినా నిర్మోహమాటం తప్పదు. ఆయా వ్యక్తుల మంచి చెడ్డలు, యోగ్యతార్హతలు గమనించి ఏఏ పనికి ఎవరెవరు తగినవారో యోచించి నియోగించడంలోనే పరిపాలనా పాటవం బయటపడుతుంది. అందులో పొరపాటు చేశామా సర్వమూ దెబ్బతిన్నదే."

## సూదిలో దారం

ప్రజలకు సంబంధించిల వ్యవహారాలలో ప్రభుత్వము దగ్గిర ఏ కాగితం వేసినా దాని వెనుక సూదిలో దారంలాగ పోతేనే తప్ప పనుల జరగక పోవడానికి కారణం ఏమి చెబుతా రనగా ముఖ్యమంత్రి ఇల్లా చెప్పారు : "దానికి తరతరాలుగా వచ్చిన పారతంత్ర్యముచే రచింపబడిన కార్యక్రమాలు, నిబంధనలు కొంతవరకు కారణ మనవచ్చు. కొన్ని రూపాయలు వెచ్చించే పని ఒకటి ఉన్నదనుకోండి. మరి అందుకు సంబంధించిన ఆర్థికమైన లావాదేవీలు, పరిపాలనా సంబంధమైన వ్యవహారాలు—మూడు నాల్గు శాఖలు పరిశీలిస్తేనే గాని వెంటనే పని గాదు. అందుకు వ్యవధి పడుతుంది. ఎంతవరకు ఈ వ్యవధిని తగ్గిస్తే వీలుంటుందా అని చూస్తున్నాము. జాప్యాలను తగ్గించి కాలహరణం లేకుండా చేసే మార్గాలను అన్వేషిస్తున్నాము. అందుకే పరిపాలన సంస్కరణలకు ప్రవీణులు, అనుభవజ్ఞులు అయిన వారితో ఒక సంఘాన్ని వేసి ఆరు మాసాల్లోగా ఒక నివేదికను ఇమ్మన్నాము. ప్రభుత్వం వ్యయం చేసే శాఖలకు సలహా సంఘాలను వేస్తున్నాము."

## పిటిషన్ల అలవాటు

"అయితే మనలో మాట్లాడితే కనిపించిన వాడికల్లా ఒక కాగితము చేతికిచ్చే స్వభావం అలవడినది. ఏ పని ఎవరివలన జరగాలో వారికే ఆ కాగితాలు అందితే బాగుండును. కలెక్టరువల్ల అయ్యే పనులకు ముఖ్యమంత్రిదాకా ఆర్తిలో కాగితాలు పంపిస్తారు. మిగతా మంత్రులకు పంపిస్తారు. ఇవన్నీ మళ్లీ ఒక చోటకు చేరుకుంటాయి. ఈ గలభాలో ఏమైనా జరగవచ్చు. అందుకే జిల్లా స్థాయిల్లో పనులు చురుకుగా మార్గాలు సూచించమని పరిపాలనా సంస్కరణల అనుభవజ్ఞుల సంఘాన్ని అడిగాము. వ్యక్తిగతంగా జరిగే పనులకు, ధర్మకర్తృత్వంపై జరిగే పనులకు వ్యత్యాసం ఉంటుంది. ఇవాళ మీరు ఒక చొక్కా కుట్టించుకోవాలంటే మీ ఇష్టంవచ్చినట్లు కొట్టుకు వెళ్లి ఒక కాని హెచ్చో, ఒక కాని తగ్గో ఖర్చుపెట్టి కుట్టించుకుంటారు. మరి ప్రజలకు సంబంధించిన వ్యవహారాలు అల్లా గాదు. వీలైనంతవరకు దుబారా గారాదు. పొదుపూ చూసుకోవాలి."

## నైతికస్థాయి

ద్వితీయ సంగ్రామానంతరం సంఘంలో ప్రవేశించిన కొన్ని దురలవాట్లవల్ల ప్రజల నైతిక స్థాయి, తద్వారా ప్రభుత్వ సిబ్బందిలో నైతిక పాటవము తగ్గినవని జనం అనుకునేదానికి మీరే మంటారని అని అనగా శ్రీ బ్రహ్మానందరెడ్డి అందుకొని ఇల్లా అన్నారు : "నిజమే! రెండో యుద్ధంతోపాటు మనకు కొన్ని మంచి చెడ్డలు సంక్రమించాయి. ఉద్యోగాల్లో మటుకు ఉన్నవారెవరు ? మన అన్నలు, తమ్ములు, బంధువులు, మిత్రులు— వీరే గదా ! మనలో ఉండే మంచి చెడ్డలే వారిలో ప్రతిఫలిస్తాయి. నైతిక వర్తనం దిగజారినప్పుడు తన్నిరోధానికి లంచగొండితన నిరోధక సిబ్బంది, పరిశీలక బృందాలు పనిచేస్తూనే ఉన్నాయి. వీటికి తోడు మనలో కొంత ఆత్మ పరిశీలన గూడా అవసరం. అంతర్వీక్షణ కావాలి. వాడు ముఖ్యమంత్రిగాని, సామాన్య పౌరుడుగాని ఏనాటికానాడు ఈనాడు మనం చేసిన పని ఏమి ఆత్మ పరిశీలన, ఆత్మ సంశోధనం చేసుకోవాలి. ఇల్లా ప్రతి వ్యక్తి పరిశీలన చేసుకొని తన వర్తనను పరిశుద్ధం చేసుకోవడానికి యత్నించినప్పుడు వ్యక్తుల నడతతోబాటు సంఘం స్థాయి, ప్రవర్తన గూడా బాగుపడుతుంది."

## బంధుప్రీతి

అధికార పదవులలో ఉన్నవారు వారి తాలూకు వారికే పదవులు కట్టబెడుతున్నారనే విమర్శకు ఏమి చెబుతా రనగా ముఖ్యమంత్రి సమాధాన మిది : "పదవులలో ఉన్నవారికి బంధుత్వం ఉన్నంత మాత్రాన ఇతరత్రా వారు సమర్థులై, అర్హులై ఉంటే వారికి సహజంగా రావలసిన పదవులు రాకుండా ఉండటం మంచిదిగాదు. కొందరికి పదవులు

ప్రయత్నంవల్ల వస్తాయి. కొందరికి అప్రయత్నంగానే ప్రాప్తిస్తాయి. దానికి ఫలానా వారిదే బాధ్యత అని మనం చెప్పలేము. అదృష్టం గూడా ఒక కారణం. వందలాది ఏండ్లుగా ప్రజాస్వామ్యం వర్ధిల్లుతున్న దేశాలలో మంత్రివర్గాల్లో ఎవరెవరు ఉంటారో మొదటి పేర్లు పేరు పేరు వరుసనా ఉజ్జాయింపుగా మనం చెప్పవచ్చు. మనం ఇంకా ఆ స్థాయికి రాలేదు. కేంద్రంలో గాని, రాష్ట్రంలో గానివ్వండి—కేవలం మేధస్సు, అనుభవంపై మంత్రి పదవులు వస్తున్నా యనలేను. ప్రాంతం, కులం, మతం—వీటికి అతీతంగా ఈ పదవులు లభించినవాడే ప్రజాస్వామ్యం సక్రమమైన పునాదులపై వర్ధిల్లగలదని చెప్పవచ్చు. ఆయా సమస్యలపై ముఖ్యమంత్రి భావాలు ఈవిధంగా ఉన్నట్లు అడిగిన ప్రశ్నలకు ముఖ్యమంత్రి సమాధానాలవల్ల తెలుస్తుంది. కాంగ్రెసు అంకితమైన సామ్యవాద వ్యవస్థను గూర్చి ముఖ్యమంత్రి భావాలివి. అది అంటే గిట్టనివాడిని వామపక్షములో గాని దక్షిణ పక్షములో గాని అతివాదిని గాదు. నాది మధ్యేమార్గము. కేవలం సిద్ధాంతాలు వల్లిస్తూ తృప్తిపడేవాడిని గాదు. చెప్పే సిద్ధాంతాలు ఎంత వరకు ఆచరణలో పెడుతున్నామో చూసుకొని ముందడుగు వెయ్యాలనే వాడివి. సంఘంలో ఉన్న సంప్రదాయాలు, ప్రజల భావాలను గమనించాలి. కేవలం ప్రచారం కోసం గాని, మెరమెచ్చుల కోసం గాని పెద్ద కబుర్లు చెప్పడం నాకు రుచించదు. ఏదైతే సామ్యవాద వ్యవస్థను స్థాపిస్తా మంటున్నామో ఆ వ్యవస్థాపనకు తగు చర్యలు తీసుకుంటూ అప్రమత్తంగా వ్యవహరించాలి.

## రాజమండ్రిలో పేపరుమిల్లు

"సామ్యవాద వ్యవస్థకు పునాదులు వేస్తామంటూ రాజమండ్రిలో ఉన్న ప్రభుత్వ కాగితం మిల్లును ఇంకొకరికి ఎల్లా వప్పగిస్తున్నారని మీరు అడుగుతున్నారు. ఇది ఒకరిది ఇంకొకరికి ఇస్తున్నా మనుకోవడం పొరపాటు. ఇప్పుడు మిల్లు పరిస్థితి, మనం పెట్టుబడి పెట్టిన నిధులు, ముందు పెట్టవలసిన ఖర్చు గమనించాలి. ఆర్థికమైన, విద్యుచ్ఛక్తి సంబంధమైన, పారిశ్రామికమైన వత్తిళ్ల దృష్ట్యా మనమే ఇది నిభాయించగలమా అన్నది అసలు ప్రశ్న. ఇంకా రెండుకోట్ల రూపాయలు ప్రభుత్వం వెచ్చించగలదా ? పెట్టాలి అంటే నాల్గో ప్రణాళిక దాకా పోవలసిందే. అందు కోసం రెండేళ్లు వృధా చెయ్యడమా ? కేవలం ఆదర్శానికి సంబంధించిన వ్యవహారంగాదిది. ఆర్థికమైన వత్తిడి లేకపోతే ఇప్పుడు జరిగిన ఏర్పాటు సంభవం గాదు. ఆదిలో అనుకున్నట్లే జరిగేది.

## భూమి సంస్కరణలు

"ఇక భూమి వ్యవస్థ, భూమి సంస్కరణలు కొన్ని అమలుచేశాము. జనాభా పెరుగుతోంది. భూమి అనేది మటుకు సంకోచ వ్యాకోచాలు కలది గాదు. ఉన్న భూమి ఏదో ఉన్నది. ఉన్నదానిని సర్దుబాటు చేసుకోవాలి.—ఉత్పత్తిని పెంచాలి. సంస్కరణలవల్ల పూరికే పంచడానికి చెప్పదగినంత భూమి లభించలేదు. క్రమముగా సంఘంలో పరిస్థితులు సర్దుబాటు కావాలి. ప్రజల మనస్సులు సంస్కరణలకు ఉన్ముఖం గావాలి. మన దేశ సంప్రదాయాలు చూసుకోవాలి. ప్రొద్దున్న ఒక మార్పు, సాయంత్రం ఇంకొక మార్పు చేస్తూ పోతే అది 'ప్రగతి' గాజాలదు. 'అభ్యుదయము' అంతకన్నా గాదు. ఉన్న బంజరు భూమిని పేద వారికి వీలైనంతవరకు పంచుతూనే ఉన్నాము.."

## రైతులకు సహాయం

"దేశంలో అత్యవసర పరిస్థితి వచ్చిపడింది. మరి పంటలు గూడా ఆయుధాలతోపాటు వృద్ధి చేసుకోవాలి. అందుకు రైతులకు విత్తనాలకు, ఎద్దులు కొనుక్కోవడానికి అప్పులు ఇస్తున్నాము. ఎరువులు గూడా ఉదారంగా ఇస్తున్నాము. ఇందుకు 18 కోట్ల రూపాయలు కేటాయించాము. సాంద్ర వ్యవసాయ పథకాలు అమలు జరిగే ప్రదేశాల్లో అమలు జరుగుతూనే ఉన్నాయి. ఇంకో అయిదు కోట్ల సహకారేతర రంగానికి కేటాయించాము."

## చెర్వులు-నీటివసరులు

"చెర్వులు ఎన్నో పూడికలు తియ్యవలసి ఉన్నాయి. గట్లు కొట్టుకుపోయాయి. వాటి మరమ్మతుకు కూడా ప్రణాళికలో 25.3 కోట్ల రూపాయలు కేటాయించాము. నాల్గో ప్రణాళికలో ఉత్పత్తిని పెంచడానికి ఇప్పటినుంచే అంచనాలు ప్రణాళికలు వేస్తున్నాము.

## పెద్ద ప్రాజెక్టులు

"చిన్న ప్రాజెక్టులకు తోడు శ్రీశైలం, పోచంపాడు వంటి ప్రాజెక్టుల నిర్మాణానికి కృషి చేస్తున్నాము. నాగార్జునసాగర్‌కు ఎక్కువ డబ్బు కేటాయిస్తే పని త్వరగా పూర్తి అవుతుంది. అప్పుడు పంట త్వరగా రావీలు అవుతుంది. ఆ వచ్చిన పంట ఒక్క ఆంధ్రకే గాక యావత్తు దేశానికి ఉపయోగపడుతుంది. అందువల్ల కేంద్రం మనకు ఎక్కువ డబ్బు కేటాయిస్తారని ఆశిస్తున్నాము. చిన్న పెద్ద నీటివసరులను సరిచెయ్యడంతో రైతుకు అధికోత్పత్తికి ఉత్సాహం కలుగుతుంది."



మంచివక్త శ్రీ బ్రహ్మానందరెడ్డి

## విద్యుచ్ఛక్తి

"శ్రీశైలానికి తోడు ఎగువ శిలేరు, దిగువ శిలేరు ప్రాజెక్టులు గూడా పూనుకుంటున్నాము. మన రాష్ట్రము విద్యుచ్ఛక్తి వికాసంలో కొంత వెనుకపడిన మాట సత్యం. మాచ్‌ఖండ్, శ్రీశైలం, తుంగభద్ర, ఎగువశిలేరు, దిగువ శిలేరు ప్రాజెక్టులు, థర్మల్ యంత్రాల ద్వారా గూడా విద్యుదుత్పత్తి వృద్ధిచేసుకొన పాటుపడుతున్నాము. నాల్గో ప్రణాళికలో 600 కోట్ల రూపాయలలో దాదాపు 200 కోట్ల రూపాయలు అనగా మూడో వంతు విద్యుచ్ఛక్తి వ్యాప్తికే కేటాయిస్తున్నాము. విద్యుచ్ఛక్తి వ్యాప్తి అయితే పరిశ్రమల వికాసానికి సహజంగా అనువైన పరిస్థితులు వస్తాయి."

## పరిశ్రమల విశేషం

"పారిశ్రామికంగా కూడా మనం వెనుకపడే ఉన్నమాట నిజము. కేంద్ర ప్రభుత్వం పెట్టే పెద్ద ప్రాజెక్టులలో కొన్నిటిని ఇక్కడ పెట్టమని కోరుతున్నాము. అప్పుడా కొరతతీరి పారిశ్రామిక వాతావరణం ఏర్పడుతుంది. అనుబంధ పరిశ్రమలు వెలుస్తాయి. మొదటి రెండు ప్రణాళికలలో అట్టి కృషి దాదాపు శూన్యమనే చెప్పాలి.

ఇప్పటి పరిస్థితులు చూస్తే వెనుకపడిన ప్రాంతాలు వెనుకపడినవిగానే ఉంటున్నాయి. ముందున్నవారికే ఇంకా ముందుకుపోయే అవకాశాలు వస్తున్నాయి. ఈ అసమత్వాన్ని తొలగించాలని మనం కేంద్రానికి విన్నవిస్తున్నాము. నాల్గో ప్రణాళికలోను, రాబోయే రెండేళ్లలోను ఈ అసమత్వాన్ని తొలగించడానికి కేంద్రం పూనుకుంటుందని భావిస్తున్నాను."

"ప్రయివేటు ఆసాములు గూడా మన రాష్ట్రములో నిరివిగా పరిశ్రమలు పెట్టవచ్చు. పెట్టాలి. అందుకు ప్రభుత్వ ఉద్యోగులు వక్కని సలహాలు ఇస్తారు. ఎప్పుడు, ఏవేళ, వచ్చి అడిగినా అడిగిన సమాచారం ఇవ్వ సదా సిద్ధంగా ఉంటారు. అట్టే సలహాసంపదల నివ్వమని ఉద్యోగులకు ఆదేశాలిస్తున్నాము."

## కాంగ్రెసు

"ఇక రాష్ట్ర కాంగ్రెసు సంస్థకు, శాసనసభ కాంగ్రెసు పక్షానికి పరస్పర సహకారం బాగానే ఉన్నాయి. ఎట్టి స్పర్ధలు లేవని చెప్పడానికి సంతోషిస్తున్నాను."

## వ్యవస్థ ఎన్నికల విమర్శ

"కాంగ్రెసు వ్యవస్థలో జరిగిన ఎన్నికల ఆభాసమని కొందరు భ్రమించవచ్చు. అది ఆభా గాదు. భిన్న భావాలుగలవా రందర్నీ ఒక త్రాటిపైకి తెచ్చాము. వాస్తవంగా ఎన్నికలనేవి లెక్క ప్రకారం జరిగితే విస్తారంగా భిన్న భావాలుగ వారికి విస్తృతమైన ప్రాతినిధ్యం వచ్చేదిగాదు.

64వ పేజీ చూడండి

ప్రొద్దున్నే జపం ముగించుకుని, హాల్లోకివచ్చి కాఫీ టిఫిన్ కోసం ఎదురు చూస్తున్న సుబ్బయ్యగారి మనసు, తన చిన్నకూతురు తెచ్చిపెట్టిన సమస్య గుర్తుకురాగానే, వికలమైపోయింది. ఏభయ్యేళ్లు పైబడ్డ తనను, ఆ శ్రీరామచంద్రమూర్తి, ఇంకా పరీక్షలకు గురిచెయ్యడం భరించరానిదిగా వుంది!

ఒక వైపు వ్యాపార సమస్యలు, ముఖ్యంగా ఇన్‌కంటాక్సు, సేల్సుటాక్సు గొడవలువూపిరి సలపనియ్యక పోతుంటే, గృహ వాతావరణం కూడా ఇలా అర్థాన్నంగా తయారవడం, ఏ మానవుడు సహించగలడు? తన పెద్ద కూతురు విమలకు వివాహం చేసిన మరునటి సంవత్సరమే అల్లుడికి ఆయుష్షు తీరిపోయి, ఆమె బ్రతుకు ఒక చీకటి కోణంగా మారింది.

కొ
సీరియ
ప్రారం

# మనసున మల్లెలు



రెండవ కూతురుకు యుక్త వయసు వచ్చి వివాహం చేద్దామనుకుంటూంటే, తను పై చదువు చదువు కుంటానని ఒకటే పట్టుపట్టి కూర్చుంది! ఇహ, పుత్ర రత్నం సంగతి ఆలోచిస్తే, పూర్తిగా మతి పోతుంది. ఎంతసేపూ కెమెరా పట్టుకుని ఫోటోలు తీస్తూ కూచోడమే గాని, వ్యాపారం సంగతి ఎంత మాత్రం పట్టించుకోడు కదా! భార్యామణికి వంట్లో



ధామ

ఎప్పుడూ జబ్బే! రాముడి కరుణ వల్ల, తను కాబట్టి ఇలా ధైర్యంగా వుంటున్నాడు గాని, మరొకడైతే ఈ చికాకులకు తట్టుకోగలడా ? అనుకుని తృప్తి చెందారు సుబ్బయ్యగారు. సన్నగా, నల్లగా, పొడుగ్గా వున్న సుబ్బయ్య గారిది కాయ శరీరం., తలవెంట్రుకల్లో తెల్ల బడిన వాటిసంఖ్య చాలా తక్కువ. రామనగరంలో వున్న ప్రముఖ వ్యాపారస్థులిద్దరు ముగ్గురిలో ఈయన ఒకరు కావడానికి, ఆయన శరీరారోగ్యమూ, బుద్ధి సూక్ష్మతే కారణం అని అందరూ అనుకుంటూ వుంటారు. అటువంటి సుబ్బయ్య గారికి ఆరోజు వుదయమే లేచిన దగ్గర్నుంచీ మన శ్శాంతి లేక పోవడానికి, ఆయన రెండో కూతురు కమలే కారణం.

"ఇడ్లీలో కారప్పొడి చాలా ? చట్నీ కూడా వెయ్యమంటారా నాన్నగారూ ?" అని సన్నని కంఠం వినిపించే సరికి ఆయన తన ఆలోచనలనుండి మేలుకుని, ఒక గాజు ప్లేటులో నాలుగు వేడి వేడి, పాల నురగలా తెల్లని, ఇడ్లీలను తెచ్చి బల్లమీద పెడుతున్న విమలను చూశారు.

తెల్లని చీరా రవికా వేసుకుని, మొహం మీద బొట్టు లేక పోయినా కళ్ళూ, ముక్కూ అందంగా వుండడం వల్ల ఒక చక్కని ఆకర్షణ కలిగి, చామన చాయ రంగు మెరుస్తున్నట్లు కన్పింపజేసే చక్కని నవ్వుతో, సుమారు ఇరవై ఎనిమిదేళ్ళ వయసున్నా, ఇరవై ఏళ్ల యువతిలా కన్పించే విమలను చూస్తే సుబ్బయ్యగారి కెంతో ఆనందం. ఆమె తెలివి తేటలు అద్భుతమైనవనీ, ఎటువంటి సమస్యనైనా సులభంగా పరిష్కరించగల చాకచక్యం ఆమెలో వుందని సుబ్బయ్య గారి అభిప్రాయం. ఆమె పుట్టిన దగ్గర్నుంచే తనకీ ఐశ్వర్యం ఎత్తుకొచ్చిందని ఆయన అంటూంటారు. అటువంటి విమలకు భగవంతుడు ఇటువంటి తీరని లోపం చెయ్యడం సృష్టి విచిత్రం!

"వద్దమ్మా." అని అంటూ ఇడ్లీ ముక్కని విరిచి, కారప్పొడిలో అద్దుకుని నోట్లో వేసుకున్నారు. "చిన్న లేచిందా ?" అని అడిగారు. తనకు గ్లాసుతో కాఫీ తెచ్చి, బల్లమీద పెట్టి వెళ్ళిపోతున్న విమలను.

"ఆ లేచింది. ఫలహారం చేస్తోంది."

సుబ్బయ్య గారి రెండో అమ్మాయిని ఆ ఇంట్లో అంతా, 'చిన్న' అని పిలుస్తారు. ఆమె వయసు పద్దెనిమిదేళ్ళు, అయినా ఆమెను ఇంట్లో అంతా ముద్దుగా, చిన్నపిల్లని చూసినట్లు చూస్తారు.

"దానికెలా నచ్చ చెప్పాలో తెలియకుండా వుంది. రామయ్య గారికి దాని ఫోటో పంపించాను. వాళ్లకు నచ్చి తీరుతుందని నా నమ్మకం. ఆయనకు ఒక్కడే కొడుకు. మద్రాసులో వాళ్ల వ్యాపారం ......" అని రామయ్యగారి వ్యాపార వివరాలు చెప్పి పొంగి పోబోతున్న సుబ్బయ్యగారి మాటకు విమల అడ్డు వచ్చి, "చిన్న, పై చదువుకు వెళ్లననేసింది." అంది.

"ఆ!" అన్నారు ఆనందంగా సుబ్బయ్యగారు. సుమారు వారం రోజుల్నుంచి ఇంట్లో, తను కాలేజీలో చదువుతానని పంతం పట్టి కూర్చున్న కమల, హఠాత్తుగా ఆ పంతం వదిలేసిందంటే ఆయన ఆశ్చర్య పోయారు. అందుకు కొంత వరకూ తన పెద్ద కూతురైన విమలే కారణ భూతురాలై వుంటుందని కూడా ఆయనకు తోచింది. గడ్డు సమస్యల్ని పరిష్కరించ డంలో ఆమెకొక ప్రత్యేకమైన నేర్పు వుందని ఆయనకు గట్టి నమ్మకం.

"దానికి 'టైపు' నేర్చుకోవాలని సరదాగా వుందిట." అంది విమల. ఆమె కళ్లల్లో ఒక చిన్న విశేషతను చూపించే వోర చూపుతో.

ఒక మేఘం క్రిందనుంచి బయటకి వచ్చి స్వచ్ఛంగా మెరుస్తున్న చంద్రుణ్ణి, మరొక మేఘం మళ్ళీ ఆవరించినట్లు సుబ్బయ్యగారి మొహంలో ఈ విచారం ఆవరించింది. ఎందుకంటే, టైపు, పల్లెటూరులో ఎలా నేర్చుకుంటుంది ? అందుకోసమైనా పట్నంలో కాపురం. ఇష్టం లేక నేనూ!

"మరయితే ........" అని అనుమానంగా తన అయిష్టాన్ని వ్యక్తపరచబోతున్న సుబ్బయ్య గారిని సగంలో ఆపింది విమల.

"మనవూళ్ళోనే వున్న టైపు ఇన్‌స్టిట్యూట్‌లో జేరుతుంది."

"మనవూళ్లో టైపు ఇన్‌స్టిట్యూటా ?" అన్నారు సుబ్బయ్యగారు నమ్మలేని ఆశ్చర్యంతో. రామనగరం లాంటి చిన్న పల్లెటూరులో టైపు ఇన్‌స్టిట్యూట్ వుండడం, అందులోనూ సుబ్బయ్య గారికి తెలియకుండా వుండడం, చాలా ఆశ్చర్యకరమైన విషయమే. విమల మొహం వైపు సూటిగా చూశారాయన.

"అదే, నాన్నగారూ, మన ప్రొఫెసరు గోపాలరావు గారు, మీతో వారం రోజుల క్రింద చెప్పలే, 'తన దగ్గర ఒక టైపు మిషను వుందనీ, దానితో ఒక ఇన్‌స్టిట్యూట్ తెరవాలని అనుకుంటున్నానని' — అందులో చిన్న, ఆయన ప్రథమ శిష్యురాలిగా చేరుతుంది." అంది విమల చిరునవ్వుతో.

సుబ్బయ్య గారికి విమల మాటలు క్రమంగా అర్థమయ్యాయి. గోపాలరావుగారు తనతో వారం రోజుల క్రితం, టైపు ఇన్‌స్టిట్యూట్ గురించి చెప్పినమాట నిజమే. కాని తను దానికి అంత ప్రాధాన్యము ఇవ్వలేదు. విమల ఆ విషయం గుర్తుంచుకుని, చిన్నను పై వూరికి వెళ్ళనియ్యక పోవడం, ఆమెను సంతృప్తి పరచడం అనే రెండు కార్యాలను సాధించింది. ఆ మాటలు విన్నాక ఆయన విచారం పూర్తిగా తొలగి పోయింది. "బావుందమ్మా, బావుంది. అయితే 'చిన్న' టైపు నేర్చుకుంటుందన్నమాట! ఒక ఆరునెలలు పోయాక దానికి బాగా టైపు చెయ్యడము వస్తే, దాని కోసం ఒక క్రొత్త టైపు మిషనే కొంటాను. అయితే అసలీ వుద్దేశం దానికి ఎలా కలిగింది ?" అని తన సందేహాన్ని వెలిబుచ్చారాయన. ప్రశ్నార్థకంగా విమల వైపు చూస్తూ.

అంత వరకూ గుమ్మం వద్ద నిలబడి తండ్రి మాటలకు జవాబు చెప్తున్న విమల, సంభాషణ పూర్తి చేసే ప్రయత్నంలో, "ఈ రోజుల్లో వట్టి చదువులకన్నా, ఏదైనా సాంకేతిక శిక్షణ వుంటే మంచిదని నేనే చెప్పాను. అదీ ఒప్పుకుంది. అమ్మ ఫలహారం అయిందో లేదో చూస్తాను" అని చెప్పి వంటింట్లోకి వెళ్ళి పోయింది.

సుబ్బయ్య గారి హృదయం తేలిక పడింది. కమలకు పై చదువు విషయంలో, ఎలా నచ్చ చెప్పడమా ? అని బెంగపెట్టుకుంటున్న సమయంలో విమల నేర్పుగా, ఈ మార్గం ఆలోచించింది. దీని వలన కమలకు ఒక వ్యాపకం ఏర్పడుతుంది., ఆమె తన కళ్ల ముందర తిరుగుతూనూ వుంటుంది. ఎలాగైనా ఒక ఏడాది లోపల ఆమె వివాహం జరిగి పోతుంది. రామయ్యగారి అబ్బాయి లాంటి సంబంధం దొరకడం మాటలా ? వారికి తనతో వియ్య మందడానికి ఉద్దేశం కలుగడం నిజంగా కమల అదృష్టం! ఇటువంటి సమయంలో పిల్లని పైవూరు చదువు కోసం పంపితే ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు ? అక్కడెవర్నైనా కాలేజీ కుర్రాణ్ణి చూస్తే, వాణ్ణే

## మనసున మల్లెలు

పెళ్ళాడుతానంటే ? ఈ రోజుల్లో, వయస్సులో వున్న యువతీ యువకుల మనస్సులు ఎలా క్షణ క్షణానికీ మారుతూంటాయో అందరికీ తెలిసిన సంగతే ! ఆడ పిల్లల తండ్రి అయినందుకు తన జాగ్రత్తలో తను వుండకపోతే ఎలా ? ఇహ, గోపాలరావుగార్ని పిలిపించి, కమలను రోజూ ఆయన ఇన్స్టిట్యూట్‌కి పంపుతాననీ, ఆమెకు జాగ్రత్తగా నేర్పమనీ చెప్పాలి. ముఖ్యంగా ఆమె ప్రవర్తనను కూడా కని పెడ్తూండమనీ, ఏ మాత్రం ఆమె తప్పు దారిలో వెళ్తున్నా, ముందు తనకు వచ్చి చెప్పమనీ చెప్పాలి. కమల అసలటువంటి పిల్ల కాదు., కాని ఆమె అందమైన పిల్ల కాబట్టి ఏ కుర్రాడైనా ఆమె మనసు పాడు చేయొచ్చు. అటువంటి కుర్రాళ్లకు గట్టి బుద్ధి చెప్పాలి, అని ఆయన నిశ్చయించుకున్నారు.

అప్పటికే ఎనిమిదిన్నర గంటలు దాటడం వల్ల, మిల్లుకు ఒకసారి వెళ్దామని లేవ బోతూంటే, నౌకరు పైడితల్లి వచ్చి, ఆయన కోసం ఎవరో ఒక బాబుగారు వచ్చారని చెప్పాడు. లోపలికి తీసుకు రమ్మని చెప్పి తను, బట్టలు వేసుకోడానికి తన గదిలోకి వెళ్ళి, పది నిముషాలలో హాల్లోకి తిరిగి వచ్చారు.

హాలులో సోఫాలో కూర్చున్న ఒక నడి వయస్సు యువకుడు, సుబ్బయ్య గారికి నమస్కరించి, "నేను ఈవూరికి క్రొత్తగా వచ్చిన అగ్రికల్చరల్ డిమాన్స్ట్రేటర్ని. నాకు తగిన ఇల్లెక్కడా దొరకలేదు. మీ మేడమీద ఏదైనా గది అద్దెకు ఇస్తారేమో అడుగుదామని వచ్చాను." అన్నాడు.

అతను ఎర్రగా, పొడుగ్గా వుండి, తెల్లని ఫాంటు తెల్లని షర్టు టకప్ చేసుకుని వున్నాడు. వయస్సు ముప్పై అయిదు లోపల వుంటుంది. మొహంలో వినయం, చిరునవ్వూ, ఆకర్షిస్తూ కనిపిస్తాయి. చక్కగా దువ్విన జుట్టూ, మీసం లేదు. నున్నటి గడ్డం, 'అతనికి అందంగా కన్పించడం అంటె ఇష్టం' అన్న విషయాన్ని వ్యక్తపరుస్తూ, మెరుస్తున్నాయి

"అలాగా ! మీ పేరు ?" అన్నారు సుబ్బయ్య గారు ప్రతి నమస్కరించి, ఎదురుగా వున్న సోఫాలో కూర్చుంటూ.

"రామారావు ! ఈవూరునుంచి ట్రాన్స్ఫర యిన కృష్ణమూర్తి, మీ గురించి ఎంతో పొగుడుతూ చెప్పాడు. అంతే కాకుండా, మా నాన్నగారు, నాగభూషణంగారని విశాఖపట్నంలో అడ్వకేటు, ఆయనకు కూడా మీరు తెలుసట., ఆయన కూడా మిమ్మల్ని కలవమని చెప్పారు."

"ఓహో ! నాగభూషణం గారబ్బాయా ! అయితే మాకు బాగా తెలిసినవారు. చాలా సంతోషం ! ఉండండి" అని సుబ్బయ్యగారు లోపలికి వెళ్ళి "అమ్మాయ్ విమలా, ఒక కప్పు కాఫీ పట్రా అమ్మా! అని కేకేసి, మళ్ళీ హాల్లోకి వచ్చి "ఎంతమాట ! నాగభూషణం గారి అబ్బాయా ! ఎప్పుడు వచ్చారు మీరు ? ఆయన నాకు చాలా ముఖ్య స్నేహితులు. మీ గురించి నేను విన్నానుగాని ఎప్పుడూ చూడలేదు." అని ఆనందం ప్రకటించారు. రామారావు తను ఆవూరు రెండు రోజుల క్రితమే వచ్చాననీ, ఒక స్నేహితుని ఇంట్లో వుంటూ, మంచి రూము కోసం వెదుకు తున్నానని చెప్పాడు.

సుబ్బయ్యగారు అతను తిన్నగా తమ ఇంటికి వచ్చి వుండాలిసిందని, అతనికి కావలిసింది ఒక 'రూమా' ? లేక కుటుంబానికి సరిపడే ఇల్లా ? అని అడిగారు. సరిగ్గా రామారావు, "నాకు కావలిసింది ఒక గదే కాని, చాలా అందమైనదిగా వుండి అన్ని సదుపాయాలూ వుండాలి. అద్దె ఎంతైనా భరిస్తాను" అని జవాబిస్తున్న సమయంలోనే విమల ఒక కాఫీ కప్పుతో హాలులోకి ప్రవేశించింది.

"వారికియ్యమ్మా." అని కూతురితో చెప్పి సుబ్బయ్యగారు "మీకు వివాహం అయిందా ?" అని రామారావు నడిగారు.

విమల కాఫీ కప్పు, రామారావు చేతికిస్తూ ఒక సెకన్ అతని వైపు చూసి తల దించేసుకుంది. అదే సమయంలో రామారావు కప్పు అందుకుంటూ ఆమెను చూసి, ఒక్క సెకనులో ఆమె అందమైనదని గ్రహించి, మరి అయిదు సెకన్లు ఆమెను చూస్తూనే కాలం గడిపి, ఆమె వెనకకు తిరిగి వెళ్ళిపోతూంటే, సుబ్బయ్య గారితో "నాకింకా వివాహం కాలేదు" అన్నాడు. హాలు ద్వారం దాటిన విమల చెవులో సూటిగా ప్రవేశించాయి ఆ మాటలు. రామారావు మళ్ళీ విమల వెళ్ళిన దిక్కు ఒకసారి చూశాడు.

ఒక క్రొత్త అనుభవం, మనం ఎదురు చూడనిది అకస్మాత్తుగా ఎదురైనప్పుడు మనిషి, తబ్బిబ్బవుతాడు. చల్లని రేయి., చీకట్లో ఏకాంతంగా మెల్లగా అరణ్యంలో నడుచుకుంటూ పోతున్న ఒక వ్యక్తి హఠాత్తుగా కమ్మని గానం సితార్ తీగెల మధురాలాపనతో విన్పిస్తే, ఆశ్చర్య సంభ్రమాలతో పరవశమౌతాడు ! తన జీవితంలో తను కోరే సౌందర్యరాశి కన్పించదనుకునే ఒక కళా హృదయుడు, తన కలలోకి కన్పించి, తనను కవ్వించి, వూరించే యువతి, ఒకనాడు ఈ వాస్తవిక ప్రపంచంలోకి దిగి వచ్చి తన కళ్ళ ఎదుట నిలిస్తే, అది నిజమని నమ్మలేనంతగా విభ్రాంతి పొందుతాడు. ఆ రూపంలో అతని సర్వాంగాలనూ ఒక్క క్షణం చైతన్యం కోలుపోయేటట్లు చేసి, మళ్ళీ మరుక్షణంలో అమిత ఉత్సాహంతో నింపుతుంది. విమలను చూసిన రామారావు ఈ అవస్థనే అనుభవించాడు. అతనిది కళా హృదయం అతను మంచి చిత్రకారుడు. విమల మొహంలో అతనికి తను కోరిన రూపం కన్పించింది. ఆమె రూపంలో తన స్వప్నసుందరి కన్పించింది.

"మా పెద్దమ్మాయి విమల. హిందీలో ప్రవీణ పాసయింది" అని సుబ్బయ్య గారనడంతో రామారావు, తనున్నది సుబ్బయ్య గారిల్లనీ, తను చూసింది వారమ్మాయినే కాని 'అప్సరస'ను కాదనీ, తెలుసుకున్నాడు.

"సంతోషం. నేనూ హిందీ నేర్చుకోవాలనుకుంటున్నాను. మధ్యమ పరీక్ష పాసవుతేనే గాని ప్రమోషన్ రాదు." అన్నాడు రామారావు నవ్వుతూ.

"మా అమ్మాయి దగ్గరేమైనా పుస్తకాలున్నాయేమో కనుక్కుంటా "నని అన్న తరువాత సుబ్బయ్యగారు ఒక్క నిముషం ఆగి, "అయితే మీకు కావలిసింది ఒక గదే అయితే, ఈ ప్రక్క మేడ కూడా నాదే. ఆ మేడమీద ఒక విశాలమైన గది వుంది. చూస్తారా ? అని అడిగారు.

"అలాగే. పదండి చూద్దాం." అన్నాడు రామారావు.

ఇంతలో హాలు ద్వారం వద్దనుంచి, "నాన్న

"గారూ, గోపాలరావు గారికి కబురు పెట్టారా ?" అన్న మాటలు విన్పించాయి. సుబ్బయ్యగారు వెనకకు తిరిగి చూసేసరికి, ఆయన రెండో కూతురు కమల కన్పించింది.

కమల ఎర్రగా, సన్నగా, వుండి రెండు జడలు వేసుకునే మురుస్తైన పద్దెనిమిదేళ్ళ అమ్మాయి. అనుక్షణం తను అందంగా వున్నానో లేదో చూసు కుంటూ, పౌడర్లూ, లిప్‌స్టిక్కులూ, కాటుకా, వాడే అధునాతన సుందరి. నైలాన్ చీరతో, జాకెట్టుతో మెరిసిపోయే ఆమెను చూసి రామారావు, ' వాళ్ల క్కయ్య కున్న అందం ఈమెలో సగం కూడా లేదు కదా, అనుకున్నాడు. సుబ్బయ్యగారు కూతురు వైపు చూస్తూ, " అలాగే కబురు పెడ్తానమ్మా " అన్నారు ఆమెను సంతృప్తి పరచాలనే వుద్దేశంతో

" ఇప్పుడే కబురు పెట్టండి." అంది కమల చిన్న గునుపుతో కూడిన కంఠంలో, ముఖంలో పెట్టుదలా, చిరాకూ చూపిస్తూ.

" అయితే మరి నేనెందుకు. పైడితల్లిని వెళ్ల మని నువ్వే చెప్పు." అన్నారు సుబ్బయ్యగారు కూతురికి కోపం రాకూడదని. " ఆయన రాగానే నాకు కబురు పెట్టు. మన ప్రక్క మేడమీద వుంటాము."

ఇంట్లోనుండి బయటకు వచ్చాక సుబ్బయ్య గారు, రామారావుకి, తనకు ఆ వూళ్లో మొత్తం తొరిళ్లు వున్నాయనీ, ఒక మిల్లూ, రెండు కొట్లూ, ఆయిల్ ఏజన్సీ వున్నాయని తన ఆస్తి వివరాలన్నీ చెప్పసాగారు. రామారావు శ్రద్ధగా విన్నాడు. తను వ్యాపారం ప్రారంభించి దగ్గర దగ్గర ముప్ఫై ఏళ్ల యిందనీ అప్పటి రోజుల్లో ' రామనగరం సుబ్బయ్య' గారంటే ఎంతో పేరు ప్రఖ్యాతులు, గౌరవ మర్యాదలూ వుండేవనీ, కలకత్తాకి వేగన్ల కొద్దీ నూనే, వారా, ధాన్యం, మొదలైన సరుకు ఎగుమతి చేసి బాగా లాభాలు గణించామనీ, ఇప్పుడా వ్యాపారమూ లేదు, ఆ లాభాలూ లేవనీ చెప్పారు. ఇప్పుడు వ్యాపారం ఎంత మాత్రం లాభం లేదనీ, టాక్సులన్నీ పోగా మిగిలేది చాలా కొద్ది అని అన్నారు. అంతేకాక, రాను రానూ, ప్రతివాళ్లూ వ్యాపారంలోకి దిగి పోతూండడం వల్ల, వ్యాపారానికి ఉన్న గౌరవమే పోయిందన్నారు. ' బ్లాకు మార్కెట్టంటే ' తనకు గిట్టదనీ, అందు వలన తాను ఇతరులకి మల్లే లాభాలు గణించలేక పోతున్నాననీ, రాముడి కరుణ సరిగ్గా వుంటే చాలనీ, ఇలా గౌరవంగానే తన జీవితం గడిపెయ్య దల్చుకున్నా ననీ చెప్పారు.

ఆయన లాటి సత్పురుషులు ఈ రోజుల్లో ఉండడం అరుదని అన్నాడు. సుబ్బయ్యగారు, రామారావు చాలా బుద్ధిమంతుడు కాబట్టి ఆ విషయం గ్రహించాడని అన్నారు.

ఆయన తీసికెళ్లిన మేడ, వాళ్ల ఇంటికి సరిగ్గా పది గజాల దూరంలో వుంది. ఈ రెండు మేడల మధ్యా, ఒక చిన్న రోడ్డు వుంది. ఆయన చూపించిన గది రామారావుకి నచ్చింది. మేడమెట్లు, క్రింది భాగానికి సంబంధం లేకుండా వీధిలోంచి వున్నాయి. అన్ని సదుపాయాలూ మేడమీద నుంచి దిగక్కర లేకుండా ఏర్పాటు చెయ్యబడి వున్నాయి. రూములో కూర్చుంటే, దూరంగా వున్న రామనగరం రైల్వే

# మనసున మల్లెలు

స్టేషన్ కన్పిస్తూంటుంది. రూముకి రోడ్డు వైపు కిటికీ వుంది. ఆ కిటికీ తలుపులు తెరుస్తూంచే రామారావుకి, " అద్దె సామాన్యమే. నలభై రూపా యలు. కరెంటు ఖర్చు వేరే అయిదు రూపాయలు " అన్న సుబ్బయ్యగారి మాటలు ఆశ్చర్యం కలిగించాయి. ఒక్క గదికి, ఈ పల్లెటూరులో ఇంత అద్దా ! అని పించింది అతనికి. పైగా తను ఆయనకు పరిచితుని కొడుకు నంటూనే, తనకు ఇంత అద్దె చెప్పడం సుబ్బయ్య గారి ఆశను వ్యక్తం చేస్తోందనుకున్నాడు. తను అంత అద్దె ఇవ్వదల్చుకోలేదని చెప్దామను కూంటూనే రామారావు కిటికీ తలుపు పూర్తిగా తియ్యడం, ఆ కిటికీలోంచి కన్పించిన దృశ్యం అతని

జైలులో ఇద్దరు మిత్రుల సంభాషణలు :

మొదటివాడు : మీరు మద్యం పుచ్చుకొంటారా?

రెండవ వాడు : లేదండీ ! ఆ అలవాటే లేదు.

మొదటివాడు: పోనీ జూదం?

రెండవ వాడు : దానికి మనకు ఆమడ దూరం !

మొదటివాడు : మరింకెందుకు ఇక్కడకు ఎందుకొచ్చినట్లు?

రెండవ వాడు : మనం ఎప్పుడు చేసేనేరం ఒకటే, అదే అబద్ధాలు చెప్పటం.

జి. యల్. నర్సయ్య (కోవెలకుంట్ల)

మనసుని మార్చెయ్యడం జరిగింది.

ఆ కిటికీ లోంచి చూస్తే సరిగ్గా సుబ్బయ్యగారి మేడమీద వరండా కన్పిస్తుంది. ఆ వరండాలో నిల్చున్న విమల, తల ఆరబెట్టుకుంటూ, ఈ కిటికీ వైపే చూడడంలో రామారావు వైపు ఒక నిముషం పాటు చూసి, తల వేరే వైపు తిప్పేసుకుంది. రామా రావుకి ఆ దృశ్యం చూశాక, ఆ గది విలువ బోధ పడింది. ఆ సౌందర్యరాశి దర్శనానికి కారణభూతమైన ఆ కిటికీ వున్న గది అద్దె నలభై రూపాయలు కాదు, అంతకు రెట్టింపైనా ఇవ్వవచ్చుననిపించింది రామా రావుకి.

" అద్వాన్సుగా ఒక నెల అద్దె ఇమ్మంటారా ? "

" అలాగే ఇవ్వండి. మనం పరాయి వాళ్లం కాదు. మీకెలాతోస్తే అలా చెయ్యండి." అన్నారు సుబ్బయ్యగారు. రామారావు వెంటనే తన జేబులోంచి నలభై అయిదు రూపాయలు తీసి ఆయన కివ్వడం, ఆయన అది తీసుకొని జేబులో పెట్టుకోవడం జరిగింది. తరువాత, పైడితల్లి వచ్చి సుబ్బయ్యగారి కోసరం గోపాలరావుగారు వచ్చి ఎదురు చూస్తున్నారనీ, చిన్నమ్మాయిగారు వెంటనే రమ్మంటున్నారనీ చెప్పాడు. రామారావుగారికి కేమి కావలసి వచ్చినా తనకు కబురు పంపవలసిందని చెప్పి, సుబ్బయ్యగారు వెళ్లిపోయారు.

ఆయన వెళ్లి పోయాక రామారావు చాలాసేపు ఆ కిటికీ వైపు చూస్తూ ఆలోచించ సాగాడు. తను సుబ్బయ్యగారి పెద్దమ్మాయిని చూసిన దగ్గ ర్నుంచి ఒక నూతనోత్సాహాన్ని అనుభవిస్తున్నాడు. తల్లిదండ్రులు ఎంత బలవంత పెట్టినా, ముప్ఫై మూడేళ్ళ వయస్సు వచ్చినా, తను ఇంకా వివాహం చేసుకోక పోవడానికి కారణం తనకు నచ్చిన అమ్మాయి కన్పించక పోవడమేనూ. అటువంటిది ఈరోజు ఆనొక విశేష సౌందర్య రాశిని చూడడం ఆమె బాల వితంతువు కావడం, ఏదో తన జీవితంలో మార్పును సూచిస్తోంది. ఆమె వరండాలో నిల్చున్నప్పటి భంగి మలో ఒక చిత్రం గీయాలనిపించింది. ఆమె కను ముక్కు తీరు, తీర్చి దిద్దడంలో విధాత ఒక ప్రత్యేక పద్ధతి నవలంబించి నట్లుంది. ఆమెను గురించి ఆలోచించిన కొద్దీ ఆనందం కలుగ సాగింది. రామా రావుకు. కాని, ఆమె గురించి తను ఇంతగా ఆలోచిస్తు న్నాడు కదా, తన గురించి ఆమె లవలేశమైనా ఆలో చిస్తుందా ? అని అనుమానం కలిగింది అతనికి. ఇంతలో " బాబూ " అన్న పిలుపు విన్పించింది.

పిలిచింది, సుబ్బయ్యగారి నౌకరు పైడితల్లి. " గది అద్దె ముప్ఫై రూపాయలే అని సెప్ప మన్నారు. బాబూ. కడమా పదేను రూపాయిలు ఇచ్చి రమ్మన్నారు." అని పదిహేను రూపాయలు రామా రావుకి ఇచ్చాడు.

" ముప్ఫైయ్యా! మరి ఆయన అలాగన్నారేం ?"

" ఆ బాబుకు తెల్దు అమ్మగోరు సెప్పాక, డబ్బు తిరిగి తోలేసినారు."

" అమ్మగారా ? ఏ అమ్మగారు ? "

" యిమలమ్మగోరు. ఆయమ్మ ఎంతసెప్తే అంతే. తిరుగులేదు."

తన అద్దె విషయంలో విమల కలుగ జేసుకుని తండ్రికి చెప్పడం వల్ల, అద్దె పదిహేను రూపాయలు తగ్గిందని రామారావు గ్రహించాడు. అంటే తన మీద ఆమెకూ కొంత ఆసక్తి వుందన్న మాట. పైడి తల్లి ఈ వార్త చెప్పినందుకు రామారావుకి వాడంటే చాలా అభిమానం కలిగింది. వెంటనేవాడి చేతులో ఒక రూపాయుంచి, " ఆ స్టేషను హోటలు నుంచి నాకో కాఫీ పటా. మిగతా చిల్లర నువ్వు తీసుకో." అన్నాడు.

" సిత్తం బాబూ. ఇప్పుడే తీసుకొస్తా " అని పైడితల్లి బయల్దేరాడు. రామారావు మరి కొద్ది సేపటిలోనే తన సామానంతా స్నేహితుని ఇంటనుంచి తెప్పించేసుకోవాలని నిర్ణయించాడు.

పైడితల్లి సహాయంతో ఆరోజు సాయంకాలాని కల్లా తన గది సర్దడం పూర్తి చేసి స్మిమితంగా, మళ్లీ విమల గురించి ఆలోచిస్తూ కాలం గడుప సాగాడు రామారావు. ( సశేషం. )



# "నేను"



**ఎన్. టి. రామారావు**

ఈనాడు నన్నభిమానించి, ఆదరించి నటునిగా నాకిస్థానం కల్పించిన నా అభిమానులకు; అశేషాంధ్ర ప్రజానీకానికి హైదరాబాదుకు చలనచిత్ర పరిశ్రమ తరలింపుసమస్యలో నాపాత్రెంత వున్నదీ, నేనేమి చేయవలసిందీ తెలియజేయ వలసిన అవసరం యేర్పడింది.

నిత్యమూ ఈ విషయమే ప్రస్తావించి నాకు జాబులు వ్రాసేవారికి, నా అభిప్రాయం తెలుసుకోగోరే ఆంతరంగికులకు, నా దేశభక్తిని ప్రశ్నించేవారికి యిక ఈ విషయం గోప్యంగా ఉండనీయడం ఆరోగ్యం కాదనీ అందరి సంశయ నివృత్తి కోసం నేను నా అభిప్రాయం, ఈ క్రింది నా అనుభవం తెలియ జేస్తున్నాను.

విజయా గార్డెన్సులో సోదరుడు నాగేశ్వరరావు గారికి వీడ్కోలిచ్చే సందర్భంలో సమావేశమైన సభలో వారు "నేను హైదరాబాదు వ్యాపారదృష్టితో వెడుతున్నానని" బహిరంగంగా తెలియ జేసిన అనంతరం నేను వారిని కలుసుకోవడం సంభవించిన సందర్భంలో "మీకు ఈ చలనచిత్ర పరిశ్రమను హైదరాబాదుకు తరలించే ఉద్దేశ్యం ఉందా ? ఉంటే నేను వస్తాను. మనిద్దరం మన తెలుగు పరిశ్రమకు సంబంధించిన ప్రతి వారినీ విజయా గార్డెన్సులో సమావేశపరచి ఈ చలనచిత్ర పరిశ్రమ తరలింపుమీద వారి వారి అభిప్రాయాలు తెలుసుకొని మనం క్రొత్తగా హైదరాబాదులో వృద్ధి చేయబోయే చలనచిత్ర పరిశ్రమకు ప్రభుత్వం వారివద్దనుండి పొందవలసిన అవసరమైన సహాయాలు అన్నీ పొందు పరచుకొని, పరిశ్రమకు సంబంధించిన అన్ని శాఖల నుంచి ఒక్కొక్క ప్రతినిధినిం ఎన్నుకొని, అందరం ఆ మెమోరాండం హైదరాబాదు తీసుకువెళ్లి ప్రభుత్వానికి అందజేద్దాం" అని చెప్పాను. ఇక నా సహకారం పూర్తిగా ఇస్తా. నావ్యక్తిగత అభిప్రాయాలు కూడా వారికా సందర్భంలో తెలియ జేశాను.

"మనం కోరుకున్నచోట పరిశ్రమకు దాని అభి

# 'ప్రత్యేక వ్యాసావళి'లోని నాలుగవ వ్యాసం

వృద్ధికిగాను నూరు యకరముల స్థలం ఉచితంగా గాక సరసమైన ధరకు ప్రభుత్వంవారు యివ్వాలి. ఆ ఇచ్చిన భూవసతిలో ప్రతి స్టూడియో నిర్మాతకు 5 యకరములు మొదలు 10 ( పది ) యకరముల వరకూ., పరిశ్రమలో వున్నవారందరికీ అవుసరములకు వీలుగా గృహ నిర్మాణానికి సౌకర్యాలు కల్పించబడాలి. ఈ విధంగా గృహ నిర్మాణం చేస్తేనే వారికి ప్రభుత్వం అప్పు ఇవ్వాలి. స్టూడియో నిర్మాణాన్ని ప్రోత్సహించే నిమిత్తం నిర్మాత ఎంత మొత్తమైతే తన పెట్టుబడి క్రింద యేర్పరచుకొంటాడో, దానికి సరైన అంత మొత్తం స్టూడియో నిర్మాణ కాలంలో వడ్డీ రాయితీతో అప్పుగా ఇవ్వాలి. ఇక స్టూడియో చిత్ర నిర్మాణం ప్రారంభించిన తరువాత సాలుసరి వాయిదాలలో ఋణం చెల్లించుకొనేయేర్పాటు చేయాలి. ఈ విషయంలో అడిగితే ప్రభుత్వం వారికి నేను హామీ ఇస్తాను. యన్. ఏ. టి. పేరిట మేము స్టూడియో నిర్మిస్తాం. నా పోషక సంస్థల ప్రోత్సాహంతో నేను నటునిగానే గాక, అవుసరమైతే దర్శకునిగా కూడా చిత్ర నిర్మాణ బాధ్యత తీసుకుని మా స్టూడియో ప్రారంభించిన మూడవ సంవత్సరంలో కనీసం మూడు చిత్రాలు, ఆపైన రెండేండ్లలో సంవత్సరానికి ఆరు చిత్రాలను నిర్మించే యేర్పాట్లు చేసుకుంటాం. ఇక మీ ఉద్దేశ్యం యేమిటి ? నన్నేం చేయుమంటారు ? " అని మనస్సు విప్పి అడుగగా వారు " నేనిప్పుడు హైదరాబాదు వెడుతున్నది చిత్ర పరిశ్రమ కోసం కాదు.. నా పిల్లల చదువు కోసం, నా భావివ్యాపారాభివృద్ధి కోసం. మీరు రానక్కరలేదు. అందరం [illegible] వెడితే మనమేదో మనస్సులో ఉంచుకొని [illegible] పలుక్కని వెళ్లుతున్నట్లుంటుంది. మీరిక్కడే ఉండండి " అని చెప్పారు. " సరే, అలాగే ! మీ ఇష్ట ప్రకారమే " అన్నాను.

వారు వెళ్లారు. వారు కావాలనుకునే నిర్మాతలు అక్కడ ఉన్న సారథీ స్టూడియో ఉపయోగించుకొని చిత్రాలు నిర్మించుకోవచ్చుననే ఉద్దేశ్యంతో వెళ్లారు.

ఇక లనంతరం కొంత కాలానికి నేను ఆంధ్ర రాష్ట్రంలో ఇంతవరకూ ఎక్కడాలేని 70 యం. యం. థియేటరు మన రాజధానియైన హైదరాబాదు పట్టణంలో ప్రప్రథమంగా నిర్మించాలన్న దీక్షతో స్థల నిర్ణయం చేసుకొని అది చూడ్డానికి వెళ్లాను. ఆ సందర్భంలో నాకు మాతృ సమానురాలైన సోదరుడు నాగేశ్వరరావు తల్లిగారిని పరామర్శించడానికి వారింటికి వెళ్లాను. ఆ మరునాడు వారు నన్ను విందుకు పిలిచిన సందర్భంలో " మీరెప్పుడు హైదరాబాదు వస్తారు?" అని వారు ప్రశ్నించారు. అప్పుడు నేను " ఆనాడు మీరు విజయా గార్డెను సభలో అన్న మాటలు గుర్తున్నయ్యా? మదరాసు నగరంలో తెలుగు వారికి ప్రాముఖ్యత లేదు. సరిసమానంగా గౌరవించ బడడం లేదు కనుకనే నేను హైదరాబాదు వెళ్తున్నానని., ఈనాడు చలనచిత్ర పరిశ్రమాభివృద్ధికి తగు సూచనలిచ్చే సందర్భంలో తగినంత అనుభవం గడించిన తెలుగు పెద్దలెవరికీ ఈ విషయము తెలియ పర్చక, వారి సలహాలను, సూచనలను అడుగక తిరస్కార భావంతో వారిని విస్మరించినప్పుడు నేను మాత్రం పరిశ్రమాభివృద్ధికి చేయగలిగిందేముంది ? మీరు నాడు నాతో హైదరాబాదు వ్యాపారాభివృద్ధికి వెళ్తున్నానన్నారు, నేనీనాడు మదరాసులో వ్యాపారరీత్యానే ఉన్నానన్నాను. నేను సంకల్పించిన థియేటరు నిర్మాణం జరిగి ఇక్కడకు నేను రావడం అవుసరమని అనుకున్నపుడు తప్పక వస్తాను " అన్నాను.

కాని తదనంతరం పత్రికలలో వెలువడిన వార్తల వల్ల ప్రజానీకంలో అపోహ నానాటికీ పెరుగుతూ వచ్చింది. నా అభిమానులు నన్ను

మీరెందుకు హైదరాబాదు రాలేదు ?
మీలో దేశభక్తి లేదా ?
మీరు రారా ? ? ?

అంటూ ప్రశ్నల వర్షం కురిపించడం ప్రారంభించారు.

వృత్తికి, దేశభక్తికి గల సంబంధం ఏమిటో నాకు అర్థం కాలేదు. నిర్మాత వద్ద నిలువ బట్టి హైదరాబాదులోనైనా, మదరాసులోనైనా వారి తోషికం తగినంత పుచ్చుకొని బ్రతుకుతెరువు కోసం చిత్రాలలో నటిస్తూ, నటనను జీవనోపాధిగా చేసుకున్నప్పుడు, వ్యక్తిలో ఉండే దేశభక్తిని వృత్తితో ముడి పెట్టడం భావ్యం కాదని నా అభిప్రాయం. ఇది పెట్టుబడి కోసం [illegible] తెగు.

పరిశ్రమ ప్రారంభదశలో [illegible] బాయి, కొల్హాపూరులకు వెళ్లి తెలుగు చిత్ర నిర్మాతలు అక్కడ చిత్రాలు నిర్మించారు. ఆ తరువాత స్టూడియో వసతి సౌకర్యాలు సమీప నగరమైన మదరాసులో ఏర్పడగానే ఇక్కడ తెలుగు చిత్ర నిర్మాణం ప్రారంభించారు. మదరాసులో ఒక్క తెలుగు చిత్ర నిర్మాణమే గాక తమిళ, కర్నాటక, మళయాళ, హిందీ భాషా చిత్రాల నిర్మాణం కూడా క్రమేపీ వృద్ధి కావటం వల్ల ఎక్కువమందికి మదరాసు చలనచిత్ర పరిశ్రమ జీవన భృతి కల్పించి వారివారి బ్రతుకు తెరువుల కాధార భూతమైంది. మన తెలుగు సాంకేతిక, సహాయక బృందమంతా ఈ నాడు ఒక్క తెలుగు సంస్థలలోనే గాక భాషేతర సంస్థలలో కూడ వృత్తి కల్గించుకుని మదరాసులో మనుగడ ఏర్పరచుకున్నారు. ఇక మన తెలుగు నటీనటుల విషయం— మన తెలుగునటీనటులనేకులు తమిళ, హిందీ, కన్నడ చిత్రాల నటీనటులే. ఇన్ని ప్రోత్సాహాలు ఈనాడు మదరాసులో ఉండడం వల్లనే పరిశ్రమ ఇక్కడ వృద్ధి చెందుతూ వచ్చింది. ఇంత మంది ఇక్కడ స్థిరనివాసం ఏర్పరచుకున్నది మదరాసు మన పట్టణమనుకొని కాదు. మన బ్రతుకు తెరువుల సమస్యకు సంబంధించిన పరిశ్రమ ఇక్కడుందని. ఆ నాడు మదరాసు వచ్చింది దేశ భక్తితో కాదు. జీవన భృతి కోసం— వృత్తి, వ్యాపారం కోసం.

దేశభక్తే కనుక పరిశ్రమను బ్రతికిస్తే నాడు రాజమండ్రిలో వెలసిన "దుర్గా సినిటోన్", విశాఖ పట్టణంలో అవతరించిన "ఆంధ్రా సినిటోన్" అచిర కాలంలోనే వ్యాపార దృష్ట్యా చిత్ర నిర్మాణం సాగక మూయబడటానికి కారణం ఏమిటి ? ఆ నాడు పరిశ్రమాభివృద్ధికి తగినంత హామీ, ప్రోత్సాహాలు లభించక పోవడం వల్లనే ఆ విధంగా జరిగింది. ఈ నాడు తెలుగు చలనచిత్ర పరిశ్రమ హైదరాబాదుకు పూర్తిగా వెళ్లలేని స్థితిలో ఉందంటే దేశ భక్తి మాలో లోపించి కాదు —అక్కడ వసతి సౌకర్యాలు అందరికీ సమాన ప్రతిపత్తితో, సమదృష్టితో, సమ గౌరవంతో లభించక పోవడం వల్లనే.

ఉన్నది ఒక్క స్టూడియో. సంవత్సరానికి నాలుగైదు చిత్రాల కంటే ఎక్కువ నిర్మించే అవకాశం లేదు. సోదరుడు నాగేశ్వరరావుగారు నటించే చిత్రాలవే [illegible] నాలుగు. ఇక మేమందరం వెళ్లితే ఏలా ఒక చిత్రానికి పైన నిర్మాణం [illegible] సాగదు. ఈ నాడు [illegible] తెలుగు చిత్రాలలో పని కల్పించుకున్న [illegible] ఏమవుతారో ? వారి కేవిధంగా జీవనోపాధి కల్గించగలమో అన్నది మా ముందున్న చిక్కు ప్రశ్న. వేలాది సాంకేతిక సహాయక [illegible] నిరుద్యోగులై, బ్రతుకే భారమై [illegible] పడవలసిందేనా ? మదరాసులో [illegible], ప్రతి నిముసం నిర్మాతలకు [illegible] చిత్రాలలో నటిస్తున్నానంటే నాలో శక్తి ఉండీ కాదు— [illegible] అవుసరం ఉండీ కాదు. ఏ నాటి కానాడు, ఏ క్షణానికాక్షణం, నా కృషిమీద ఇందరి జీవితాలు, ఇంత మంది నిర్మాతల పెద్ద పెట్టుబడులు ఆధారపడి ఉన్నాయని గుర్తించడం వల్లనే. ఈనాడిన్ని చిత్రాల్లో నటించక పోతే చిత్ర నిర్మాణ సంఖ్య తగ్గుతుంది-- నిర్మాణం సంఖ్య తగ్గితే నిరుద్యోగ సమస్య ప్రబలుతుంది. ఇదీ ఈ నాడు మన మాలోచించితే తేలే పర్యవసానం.

నేనీ వ్యాసం ముగించే ముందు నన్ను ప్రశ్నించే వారియొక్క, నా అభిమానుల యొక్క సలహా సంప్రదింపులు కోరుతున్నాను. దేశాభిమానం పేరుతో మదరాసులో ఈ నాడు చిత్ర పరిశ్రమలో ఉన్న ఇంత మంది తెలుగువారి జీవితాల విషయం ఆలోచించకుండా హైదరాబాదు తరలి రానా ? లేదా అక్కడ పరిశ్రమ తరలింపుకు తగు సదుపాయాలు, సౌకర్యాలు కల్పించబడేవరకూ ఈనాడిక్కడ పరిశ్రమలో మనుగడ యేర్పరచుకున్న [illegible] తెలుగు వారిని కని పెట్టుకుని ఉండనా ? !! ★

సీతమ్మ చెప్పటం ముగించి చెమ్మగిలిన కళ్లను కొంగుతో వత్తుకొంది. ఆమె చెప్పినదంతా విన్నమీదట గుండె చెరువైపోయింది రంగమ్మకు. అంతటి దారుణం జరిగిందంటే నమ్మలేక పోయాడు భుజంగం.

కొద్ది క్షణాలైన మీదట మళ్ళీ మొదలెట్టింది సీతమ్మ: "మనబ్బాయీ నువ్వూ ఏదో సహాయం చేయక పోతారా అనే ధైర్యంతో పిల్లను తీసుక వచ్చాను. ఈ వ్యవహారాన్నెలాగైనా నడిపించి దాని కాపురం నిలబెట్టి చచ్చి నీ కడుపున పుడతారా తమ్ముడూ!"

"అవునమ్మమ్మా! మామయ్యకీవిషయాలన్నీ బాగా తెలుసు. తప్పకుండా కనుక్కుంటాడు. పోదామని పట్టుబట్టి లాక్కొచ్చాను అమ్మని. ఇక భారమంతా మీదే." భాను హీన స్వరంతో అని, జాలిగా భుజంగం కళ్ళల్లోకి చూసింది.

"అది సరే సీతమ్మా, వాడికీ నాకూ చేతనైన సాయం చేయటానికి మేం సిద్ధమే ననుకో. అయినా ఇంత జరిగిపోయిన తర్వాత ఇప్పుడు కేసు పెట్టటమంటే...." రంగమ్మ సందేహంగా నాన్చింది.

"ఇంత జరిగిపోయింది గనుకనే కేసుపెట్టి, వాణ్ణి ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు తాగించాలి. రాస్కెల్. వీళ్లకు వెనకా ముందూ ఎవరూ లేరనే ధైర్యంతోనే గదా వాడింత బరి తెగించి పోయింది. చూపెడదాం మన తడాఖా.... మీ కెందుకు మీరు నిబ్బరంగా ఉండండి. నే చూస్తాగా."

భుజంగం మాటలకు సీతమ్మ, భానుపొంగి పోయారు. వాళ్ళిద్దరి మొహాల్లోనూ సంతృప్తి గోచరించింది. కళ్ళు మిలమిలలాడాయి.

"చిన్నవాడివైనా భేషయిన మాట మాట్లాడావురా భుజంగం! అసలు మీ బావ వెర్రి బాగుల వారనే గదా వాళ్లంతా ఇంత చేసింది. మధ్యవర్తి పరిష్కారాన్ని కూడా కాదు పొమ్మని, నీకు చేతనయింది చేసుకోమని కబురు పెట్టారు. ఎంతకైనా తగినమనుషులు."

"ఆ.... ఆ.... చూద్దాంగా వీళ్ళ ధైర్యం పిళ్ళాను. కేసు పెడుతున్నామని తెలిస్తే చాలు పరుగెత్తుకు రారూ?.... సరే.... నేనలా వూళ్ళోకి పోయి ప్లీడరు గారితో మాట్లాడి వస్తాను...." అంటూ బయల్దేరాడు భుజంగం......

సీతమ్మ బుచ్చి వెంకయ్యగారి ధర్మపత్ని. బుచ్చి వెంకయ్యగారు తెనాలిలో పేరు మోసిన పురోహితుడు. స్మార్తంలోనూ, శౌచకర్మల్లోనూ ఆయన దిట్ట. ఆయనది రాజ పౌరోహిత్యం. చక్కని డాబా, నాలుగైదెకరాల పల్లపు భూమి కులవృత్తి మీది సంపాదనతోనే గడించాడని ప్రతీతి. అరవై యేళ్ళు నిండినా, ఈ నాటి వరకూ రెక్కవంచి పని చేయటం అలవాటాయనకు. ఇంట్లో గేదె దగ్గర శుభ్రం చేయటం దగ్గర్నుంచీ, పొలంలో కలుపు తీయటం వరకూ సమస్తమైన పనులూ ఆయనంతట ఆయనే చేసుక పోతాడు. 'బాపన వ్యవసాయం' అని వూళ్ళో వాళ్ళు ఈర్ష్య పడటం, హేళన చేయటమే గాని ఆయన దాని వలన నష్టపోయిందేమీ లేదు. దానికి నిదర్శనం ఈ నాటికి ఆయన వృద్ధి చేసిన భూవసతే. సీతమ్మ కూడా ఆయనకు తగిన భార్య. అన్ని పనుల్లోనూ భర్తకు ఆమె సాయం ఉంటూనే ఉంటుంది.

భానువాళ్ల ఏకైక పుత్రిక. ఆ పిల్ల పెళ్లికి వెతికి వెతికి సంబంధం తెచ్చాడు బుచ్చి వెంకయ్య. ఉన్నది ఒక్కగా నొక్క కూతురు. కలిగిన కుటుంబంలో పడేస్తే పిల్ల సుఖ పడుతుందనే కోరికతో నానాచోట్ల తిరిగి ఓ సంబంధం స్థిర పరుచుకున్నారు.

పిల్లవాడిది అవనిగడ్డ దగ్గర ఏదో పల్లెటూరు. అతని భాగానికే ముప్పై ఎకరాల భూవసతీ, ఓ డాబా ఉన్నాయి. అతను బీ. కాం. ప్యాసయాడు. దీక్షితులుగారనే మధ్య వర్తి మాటప్రకారం బుచ్చి వెంకయ్య తన కష్టార్జితంలో ఆరువేల రెండు వందలు కట్నంగా సమర్పించుకుని మరో రెండు వేలదాకా పెళ్లికి ఖర్చు పెట్టి వైభవంగా భాను వివాహం చేశాడు.

మూడు నిద్రలకని అత్తవారి వూరికి వెళ్లింది భాను. వాళ్లింట్లో ఉన్న మూడు రోజుల్లోనూ

---

రాము: ఒరే! ముఖానికి, చేతులకు ఆ కళ్లేమిటిరా! ఆ అమ్మాయి నిప్పువంటిది, ఆమె జోలికి పోవద్దన్నానే విన్నావా?

కుమార్: అది కాదురా! స్టవ్ ముట్టిస్తుంటే ముఖము, చేతులు కాలాయిరా!

ఎ. కృష్ణయ్య (తిరుపతి)

---

ఓ రోజున పగటి పూట భోజనాలయ్యే సరికి చాల ప్రొద్దుపోయి రెండు గంటలు దాటిందిట. భాను అప్పటి వరకూ ఆకలికి ఆగలేక కాబోలు స్పృహ తప్పి పడిపోయిందిట. ఈ సంఘటనతో మొదలైంది అసలు రభసంతా. భాను అత్తవారింటి వాలాకు జనమంతా ఆమెను గురించి చిలవలు పలవలుగా కల్పించి చెప్పుకుని చివరి కొక నిశ్చయానికొచ్చారు— భానుకు మూర్ఛ రోగం ఉందని. అంతే. ఆ కారణంతో భాను అత్తగారింటికి దూరమైంది. ఆమె భర్త శంకరానికి బుచ్చి వెంకయ్య, సీతమ్మ ఇద్దరూ ఎన్నో విధాల నచ్చ చెప్పి చూశారు, కాని అతను మాత్రం వాళ్ళమాటల్ని ససేమిరా నమ్మలేదు.

బుచ్చి వెంకయ్య, సీతమ్మలకు ఇది పెద్ద అఘాతమై పోయింది. కష్టపడి చెమటోడ్చి సంపాదించిన సొమ్మూ పోయి శనిపట్టినట్లుంది వాళ్ల పని. బుచ్చి వెంకయ్య అసలు పిచ్చివాడే అయినాడని చెప్పొచ్చు. ఆయనకు ఏం చేయాలో పాలుపోలేదు. పెద్ద మనుషులిచ్చిన సలహాల ప్రకారం కాళ్ళకు బలపాలు కట్టుకుని అల్లుడింటి చుట్టూ ఆసుపోసేడు. కాని ఫలితం దక్కలేదు. పైగా 'మీ పిల్లను నేను ఏలుకోన'ని ఖచ్చితంగా తేల్చేశాడు శంకరం. ఈ విధంగా రెండేళ్ళు గడిచినై. ఈ రెండేళ్ళ కాలంలోనూ జరగ వలసినవన్నీ జరిగిపోయినై.

శంకరం మళ్లీ పెళ్లి చేసుకున్నాడన్న వార్త వినేసరికి కడుపు రగిలి పోయింది బుచ్చి వెంకయ్య, సీతమ్మలకు. భాను హృదయం వ్రయ్యలైంది. గంగ వెర్రులెత్తిన బుచ్చి వెంకయ్యగారు లాయర్ నోటీసిప్పించారు. శంకరానికి — మా అమ్మాయిని ఏలుకోకపోతే భరణం ఇప్పించమని. శంకరం దానికి సమాధానంగా "మీ అమ్మాయి కాపురం చేయటానికి నాకేం అభ్యంతరం లేదు. వచ్చి దించి పోవచ్చునని" తిరుగు నోటీసిప్పించాడు. కాగితాల మీద ఇలా వ్యవహారం నడుపుతూ తెలిసినవారి ద్వారా "ఆ అమ్మాయిని తీసుకొచ్చి దించాడంటే చంపేస్తా"నని. బెదిరింపులు సరఫరా చేశాడు శంకరం. దాంతో బుచ్చి వెంకయ్యగారి పని పచ్చివెలక్కాయ గొంతున పడ్డట్టయింది.

ఎందర్ని సలహాలు అడిగినా ఏకగ్రీవంగా చెప్పిందొక్కటే. 'శంకరం రెండో పెళ్లి చేసుకున్నాడని బుజువుచేయగలిగితే ఏమన్నా దక్కుతుంద'ని. ఇక ఆ ప్రయత్నంలో పడ్డారు బుచ్చి వెంకయ్యగారు. ఇటువంటి వ్యవహారాలు అంటే ఏమిటో బొత్తిగా తెలియని ఆయనకు విషయ సేకరణ అసాధ్యమై పోయింది. ఎలాగైతేనేం నానా అవస్థలూ పడి చివరికి కొంత భోగట్టా సేకరించ గలిగారు. శంకరం రెండో పెళ్లి బందర్లో చేసుకున్నట్టు, ఏదో ఒకరోజు అర్థరాత్రి ఎక్కడో మారుమూల రామనాథమనే ఆయన ఇంట్లో ఆ పెళ్లి జరిగినట్లు : పెళ్లి జరిపిన పురోహితుడు ఎవరో కోదండరామశాస్త్రులనీ తెలిసింది. వీటి ఆధారంతో శంకరం మీద క్రిమినల్ కేసు నడప వచ్చని తెనాలిలో ప్లీడర్లంతా బుచ్చి వెంకయ్య గారికి ధైర్యం చెప్పారు. కాని అందరూ కూడా దావా బందర్లోనే వేయాలని, సాక్ష్యం బలంగా లేందే ప్రయోజనం వుండదనీ ఒక్కమాటగా చెప్పారు. వాళ్ళు చెప్పిన విధంగా సాక్ష్యం సమకూర్చుకోవటానికి బుచ్చి వెంకయ్యగారు ఐదారుసార్లు బందరు తిరిగాడు. కాని పని కాలేదు. ఎవరికి వాళ్ళు ఆ పెళ్లి జరిగిన విషయం యదార్థమనీ, తమకూ తెలుసనీ చెప్పేవాళ్లేగానీ, అమాటే కోర్టులో చెప్పమంటే, "లమ్మో మాకెందుకీ గొడవంతా" అని దాటుకుపోయేవాళ్ళు. ఎన్ని విధాల ప్రయత్నించినా ఫలితం కనపడక ఆశ వదులుకున్నారు. బుచ్చి వెంకయ్యగారు.

ఒకనాడు హఠాత్తుగా భుజంగం గుర్తుకొచ్చేడు సీతమ్మకు. భుజంగం తల్లితో బందర్లో ఉంటున్నాడు. కనుక అతని ద్వారా పనేమైనా అవుతుందేమో ననే ఆశ కలిగిందామెకు. భుజంగం తల్లి రంగమ్మ తనకు దూరపు చుట్టమే అయినా వస్తుతః కాస్త మెత్తని మనసు కలిగిన మనిషి : సాయపడక పోదనే నమ్మకంతో బందరు పోయి మాట్లాడి వస్తానని బయల్దేరింది సీతమ్మ భానుతో సహా. 'ఈ ఆలోచన ఎందుకొచ్చిందో, సరే పోయి రమ్మ'ని తలూపేడు బుచ్చి వెంకయ్య ........................

భుజంగం ఇంటికి తిరిగి రావటమే నిరుత్సాహంగా వచ్చాడు. గడపలోనే ఎదురై ఆత్రతగా అడిగింది సీతమ్మ, "ఏమైందిరా తమ్ముడూ వెళ్లినపని" అని. భుజంగం కాస్త విసుగా ఆమె వైపు చూసూ

# పరిష్కృతం

"ఆ ..... ఇప్పటి కిప్పుడు తేలేదా ఏమన్నానా ఈ విషయం.........." అంటూ లోపలికి వెళ్ళి కూర్చున్నాడు. భాను, సీతమ్మలు ఒకరి మొహాలొకరు చూసుకుని నెమ్మదిగా భుజంగం దగ్గరకొచ్చి నేలమీద కూర్చున్నారు.

భుజంగం మొదలెట్టాడు : "ప్లీడరుగారు చెప్పటం 'కేసు చాలా తిరకాసుగా వుంది. అవతల వాళ్ళని సాధించేది వున్నా లేకపోయినా మనం మాత్రం చాలా ఖర్చు పెట్టాల్సి వుంటుంది, అంటాడు. అందుకు సిద్ధమై గట్టి సాక్ష్యాన్ని తెచ్చుకో గలిగితే గెలవటానికి అవకాశం వుందంటాడు. మీరిచ్చిన కాగితాలన్నీ ఆయనకు చూపెట్టాను. కట్నంగా మీరు ఆరువేలు ఇచ్చినట్లు వాళ్ళు వ్రాసిన ఉత్తరాలు వుండటం ఎంతో మేలు చేసినై అన్నాడు."

"ఆ ! కాదు మరి. అవి కూడా లేకపోతే ఈ యాతనంతా వృధాయేగదా " రంగమ్మ మధ్యలో కల్పించుకుంది. "అది సరేరా, సాక్ష్యం, సాక్ష్యం అంటారు. మరి ఎవరు చెప్తారా అని. ఈ గ్రామంలో ఆ పేటలో పెళ్ళి జరిగిన సంగతి చాలామందికి తెలుసట. తెలిస్తే మాత్రం ధైర్యంగా ముందుకొస్తారా అని..."

"వస్తారా అని మనలో మనం విమానమేషాలు లెక్కించుకుంటూ కూర్చుంటే మన కాళ్ళ దగ్గర కెవరొస్తారే. వాళ్ళ చుట్టూ తిరగాలి. వచ్చేటట్లు చేయాలి. అవసరమైతే ఎంతయినా తినిపించటానికి వెనుకాడ కూడదు. మరి మన అక్కయ్యా వాళ్ళకూ, డబ్బుకూ లంకె. పైకేదో తయారంటమే కానీ— తీరా చెయ్యి వదలాల్సి వచ్చేసరికి బాధగా ఉంటుంది."

"అదేమిట్రా భుజంగం అట్లా మాట్లాడతావ్ ? దాని బ్రతుకింత బండలై పోయిం తర్వాత ఈ డబ్బంతా ఉండేం, పోయేం ? డబ్బు విషయం నీ కెందుకు? నువ్వెంత కావాలంటే అంత తెప్పించి ఇచ్చే పూచీ నాది. మీ బావకూడా పట్టుదల ఉందోయ్ ! కాబట్టే గదా ఎలాగైనా వాళ్ళ అంతు తేల్చాలని చూస్తున్నది" అన్నది రంగమ్మ.

భుజంగం చటుక్కున విషయం మారుస్తూ "ఇంకో సంగతి తెలుసా ? ఆ అమ్మాయి ఇప్పుడు గర్భవతిట. అదీగాక మరో వార్త యేమిటంటే ఆ అమ్మాయికి ఇతనితో పెళ్ళి కాక ముందు నుంచీ ఎవరితోనో సంబంధం ఉందని...."

"ఆఁ.... ఆఁ.... అవ్వ !" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ ఆశ్చర్యపోయారు ముగ్గురు ఆడ వాళ్ళూను.

"ఆఁ. ఈ విషయాలన్నీ మా శేఖరం ఫ్రెండో కతను చెప్పాడు. వాళ్ళది మధురాపురంటే. ఆ అమ్మాయి పుట్టింటివారి వూరూ అదేనట. ఆ పిల్ల తల్లి పాల్ఘాట్ వనితట. ఆవిడకూ పెద్ద గ్రంధం ఉందనీ, మొగుడామెచేతిలో కీలు బొమ్మ అనీ చెప్పాడు. ఈ పిల్ల బోధ వదిలించుకోటానికి వేరే మార్గం తోచక వీడికిచ్చి ముడి పెట్టించారుట. ముందుగానే అమ్మాయి పేర రెండెకరాలు రాయించుకొన్నారట కూడా. ఎటుపోయి యెటొచ్చినా వాళ్ళ జాగ్రత్త వాళ్ళు పడ్డారు."

"చాలా ఉందే కథ" అంది భాను.

భుజంగం ఆమె వైపు అదోలా చూసి, "అం అంతా మనలాగే మంచివాళ్ళయితే ఇంకేముంది. భూలోకం స్వర్గమై పోదూ" అన్నాడు.

"బాగా చెప్పావ్. కానీ, ప్రస్తుతం మన పనేమి టంటావ్ ?" సీతమ్మ ప్రశ్నించింది.

"మీరిక్కడ ఓ వారం రోజుల పాటు ఉం డండి. నేనా పెళ్లి చేయించిన శాస్త్రులను, ఇంకా ఒకరిద్దరు వ్యక్తుల్ని కలుసుకుని సాక్ష్యం సంగతి మాట్లాడతాను. కావలిస్తే ముందే వాళ్ళకి డబ్బిచ్చి వాళ్ళ దగ్గర్నుంచీ సాక్ష్యం చెప్పటానికి సిద్ధ మైనట్లు ఏ కాగితమో గట్రో తీసుకుని బిగిం చాలి. లేకపోతే తర్వాత ఇబ్బంది. అవతలి వాడేదో ఇంకొక వంద ఎక్కువ ఎర చూపెడితే అటు తిరిగే ప్రమాదం లేకపోలేదు గదా. అప్పుడు మనపని నట్టేట ముంపే. అందుకని కాస్త తీరిగ్గా పని చేసుక రావాలి. మీరు తొందర పడితే మాత్రం ఏం లాభం లేదు." అన్నాడు భుజంగం.

"తొందరేంవుందిగాని, ఇలాగని నాన్నకు వుత్తరం రాస్తే బాగుంటుంది" అంది భాను.

"అవున్నా తమ్ముడూ" అంది సీతమ్మ.

"రాయకుండా ఎలా. ఉన్న విషయాలన్నీ రాయవే భానూ." అన్నది రంగమ్మ.

"వూఁ" అంటూ లేచాడు భుజంగం.

*    *    *

సాయంత్రం ఐదు గంటలైంది.

డాబా మీద తన గదిలో పడుకున్న భుజంగం ఆలోచనలన్నీ భానుమీద కేంద్రీకృతమై పోయినై. భాను కథ విన్నవారంతా "అయ్యో పాపం" అని ఆమె స్థితికి జాలీ, సానుభూతీ చూపేవారే. తానూ అలాంటి జాలితోనే వాళ్ళ విషయంలో శ్రద్ధ తీసు కుని తిరుగుతున్నాడు. కాని పరిస్థితులు మాత్రం తమ కంత అనుకూలంగా లేవు. ఒకవేళ అనీ అను కూలంగా కలిసొచ్చి కేసు గెలిచినా ఒరిగేదేమిటి? — ఖర్చులతో సహా తామిచ్చిన కట్నం తమకు తిరిగి వస్తుంది అక్కయ్యా వాళ్ళకు.

కాని భాను జీవితం ?— ఆమె భవిష్యత్తు ?

భాను భవిష్యజ్జీవితాన్ని అలా వూహించుకుని ఆ ఆవేదనతోనే తాను మాట వరసకు అన్నాడు అక్కయ్య భానులతో "ఈ అవస్థలన్నింటి కంటే భానుకు మరో పెళ్లి చేస్తే బాగుంటుంద"ని.

తన మాట అగ్నిమీద గుగ్గిలమైంది అక్క య్యకు. తమ వంశాన్ని గురించీ, ఛాందసాచారాల్ని గురించీ ఏవేవో చెప్పింది. భాను మాత్రం అంతగా బెదర లేదు కానీ, "ఒకటిలా తగలబడింది గదా నా మొహానికి మళ్ళీ పెళ్ళి కూడా ఎందుకు, కృష్ణా రామా అనుకుంటూ కాలం వెళ్ళ బుచ్చుకుంటే సరి" అన్నది నిర్వేదంగా.

అవును. ఆమె భయంలో అర్థముంది. రాబోయే భర్త అన్ని విధాలా మంచివాడనే నమ్మక మేముంది ? పైగా అభం శుభం తెలియని పిల్లని అన్యాయంగా అనుమానించటం వంటిది జరిగితే?

భాను ఎంతో దురదృష్టవంతురాలనిపించింది భుజంగానికి. తల వేడెక్కి పోయింది. లేచి గది బయటి కొచ్చాడు. డాబా మీద అటూ, ఇటూ పచార్లు చేస్తున్న భుజంగం చూపులు ఆ ప్రదే శంలో నిలిచి పోయినై.

భాను పెరట్లో సన్నజాజి పూలు కోస్తూ క్రిందకు జారిన తీవలు పందిరికి అల్లుతున్నది.

ఆధారాన్ని వీడిన లత— అనిపించింది భుజం గానికి. ఆమె భవిష్యజ్జీవితమంతా ఏకాకిగా గడప వలసిందేనని, ఆమె అందమంతా అడవి కాచిన వెన్నెలై పోతుందనీ తలచేసరికి ఏదో ఆవేదన కలిగిందని మనస్సులో. హృదయం కలుక్కు మంది. ఆమె వైపు పరీక్షగా చూడసాగేడు. విరిసిన గులాబీ వంటి సోయగంతో, వయసు పొంగారే ఆమెను చూసిన కొద్దీ అతని హృద యంలో ఏవేవో భావాలు అల్లిబిల్లిగా అల్లుకో సాగాయి.

పూలు కోయటం పూర్తి చేసుకుని ఛెంగున లోపలికి పోయింది భాను. భుజంగం కూరుస్తున్న భావహారం పుటుక్కుమంది. గదిలోకి పోయి పడుకున్నాడు. ఏదో పుస్తకం తీశాడు. మనస్సు దానిమీద లగ్నం కాలేదు. మూసేశాడు. అతని మనస్సంతా అల్లకల్లోలంగా తయారైంది. పిచ్చెక్కుతుందేమోననే భయం కలిగింది. మళ్లీ బయటికొచ్చి డాబా మీద అటూ ఇటూ తిరగటం మొదలెట్టాడు. అలా ఎంతసేపు తిరిగాడో కానీ 'భోజనానికి రారా' అన్న అమ్మ పిలిచిన పిలుపుకు క్రిందకు దిగాడు.

*    *    *

విరహాతురుల శరీరాన్ని దహిస్తూ పున్నమి చంద్రుడు తన ప్రతాపాన్ని చూపుతున్నాడు. అతనికి సాయంగా వీస్తున్నాడు మలయానిలుడు.

భుజంగం ప్రక్కమీద అటు ఇటూ పొర్లాడు. ఉసురుసురుమంటూ విడిచే వూర్పులు నిట్టూర్పు లైనై. శరీరమంతా చెమటతో తడిసి పోయింది. అతని మనస్సులో భావతరంగాలు విజృంభిస్తున్నై. తన ఆలోచనలు తనకే భయం కలిగిస్తున్నై.

ఆ భయాన్ని పారద్రోలుతూ ఏదో మొండి ధైర్యం.

ఆ ధైర్యాన్ని ఇనుమడింప జేస్తూ ఏదో ఉద్వే గం.

ఆ ఉద్వేగాన్ని ద్విగుణీకృతం చేస్తూ వో మధు రానుభూతి.

ఆ మధురానుభూతిని ప్రేరేపింప చేసింది భాను అందం.

భుజంగం సన్నగా నవ్వుకుని ఉత్సాహంగా లేచాడు. అడుగు ముందుకు వేయబోయాడు కానీ,— కాలు కదలలేదు. 'అమ్మా అక్కయ్యల కంట పడితే ? !'

చలించి పోయాడు.

అంతలో ఆలోచన మెరపు తీగెలా మెరిసిం దాతని మేధస్సులో. భాను భయంతో ఇంట్లో పడుకుంది. అమ్మా అక్కయ్యలు గాలి కోసం ఆరు బయట పడుకున్నారు. ఇంత మంచి అవకాశం ఇక రాదు.

పొంగిన ఆనందంతో మెట్లు దిగి పెరటి వైపు కిటికీ దగ్గరకు పోయాడు. విరిసిన కుసుమంలా పడుకుని ఉంది భాను.

"భానూ...." అని నెమ్మదిగా పిలిచాడు.

అతని కంఠం వణికింది. భాను తత్తరపడి లేచింది. "ఏమిటి మావయ్యా" అంది.

భాను అమాయకత్వానికి లోలోపలే నవ్వు కుని "కూజాలో నీళ్ళయి పోయినై భానూ.... కాసిని మంచినీళ్ళు కావాలి." అన్నాడు.

భాను లేచి వచ్చి తలుపు తీసింది. భుజంగం మొండిగా లోపలికి వెళ్లేడు. అంతే. భాను నోట మళ్ళీ మాట రాలేదు. తెల్లవారేసరికి పెరట్లో దూరంగా ఓ మూల చచ్చి పడుంది భాను. ★



# రామ చరిత మానస్

తులసీదాసు



తెలుగు ముంగర శంకరరాజు

## 34

"ఓ భుశుండీ! నీవు ధీరవ్రతుండవు. నీకు వరదానము చేయుచున్నాను. శ్రీరామునియెడ స్థిర భక్తి నీకు సిద్ధించుగాక, నీవు కోరిన రూపము పొందుచుండెదవుగాక, నీ యిష్ట ప్రకారము మృత్యువు నిన్ను వరించుగాక, నీవు నివసించియుండు ఆశ్రమమునకు యోజన పరిధిలోపుల మాయా వ్యామోహములు చేరకుండుగాక, కాల—కర్మ గుణ—దోష—జనితములగు సుఖదుఃఖములకు అతీతుడవుగా నుండెదవుగాక, ఆ శ్రీరాముని కృపా కటాక్షము వలన ఈ ప్రపంచంలో నీకు దుర్లభమైన దేదియు నుండక పోవుగాక.—"

అని లోమశుడు అపూర్వమైన వరములు నాకు ప్రసాదించెను. ఆ సమయమున పైనుండి—"హే మునివర్యా! కాకభుశుండి నిక్కముగా నాకు పరమ భక్తుడు నీ వచనములు అతనియెడ నిశ్చయముగ ఫలించుగాక—" అని అశరీరవాణి పలికెను.

గరుత్మంతా! ఆ విధముగా లోమశుడు అపూర్వమగు వరసంపత్తి నాకనుగ్రహించెను. కొంతకాలమైన పిమ్మట నేను మహర్షి అనుమతి బడసి ఈ యాశ్రమమున వచ్చి చేరుకొంటిని. సుమారు ఇరువది కల్పములనుండి నే నీయాశ్రమములో నివసించుచున్నాను. నేనిచ్చట నిత్యము— నిరంతరము ఆ సీతానాధుని గుణ కీర్తన జేయుచుందును. హంసాది విహంగ సమాజము సమావేశమై నిరంతరము నా రామ సంకీర్తన శ్రద్ధాభక్తితో ఆలకించుచుండును.

అప్పుడప్పుడు —రామావతార సమయములందు మాత్రము— నేను అయోధ్యకు పోవుచుందును. అక్కడ శ్రీ సాకేతనాథుని బాల్యరూపమును దర్శించుకొని, తిరిగి ఇచ్చటికి వచ్చి సుఖవాసముచేయుచుండును.

ఖగోత్తమా ! ఇదీ రామకథ రహస్య వృత్తాంతము. నాకు కాకి శరీర మెట్లు సంప్రాప్తమయ్యెనో ఆ వైనము కూడ తెలియ జేసితిని. ఈ కాయముతో నేను రామభక్తిని సాధించితిని, ఈ శరీరముతో నేను స్వామి దివ్య స్వరూపమును దర్శించుకొన గలిగితిని, ఈ వాయస రూపముతో నున్నపుడే నాకు సకల తత్త్వ రహస్యములు బోధ పడియుండెను, అప్పుడే నాకు సగుణోపాసనపై ప్రగాఢ విశ్వాస మేర్పడెను. మునులకు దుర్లభమగు అనేక వరము లను పొందగలిగితిని. కాబట్టి విజ్ఞుడా! నేనీ వాయస రూపమును విసర్జింప లేకున్నాను, దీనిపై నా కత్యంత ప్రేమ గలదు.

గరుడా ! సకల విధ మోక్ష దాయకమగు భక్తి మార్గమును వదలిపెట్టి, జ్ఞాన మార్గమున బడి శ్రమించువారు పరమ మూర్ఖులు. అట్టి వారు తమ దొడ్డిలో నున్న కామధేనువును వదలుకొని జిల్లేడు చెట్టు పాలకై పరుగులెత్తె మందమతులు. పడవ లేకనే పారావారమును తరించుట దుర్లభము, అటులనే లోకములో భక్తి వినాభవ సాగరము దాట ప్రయత్నించుటయు కేవలము మూర్ఖత్వము.

## భుశుండి భక్తిప్రాశస్త్యమును గురించి బోధించుట

కాకభుశుండి ప్రవచించిన ఆత్మ కథ ఆసాంతముగ విని పక్షీంద్రుడు పరమ ప్రసన్నుడాయెను. తదనంతర మాతడు వినమ్ర భావముతో ఇట్లు పలికెను.

"ఓ భాగవతోత్తమా ! భుశుండీ ! రామాయణ కథా ప్రవచనము, మీ పూర్వ చరిత్ర ప్రసంగము శ్రవణానందకరముగ వినగల భాగ్యము సిద్ధించినందుకు నా జీవనము ధన్య మొందెను. నా మనస్సుకు శాంతి లభించెను. ఓ పుణ్యమూర్తీ ! ఇదే విధముగ నన్ను కరుణించి ఈ దీనునికి గల మరియొక సందేహమును కూడ నివారింప వేడుకొనుచున్నాను. స్వామీ ! జ్ఞాన మార్గము కష్టసాధ్యమైనది, అయిననూ దానికి సాటి రాగల మార్గ మింకొకటి లేదని వేదపురాణము లందు వర్ణింప బడినది. లోమశ మహర్షి సైతం దానినే సమర్థించి యుండినట్లు సెలవిచ్చితిరి. కాని మీరు మాత్రము భక్తి కంటె ఉత్తమ సాధన మరొకటి లేదని ఘంటా పథముగ చెప్పుచుంటిరి. కాబట్టి ఈ భక్తి— జ్ఞానములకు గల భేదము వివరించి, ఏది యెందులకు శ్రేష్ఠమైనదో వివరించ గోరుచున్నాను." అని విన్నవించెను.

గరుత్మంతుని ప్రసంగ వైఖరి కెంతయు సంతసించి, భుశుండి అత్యాదర భావముతో అతనికిట్లు ఉపదేశించెను.

"భగతిహిః జ్ఞానహిః నహిః—
కచు భేదా,
ఉభయ హారహిః భవ సంభవ—
ఖేదా."

"ఓ వైనతేయా ! భక్తికిని జ్ఞానమునకును మధ్య పెద్దగా భేద మేదియునూ లేదు. రెండును భవ సంబంధమైన దుఃఖములను నివారింప గలిగినవే. లోమశుని అభిప్రాయానుసారము విచారించిననూ ఈ రెండింటికిని పెద్ద వ్యత్యాసము కానరాదు. ప్రసంగ వశాత్తు ఈ సందర్భములో నీకు కొన్ని సూక్ష్మ విషయములను విశదీకరించుచున్నాను. సావధానుడవై వినవలసినది." అని నుడివి భుశుండి ముందు కిట్లు చెప్పసాగెను.

"మిత్రుడా గరుత్మంతా ! జ్ఞానము— వైరాగ్యము— యోగము— విజ్ఞానము ఈ నాల్గును పురుషులతో సమానము. పురుషులు బల ప్రతాపము కలవారు. మాయ మాత్రము స్త్రీ రూపముతో నుండును. జ్ఞాన సంపన్నులగు మునీంద్రుల మనస్సులు మృగనయనలగు కాంతల చంద్రవదనములు కంట పడగనే విచలితములగుచుండును. మాయ, భక్తి ఈ రెండును స్త్రీ వర్గమునకు చెందినవే. మాయ నాట్యకత్తె వంటిది. కానీ భక్తి భగవంతునికి అత్యంత ప్రియమైనదగుటచే మాయ దాని దరిదాపులకు కూడ రాక భయముచే దూరముగా తొలగి పోవును. కాబట్టి భక్తి మాయకు లొంగదు.

ఎవని హృదయము రామభక్తితో నిండుకొని యుండునో వానిని జూచి మాయ భయముతో దూరముగా తొలగి పోవును. రామ భక్తునిపై మాయ ప్రభావము పని చేయ జాలదు. అందుచే మునీశ్వరులు సైతం భక్తిని సుకరము— సుఖదాయకమైనదిగా భావించి వరించుచున్నారు. అదియును గాక ఒక స్త్రీ ఇంకొక స్త్రీని వరించుట కిష్టగించ నేరదు. ఆ కారణముచే భక్తి పరిసరములకే మాయ రానొల్లదు. కాబట్టి భక్తులు మాయా పీడితుడు కాజాలడు.

## జ్ఞానమార్గము బహు దుస్తరమైనది

"పక్షీంద్రా ! భక్తి మార్గ మెట్లు సుఖకరమైనదో విశదీకరించితిని. ఇక జ్ఞాన మార్గ మవలంబించుట వలన కలిగెడి కష్ట సుఖములను కూడ వివరించుచున్నాను. ఆకర్ణింతువు గాక.

భక్తి పథమున కంటే జ్ఞాన మార్గమున పయనించుట కష్టములతో కూడిన పని. జీవుడు ఈశ్వరాంశ సంభూతుడు. అందుచే అతడు నాశ రహితుడు, పాపరహితుడు, సుఖశీలుడై యున్నాడు. కాని ఈ జీవుడు సదా మాయాసుడై దాని

బంధములలో చిక్కుకొను చుండును. మాయాంధకారములోబడి పోవుటం జేసి వివేకము కోల్పోయి ముక్తి మార్గమును కనగొన జాలక కొట్టు మిట్టాడు చుండును. అది ఎట్లన— కోతి చిన్న మూతి గల ఒక గాజు సీసాలోనికి మొదట తన చేయి దూర్చును. ఆ సీసాలో నున్న పదార్థమును పిడికిట నింపుకొని పిమ్మట తన హస్తమును వెలుపలికి తీసుకొనుటకు అది ప్రయత్నించును. కానీ పిడికిలితో నున్న చేయి వెలుపలికి యెట్లు రాగలదు ! సూక్ష్మజ్ఞానము లేని కోతి తన పిడికిలి విప్పదు, చేయి వెలుపలికి రాదు. దీనినే స్వయంకృత బంధన మందురు. అటులనే జీవుడు కూడ వివేకము గోల్పోయి మాయ వలలో బడి బంధ విముక్తుడు కాలేక గింజుకొను చుండును. ఆ బంధనము అంతకంతకు బిగుసుకునే ఉండును. భగవంతుడు దయామయుడు. ఆ దేవ దేవుని కృపా కటాక్షము కలిగినపుడే జీవుడు మాయా సంబంధమైన సంసార బంధనముల నుండి ముక్తుడగుచున్నాడు. గరుడా ! అట్లు గాఢ తపస్సులో బడి సతమత మగుచున్న జీవుడు జ్ఞాన మార్గమున పయనించి ప్రకాశవంతుడై ముక్తి నొంద గలడు. ఇందుకు జ్ఞాన జ్యోతిని వెలిగించ వలయును. ఆ వెలుగును ఎట్లు సాధించవలెనో చెప్పుచున్నాను — శ్రద్ధతో విందువు గాక.

వినతాసుతా ! శ్రద్ధయే ఒక ఆవు. ఆ గోవు భగవత్కృప వలన గాని లభింప బడదు. ఆ యావు సంయమ నియమ నిష్ఠాదులనే పచ్చికమేయును. దానిని నివృత్తి యనెడి త్రాటితో బంధించి నిర్మలాంతః కరణమను గొల్లవాడు విశ్వాసమనెడు పాత్రలోనికి పరమ ధర్మమనెడు పాలను పితుకును. తదుపరి నిష్కామాగ్నిచే ఆ పాలు బాగుగా కాచబడును. ఆ పాలు సంతోష మను గాలి వలన చల్లార్చబడిన పిమ్మట దానిలో ధృతి యనెడి తోడు పెట్టబడును. అనంతరము చింతన మను కవ్వముతో మధించగా దానిలో వైరాగ్యమను నవనీతము ఉద్భవించును. ఆ నవనీతమును శుభాశుభ కర్మలను ఇంధనములతో కరగి బెట్టగా అప్పుడు జ్ఞాన ఘృతము యేర్పడును. ఆ ఘృతమును చిత్తమను ప్రమిదలో బోసి, సత్త్వ రజస్తమో గుణములను వత్తులుంచి వెలిగించ బడును. అట్లు వెలిగించ బడిన ద్వీప జ్వాలలందు బడి కామక్రోధ మదమోహాది శలభసముదాయము భస్మమై పోవును. గరుడా ! ఆజ్ఞానదీపమునుండి వెలువడు సోహం అనబడు జ్వాలల వలన అవిద్యా సంబంధమైన భ్రమాంధ కారము పటాపంచలై ప్రకాశమేర్పడును. అప్పుడు బుద్ధి ఆ వెలుతురులో కూర్చుని మాయా గ్రంథులను విడదీసుకొని ముక్తి బొందుటకు ప్రయత్నించును.

గరుడా ! అప్పటికిని మాయ బుద్ధిని భ్రమింప చేయుటకు మరెన్నియో ప్రయత్నములు చేయును. అది సమయము కనిపెట్టి తన చెరుగుతో జ్ఞాన జ్యోతిని ఆర్పి వేయుటకు పొంచియుండును. మాయ బుద్ధి— సిద్ధులను ప్రేరేపించును. వారు స్వర్గాది సుఖ భోగములు చూపెట్టి బుద్ధిని పెడదారి బట్టించుటకు పూనుకొనెదరు. బుద్ధి జాగ్రత్తగా నుండి మాయ ఆటలకు లొంగక తప్పించుకొని తిరగవలసి యుండును.

అంతటితో విఘ్నములు తొలగి మార్గము నిరాటంకము కాజాలదు. ఇంద్రియములకు అధిష్ఠాతలైన దేవతలు విజృంభించెదరు. వారు రోమరోమ మందు తిష్ఠవేసి యున్నారు. విషయ వాసనల గాలి తగిలినంతనే వారు ద్వారములు తెరచి ఆ విషయ వాయువును లోనికి ఆహ్వానింతురు. ఆ వాయు తరంగములు లోన ప్రవేశించగనే జ్ఞాన జ్యోతి ఆరిపోగలదు, విషయ వాసనల గాలికి బుద్ధి విచలిత మగుట సంభవించును. ఇంద్రియములకు అధిష్ఠాతలగు దేవతలకు జ్ఞానము యొక్క వెలుగు నచ్చదు. వారు సదా భోగా సక్తులైన వాంఛా పరాయణులు. గరుడా ! అట్టి విషయ వాసనలకు సంబంధించిన వాయువుచే ఆర్పి వేయబడు జ్ఞానదీపికను పునః ఎవరు వెలిగించగలరు ? మరలా జీవుడు యథా పూర్వము సంసార సాగరమున బడి జనన మరణాదులందు మునిగి తేలుచుండును.

పక్షీంద్రా ! జ్ఞాన ప్రధానమైన మార్గము బోధించుట కష్టము, గ్రహించుట కష్టము, సాధించుట కష్టము. ఒక వేళ అది ఘుణాక్షర న్యాయంగా తాత్కాలికముగా సిద్ధించినను ఉత్తరోత్తర అనేక ఆటంకములు యేర్పడుతూనే యుండును. జ్ఞాన తత్త్వము అసిధారా వ్రతము. ఏ మాత్రము అసావధానముగా నున్నను పతనము తథ్యము. ఒక వేళ ఆ పథమున ప్రగతి సాధించిన, అట్టి వానికి మాత్రము ముక్తి లభించుట ముమ్మాటికి నిజము.

## భక్తి సర్వోత్కృష్టమైనది

"గరుత్మంతా ! మోక్ష ప్రాప్తి కడు దుర్లభమైనది. అయిననూ అది రామ భక్తునికి దానంతటదే సిద్ధించుచున్నది. అందుచే సూక్ష్మజ్ఞులగు సాధకులు ముక్తి కంటే భక్తినే యెక్కువగా అపేక్షించుచుందురు. ఎవ్విధముగా మనము భుజించు ఆహార పదార్థములను జఠరాగ్ని జీర్ణము చేయుచున్నదో అవ్విధముగా మన దుఃఖ పాపములను భక్తి నిర్మూలించుచున్నది. కాబట్టి ఇటువంటి సులభ సాధ్యమగు భక్తి మార్గము ఎవరికి సుఖ దాయకముగా నుండక పోవును! ఓ గరుడా ! కనుక నీ వా రఘూత్తముని చరణ కమలములను సేవకసేవ్య భావముతో సదా సేవించి సార్థక జన్ముడవగుమని నేను దీవించుచున్నాను."

"సౌమ్యా ! రామ భక్తి యొక్క ప్రాభవమును గురించి మరి కొంత వివరించుచున్నాను ఆకర్ణింతువుగాక" అని పలికి కాకభుశుండి మరలా ఇట్లు ప్రసంగించెను:

"రామభక్తి చింతామణి వంటిది. ఆ దివ్యమణి ఎవని హృదయాంతరాళ మందు ప్రకాశించుచుండునో వానిని అవిద్యా సంబంధమైన మోహాంధకారము సమీపించ నేరదు. ఆ రామ భక్తునికి విషము అమృతముగాను, శత్రువులు మిత్రులుగాను మారుచుందురు. ఆధివ్యాధులు దుఃఖ క్లేశములు నుండి సదా అతడు ముక్తుడగును. రాముని కంటే రామ భక్తుని నేను పరింత ప్రేమతో చూచెదను. వారి సంపర్క స్నేహము వలననే రామ భక్తి మనకు లభ్యమగుచున్నది. ఎటుల సముద్రము నీరు మేఘముల ద్వారా ప్రాప్తించుచుండునో అటులనే భక్తుల ద్వారా రామభక్తి ప్రజలకు ప్రసారమగు చుండును. ఆ శ్రీపతి చందన వృక్షము వంటి వాడనుకొనిన యెడల రామభక్తి కలిగిన సాధువులు గాలులవంటి వారు. గాలి లేని యెడల చందన గంధము ఇతరులకు ప్రాప్తించుట దుస్తరమగును. సజ్జన— సాధు సాంగత్యము వలన రామభక్తి సులభముగా లభించుటకు అవకాశ మేర్పడును. గరుత్మంతా ! సకల విధ సాధనముల కంటే భక్తి సాధనము సుఖప్రదము, సర్వోత్తమమైన మార్గము— అని విశ్వసించుము."

ఇట్లనేక రీతుల భక్తి ప్రాశస్త్యమును గురించి కాకభుశుండి గరుత్మంతునికి ప్రబోధించెను. పిమ్మట పక్షీంద్రుడు పరమ వినీత భావముతో —శరీర ధర్మమును— సాధువు, అసాధువుల గుణ స్వభావములను గురించి— అజ్ఞాన రోగము వలన కలిగెడి దుష్పరిణామములను గురించి బోధించవలసినదని అభ్యర్థించెను. భుశుండి పరమాదర భావముతో అతని ప్రశ్నలకు సముచిత రీతి సోదాహరణముగా వివరించిన అనంతరము ఇట్లు పలికెను:

"వైనతేయా? సర్వ మోక్షములకు మూలము, సకల సుఖములకు సాధకము అగు రామభక్తికి సాటి రాగల దివ్య తత్త్వము మరొకటి లేదు. అట్టి పరమ భక్తిని సాధించుకొన్న ప్రాణికి ఈ లోకములో దుర్లభమైన దేదియు ఉండబోదు. భక్తి శూన్యమైన వానికి సుఖప్రాప్తి శూన్యము. తాబేలు వీపు మీద వెంట్రుకలు మొలచినను, వంధ్యా పుత్రుడు ఒకనిని హత్య చేసినను, గగనమున కుసుమములుదయించినను, ఎండ మావులందు నీరు లభించినను, చీకటి సూర్యరస్మిని జయించినను, జలము తరచి నవనీతము తీయ బడినను, సైకతము నుండి తైలము గ్రహింప బడినను, మంచులో అగ్ని పుట్టినను— సంభవము కావచ్చును, కానీ రామునికి విముఖుడైన వానికి మాత్రము సుఖ మోక్షములు సిద్ధించుట అసంభవమని విశ్వసింపుము. నే జెప్పినది సర్వమత సిద్ధాంతము సకల శాస్త్రముల సారాంశమని గ్రహించ వలయును."

ఆ దాశరథి దయా దృష్టి ప్రసరించిన యెడల మశకము బ్రహ్మ కాగలదు, అది లేని యెడల బ్రహ్మ మశకమున కంటే హీన స్థితిని పొంద గలడు. గరుడా ! నీవు నిశ్చింతుడవై ఆ రఘుపతిని సేవించి సుఖింపుము.

"వినిశ్చితం వదామితే
న అన్యథా వచాంసి మే
హరిం నరా భజంతియే
అతి దుస్తరం తరంతి తే."

"పూజ్యుడా ! నా మాటలు అసత్యములు గానేరవు. నేను యథార్థము పలుకుచున్నాను. ఎవరు శ్రీ హరిని భక్తితో భజింతురో వారే దుస్తరమగు ఈ సంసార సాగరమును తరించగలరు."

అని పలికి కాకభుశుండి సుంత మౌనము వహించి పునః పక్షీంద్రుని అవలోకించి ఇట్లు ప్రసంగించెను— "గరుడజీ ! శుకుడు సనకాదులు మహేశ్వరుడాది మహనీయులు నిత్యము సంస్మరించుచుండు, నిరుపమానమగు రామ చరిత్ర నా బుద్ధికి తోచిన మేరకు ఇంత వరకు నీకు వివ

రించి చెప్పగలిగితిని." గరుడా ! నీవు విజ్ఞాన స్వరూపుడవు. మును నీవు నాతో ముచ్చటించిన ప్రకారము అజ్ఞాన మోహాదులు నిన్ను సమీపించ జాలవు. అజ్ఞాన వశముచే గాక— నాపై నీకున్న ప్రేమాదర భావము వలన రామకథ బోధించ మని నన్ను కోరియుంటివే గాని, అన్య భావముతో కాదు. నీ బోటి సత్పురుషుని సాంగత్య పుణ్యము లభ్యమగుటకు ఇదొక కారణము మాత్రమే. గరుడా ! నేను ఒక నీచకుల సంజాతుడను, అప విత్రుడను, అన్ని విధముల హీనమైన వాడను. దయామయుడగు రాముడు పుణ్యశీలుడవగు నిన్ను నా దగ్గరకు పంపి, తద్వారా నాకు లోక ప్రసిద్ధి కలుగ జేసెను. గరుత్మంతా ! నేను ధన్యుడను. నా జీవితము ధన్యమయ్యెను. ఆహా ! ఆ దశరథ నందనుని దివ్య చరిత్ర మెంత పావనమైనది ! అపారమైనది ! వేదాంతత మైనది ! ఆ స్వామి హృదయము దయార్ద్రమైనది, ఆ ప్రభువు మనస్సు అతి కోమలమైనది. వైనతేయా! ఆ రామదేవుడు శాశ్వతుడు, అతని నామము భవ రోగములకు పరమౌషధము. పక్షీంద్రా! ఆ కృపామూర్తి! ఆ రామప్రభువు! ఆ సీతానాధుడు! నిన్నూ—నన్నూ సదా సర్వదా కటాక్షించుచుండు గాక!." అని ప్రసంగించి కాకభుశుండి రామ సంకీర్త నముచేయుచూ తన్మయుడై పోయెను.

మహాభక్తుడు కాకభుశుండి ప్రవచించిన పరమ పవిత్రమగు రామ కథను సాంతముగ, ఆలకించి గరుత్మంతుడు అపార ఆనంద సాగరమున నోలలాడెను. అతడు ప్రహృష్టాంతరంగుడై అంజలి ఘటించి అతి వినీత భావముతో భుశుండిని ఇట్లు ప్రస్తుతించెను.

"పరమ తత్త్వజ్ఞుడవగు ఓ భాగవతోత్తమా! భుశుండీ ! భక్తిరస పూరితమగు శ్రీరామ చరిత మానసామృతమును గ్రోలి నేటికి నా జన్మ తరించెను. మాయా జనితములగు నా దుఃఖశోకములు అంతరించి మనస్సు నిర్మలమై, హృదయము శాంతించెను. మీ ప్రబోధానంతరం నా సంశయములన్నియు నిర్మూలింపబడెను. ఆ సీతానాధుని శ్రీ చరణములపై నాకు విశుద్ధ భక్తి ఏర్పడెను. ఓ భక్తాగ్రేసరా ! మీరొనర్చిన మహోపకారమునకు నేనేమి ప్రత్యుప కారము చేయగలవాడను! ఓ పుణ్యాత్మా! మీకృపాప రతకు ఇదియే నాభక్త్యంజలి, అనుగ్రహించ ప్రార్థన" అని గరుత్మంతుడు భుశుండి పాదములకు పలు మార్లు ప్రణమిల్లి మరల ఇట్లు ప్రసంగించెను.

"ఓ పుణ్యశ్లోకుడా! ఆ రఘుప్రవరుని సంపూర్ణ కటాక్షము సిద్ధింప జేసుకున్న మహాభాగులు మీరు. స్వామీ! పుణ్య పురుషులు, భూమి, భూధరములు, నదులు, వృక్షములు కేవలము పరోపకారార్థం సృజింపబడినవి. దేవా! మీ సందర్శన భాగ్యము వలన, మీ సాంగత్య ఫలమువలన నా సందేహములు హరింపబడి నాజన్మ తరించెను. నేను ధన్యుడనైతిని. సాధూ! నన్ను సదా మీ చరణదాసునిగా భావించి దీవించుడు."

అట్లు గరుత్మంతుడు అనేకవిధముల భుశుండిని ప్రస్తుతించి పునఃవిధముల ఆ దివ్యజీవుని పాదము లకు సాష్టాంగపడి, అతని శుభాశీస్సులు గ్రహించెను. పిమ్మట అతడు భుశుండి ఆశ్రమము వీడ్కొని జగన్నాధుడగు శ్రీనివాసుని సంస్తుతించు కొనుచు వైకుంఠమునకు గమనము చేసెను.

## శివ బోధ

"ఓ పార్వతీ! భుశుండి ప్రవచించినట్లు సాధు సమాగము సర్వోత్కృష్టమైనది. అట్టి యదృష్టము భగవత్కృపవలనగాని లభించదు. భుశుండి గరుత్మంతుల సమాగమము శుభదాయకము, లోక కల్యాణకరమై భాసించెను. గిరిజా! భుశుండి ప్రోక్త మగు ఈ పావన గాథను నీకు సంపూర్ణముగా వినిపించ గలిగితిని. పరమ పవిత్రకరమగు ఈ రామచరిత్ర శ్రద్ధాభక్తితో ఆలకించినవారికి సంసార బంధముల నుండి విముక్తి ప్రాప్తించి, భక్తికల్పద్రుముడగు రామభగవానుని చరణ కమలములపై ప్రగాఢప్రేమ

ఒనరించును. ధర్మము — దానము — జపము — తపము— వ్రతము— యాగము— ఉపవాసము ఇత్యాది నానావిధ సాధనములకు హరిభక్తి సంప్రాప్త మగుటయే లక్ష్యసిద్ధి. ఈ రామచరిత మానసము పారాయణజేయు పురుషునికి మునులకు సైతం దుర్లభమగు ఆ హరిభక్తి సునాయాసముగా లభిం చుచున్నది.

ఎవని చిత్తము సదా ఈశ్వరాయత్తమై ఉండునో వాడే సర్వజ్ఞుడు. వాడే పండితుడు. వాడే ధర్మ పరా యణుడు, వాడే మహాకవి, వాడే వేదజ్ఞుడుగా భావిం చుము. అట్టి మహాభాగుడు అవతరించిన వంశమే ఉత్తమమైన వంశము.

భవానీ! ప్రప్రథమమున నేనీరామ కథను గోప్య ముగా ఉంచి ఉంటిని. కానీ, నీ నిశ్చలభక్తికి, నీ ప్రేమాశక్తికి ముగ్ధుడనైన పిమ్మట నీకీ పవిత్ర చరిత్ర పూర్ణముగా తెలియజేసితిని. హఠశీలురకు, శ్రద్ధలేని వారికి, కామాతురులకు, బ్రాహ్మణ ద్వేషు లగు భూవిభాశులకు, ఈ శుభ చరిత్ర వినిపించ గూడదని మనసునందుంచుకొనుము. సంత్సాంగ త్యము నభిలషించు సజ్జనులు, గురుసేవా తత్పరులు, నీతి ప్రవర్తకులు, భక్తిని సదా అనుష్ఠించు భక్తులు ఈ సచ్చరిత్ర వినుటకు యోగ్యులై యున్నారు.

భవానీ! కలియుగ పాపములను హరించు రాముని దివ్యచరిత్ర భవరోగములను నివారించుటకు సంజీవి ఔషధము. రామచరితమానసమందలి సప్తకాండలు భక్తిమార్గమునకు సప్త సోపానములు. దైవ కృపకు పాత్రులైన పుణ్యాత్ములీ మార్గమున పయ నించి సుఖించగలరు. ఈ రామచరిత్రమానసమును పఠించువారు— ఆకర్ణించువారు— అనుమోదించు వారు— భవసాగరమును గోష్పదమువలె అవలీలగా తరించగలరు'' అని శివుడు పలికెను.

శుభకరము సుఖదాయకమునగు శ్రీరామచరిత్ర మును సాంతముగ నాలకించి — జగజ్జనని పార్వతి —''హే పరమేశ్వరా! ఇప్పటికి నా మనఃక్లేశము నివారింపబడి, నాసందేహము లంతరించెను. తమ అను గ్రహమువలన అవతార పురుషుడగు ఆ సీతానాధునిపై నాకు నిశ్చలము, అనంతమైన భక్తి, భక్తి భావములు ఏర్పడెను. నేను కృతకృత్యురాలనైతిని—'' అని పలికెను.

ఓ భరద్వాజా! పార్వతి పరమేశ్వరులయొక్క ఈ రామకథా ప్రసంగము శుభదాయకము. మంగళ ప్రదమైనది. దీనిని శ్రద్ధతో వినుటవలన మాన వులకు భయదోష విషాదములు నివారింపబడి పరమా నందము ప్రాప్తించును. జనరంజనకరమగు ఈ రామ గాధ భక్తులకు మిక్కిలి మోదకరమైనది.'' అని యాజ్ఞవల్క్య మహర్షి భరద్వాజునికి చెప్పి ప్రసంగము ముగించెను.

## ప రి స మా ప్త ము

''యోగ యాగ జపతప వ్రతాదులు నిర్వహిం చుటకు సాధ్యముకాని యీ కలికాలములో రామ నామమునే స్మరించి, రామనామమునే కీర్తించి, రామనామమునే ధ్యానించిన మానవాళికి సులభ ముగా ముక్తి లభించగలదు. పతితపావనుడగు సీతాపతిని నిర్మలాంతంకరణతో సేవించి తరించని వాడెవ డున్నాడు! ఓ పతితపావనా! దశరథరామా! నీక్కు నేను చేయెత్తి నమస్కరించుచున్నాను.'' గోస్వామి తులసీదాసు రఘు ప్రవరుని పాదాబ్జములకు ప్రణ మిల్లి ఇట్లు ప్రవచించెను.

''ఈ రఘువంశ భూషణుని శుభగాథ ఇతరులకు చెప్పినవారు, శ్రద్ధతో విన్నవారు, భక్తితో గానము చేసినవారు ఈ కలిదోషములనుండి ముక్తులై ఆ రఘూత్తముని దివ్య సన్నిధానము చేరుకొని సుఖించ గలరు.''

''శ్రీ జానకీరమణుడు దివ్యసుందరుడు, కృపాసాగర మూర్తి, సర్వజ్ఞుడు, దీనజనోద్ధారకుడు, మోక్ష దాత, భక్తప్రియుడు, నిర్హేతుకజాయమాన కటా క్షముగల దయాస్వరూపుడు, అట్టి రామమూర్తి కృపాదృష్టి ప్రసరించుటచే నాబోటివాడు సకల శాస్త్రములు తెలుకొనగలిగెను.''

''ఓ రఘూత్తమా! నేను దీనాతిదీనుడను. నీవు దీనజనోద్ధారకుడవు. భగవాన్! నన్ని భవబంధముల నుండి ఉద్ధరించి ముక్తిని ప్రసాదింపుము. కామాతు రునికి కాంతపైననూ, లోభికి కనకముపైనన్న తీరని మోహముండు విధమున, ఓ రామచంద్రా! నీ పాదాబ్జములపై నాకు నిరంతరము భక్తి ప్రేమ లుండుగాక!—'' అని కావ్యాంతమున లవిధేశుని కవి అర్థించెను.

దుర్గ్రాహ్యమగు ఏ రామాయణమును పూర్వము పరమశివుడు రచించియుండెనో, ఏ రామాయణ మును భక్తితో పఠించుటవలన శ్రీరాముని చరణ కమలములయెడ స్థిరభక్తి సిద్ధించుచున్నదో ఆ రామచరితమానసమును గోస్వామి తులసీదాసు తన అంతఃశుద్ధికై— హిందీభాషలో రచించెను.

''పుణ్యం పాపహరం సదాశివ కరం
విజ్ఞాన భక్తిప్రదం,
మాయామోహ మలాపహం సువి
మలం ప్రేమాంబు పూరం శుభం
శ్రీమద్రామ చరితమానస మిదం
భక్త్యావగాహన్తియే,
తే సంసార పతంగ ఘోర కిర
ణర్దహ్యంతి నో మానవాః
ఇతి శ్రీరామచరితమానసే
సకల కలి కలుష విధ్వంసనే
అవిరల హరిభక్తి సంపాదనో
నామ సప్తమః సోపానః
సమాప్తః

శ్రీ గోస్వామి తులసీదాస కృత రామచరిత మాన సము సంపూర్ణము.

[వచ్చేవారంనుంచి లవకుశ కాండ ప్రారంభం]



ఈ టానిక్కు ...నా బిల్లు చూడడానికి ముందు, ఓ చెంచాడూ, తర్వాత ఓ రెండు చెంచాలు పుచ్చుకోవాలి!...



# బద్ధకస్తుల పురాణం

ఎన్నో రోజుల కిందటిమాట.

అప్పటి కింకా కొలంబి యాలో కోతు ల్లేవు. చెట్లనిండా, పళ్లూ, కాయలే. జనం బాగా బద్ధకం మరిగారు. ఎప్పుడు చూసినా తిని నిద్రపోయేవాళ్లు. ఇల్లూ వాకిలీ శుభ్రంగా ఉంచేవారు కాదు. ఎక్కడ చూసినా పళ్లతొక్కలూ అవీ పడిఉండేవి. ఇలా కాలం గడిచి పోయింది. మొదట్లో బాగానే ఉన్నా, క్రమంగా పళ్లతొక్కల వాసనకి ఈగలు, పురుగులూ ముసురుకున్నాయి. ఈగలూ దోమలే కాక పెద్దపెద్ద కందిరీగలు కూడా తయారయ్యాయి.

వీటిని తోలలేక విసిగిపోయారు జనం. ఏం చెయ్యాలో తోచలేదు వాళ్లకి.

ఒకరోజు మధ్యాహ్నం ఊళ్లోకి ఒక ముసలివాడు వచ్చాడు. బట్ట లన్నీ మాసి, చిరిగిపోయున్నాయి. జుట్టంతా చిందరవందరగా ఉంది. అయితే ముఖం మాత్రం ఎప్పుడూ నవ్వటానికి సిద్ధంగా ఉన్నట్లుండేది. అతను వచ్చే సమయానికి అందరూ భోజనాలు చేసి పడుకుని ఉన్నారు. మెలకువ వచ్చినవారు సయితం అతని సంగతి పట్టించుకోలేదు. ముసలి వాడేమో కొంతసేపు ఇటూ అటూ తిరిగి తర్వాత కొరికి పారేసిన పళ్లన్నీ ఏరి అంతకుముందే అల్లిన ఒక బుట్టలో వేశాడు. అప్పటికి కొందరిలో ఇదంతా ఏమిటో

# బాలసాహితి: దేశదేశాల జానపద కథలు-2

తెలుసుకోవాలన్న కోరిక కొద్దిగా మెదిలింది. కాని బద్ధకం ఎక్కువయిపోయి మళ్ళీ కునుకు తీశారు.

వృద్ధుడు రాత్రంతా పని చేశాడు. అయినా ఏంలాభం? అక్కడున్న చెత్తలో కొంత మాత్రమే తొలగించగలిగాడు. తెల్లవారింది. ఊరి తలవరి 'తెరా'కి ఆశ్చర్యం వేసింది. 'ముక్కూ, మొహం ఎరుగనివాళ్లకి ఇంత సేవ చేస్తున్నాడేమిటీ ముసిలివాడు?' అనుకున్నాడు. అతన్ని సమీపించి. "నీ పేరేమిటి? ఎక్కడ్నుంచి వచ్చావు? నీకేంకావాలి?" అని అడిగాడు.

"నాకు పనికావాలి," అని జవాబు చెప్పాడు వృద్ధుడు. "మీకేమయినా పనుంటే చెప్పండి, చేసిపెడ్తాను."

"నీ వృత్తేమిటి?"

"ఫలానా అనిలేదు. ఏదయినా సరే చేసిపెడ్తాను!" అన్నాడు ముసలివాడు. అన్నతర్వాత సరదాగా ఈల వేసుకుంటూ తను శుభ్రం చేసినచోటికి వెళ్ళి చిన్న చిన్న కొయ్యముక్కల్ని చిన్నచిన్న బొమ్మలుగా చెక్కటం మొదలు పెట్టాడు. బొమ్మలు మనుష్యుల్లాగే ఉన్నప్పటికీ ఒక్కొక్కదానికీ చిన్న తోకలాంటి పిడిఒకటి ఏర్పరచాడు. ఊళ్లో ఉన్న ప్రతివ్యక్తికీ ఇరవయి బొమ్మలు చెక్కాడు, మొత్తంమీద.

"ఈ బొమ్మలేమిటి? ఎందుకు చేశావు?" అని అడిగారు అక్కడ మూగిన జనమంతా. వృద్ధుడు జవాబు చెప్పకుండా బొమ్మలన్నిటినీ ఒక పెద్దవరసగా అమర్చి వాటి ముందు నుంచున్నాడు. కొన్ని క్షణాలు వాటిని అలాగే చూసి చివరికి ఏవో మంత్రాలు చెప్పాడు.

అంతే! బొమ్మలన్నీ ప్రాణం వచ్చి మనిషికి ఇరవయిచొప్పున మూగాయి, పనేదయినా చెప్పమన్నట్లు ఊగుతూ.

"మీకేమో పని చెయ్యటం ఇష్టంలేదుకదా! అందుకే వాటిని తయారుచేశాను. ఒక్కొక్క బొమ్మకీ ఒకే ఒక పనిచెప్పండి, చేస్తూ ఉంటుంది," అన్నాడు ముసిలివాడు. ఒక్కొక్కరూ ఒక్కొక్క పని చెప్పారు.

"ఆర్మడిల్లో వేటగాడా, రా! రొట్టెచేసే బొమ్మా, రా! కథలు చెప్పే వాడా రా! పందులు కాసే వాడా రా!......" అంటూ వాటిని పనులకి పురమాయించాడు ఆ వృద్ధుడు. అవన్నీ హడావుడిగా ఇటూ అటూ పరిగెత్తాయి. పనులు మొదలెట్టాయి. అంతే, ఇక మనుషులకి వళ్లువంచే అవసరం అసలే పోయింది! ఊరికే విశ్రాంతి తీసుకుంటూ ఉండిపోయారు.

ఇలా ఉండగా ఊరి చిన్నపిల్లలంతా వచ్చి ముసిలివాడితో తమ బాధలు చెప్పుకున్నారు. ఆడుకోవటానికే తీరిక లేకుండా ఉందన్నారు.

సరే, ముసిలి శిల్పి ఇంకా కొన్ని బొమ్మలు తయారు చేశాడు. విసనకర్రలు చేసే ఆకులు ఏరేవి, చీకటిలో పోయినవస్తువుల కోసం వెతికేవి, విదూషకులవంటివి, కొప్పడని ఉపాధ్యాయులు, ఒకటేమిటి ఎన్నో రకాలు!

ఇలా కొంతకాలం గడించింది. బొమ్మలు చేసే పనులు రోజురోజుకీ ఎక్కువయిపోయాయి; ఇంకా కొన్ని, మరింకా కొన్ని బొమ్మలు చెక్కాడు వృద్ధుడు. వాటిసంఖ్య విపరీతంగా పెరిగిపోయి, ఎక్కడ చూసినా అవే కనిపించేవి. ఊరంతా, ఇళ్లన్నీ ముసురుకుపోయాయి! వీటి సందడిని అదుపులో ఉంచటానికి మరొక వెయ్యిబొమ్మలు కావలసి వచ్చాయి. వాటన్నిటితో మనుష్యులకీ కాలుతీసివెయ్యటానికయినా చోటు ఉండేది కాదు.

ఇలా సోమరిపోతులుగ కూర్చుని విసిగిపోయారు జనం. ఇంత తీరిక

---

కమ్మగా వుండే కథలూ, గమ్మత్తుగావుండే కథలూ బాలబాలికలకు ఇష్టం! ఒక్కొక్కదేశం, ఒక్కొక్క భాషా, వున్నా; పిల్లల యిష్టం - కథల అవసరం - ఇవి మాత్రం సామాన్యంగా అన్నిచోట్లా ఒకే విధంగా వుంటాయి! సుమారు ముప్పయి దేశాలకు చెందిన పసందైన జానపద కథలను క్రమంగా యీ శీర్షిక క్రింద వేద్దామనుకున్నాము. "బద్ధకస్తులు" కొలంబియా జానపద కథ.

# బద్ధకస్తుల పురాణం

పనికి రాదనుకున్నారు. సభచేసి తమకీ పనికల్పించవలసిందని శిల్పిని కోరారు,

"ఏం పని ఉంటుంది గనక ?" అన్నాడు వృద్ధుడు. "పనంతా బొమ్మలే చేసేస్తున్నాయి. అయిన పనిని కానట్లు చెయ్యలేం కదా ?"

దానికి జవాబు చెప్పలేక సభ ముగించుకున్నారు ఊరివారంతా. అయినా ఇళ్లకువెళ్లి ఈ విషయం గురించే ఆలోచించి చూశారు.

"ఇటూ అటూ కదల్టానికి చోటు కావాలి !" అన్నారు. అనటం తడవుగా మనిషికి పది బొమ్మలు చెక్కాడు ముసలివాడు. ఈ బొమ్మలన్నీ గుంపుగా నడుస్తూ, "కదల్టానికి చోటుకావాలి !" అని అరవటం ప్రారంభించాయి. దారికి అడ్డంగా కనిపించిన తక్కిన బొమ్మలని తొయ్యటం మొదలుపెట్టాయి.

బొమ్మలనేకాక మనుష్యులనీ తొయ్యటం మొదలుపెట్టాయి. తప్పుకోమని తరిమాయి. ముందు పెద్దలు, తర్వాత పిల్లలూ పారి పోయారు. పిల్లలవెంట వాటిబొమ్మలు పరిగెత్తుకుంటూ వెళ్లాయి. ఎక్కడ చూసినా హడావుడి, గందరగోళంగా తయారయింది.

ప్రొద్దుగుంకేసరికి ఊళ్లో మనిషి మిగల్లేదు. అందరూ చెరువుదాటి పారిపోయారు !

మర్నాడు ఎవరిపనులు వారు చేసుకున్నారు. కోసుకున్న పళ్లరుచి ఎంతో తియ్యగా ఉందనిపించింది; తాగిననీళ్లు ఎప్పుడూ ఇంత బాగా లేవనుకున్నారు; పనిచేసి అలిసిన వారికి మంచినిద్ర పట్టింది. తెల్లవారి నప్పుడు సూర్యుడు చాలా అందంగా కనిపించాడు. సీతాకోకచిలకలూ, పువ్వులూ, కొండలూ, చెట్లూ, చెరువులో నీరూ, ఆకాశం నీలం రంగు; ఇవన్నీ ఎప్పటికన్నా చక్కగా ఉన్నట్లనిపించింది అందరికీ. 'బొమ్మల దశ' ఒక పీడకలగా తోచింది !

ఉల్లాసంతో కొత్త ఇళ్లు కట్టుకున్నారు. బాగా అలంకరించు కున్నారు.

ఇక పాతఊళ్లో అంటారా ? చివర సృష్టించిన బొమ్మలు తక్కిన వాటిని గదమాయించి పోట్లాట పెట్టుకున్నాయి. కొన్నిబొమ్మలు కుండలు విరక్కొట్టాయి. మళ్లీ కొత్త కుండలు తయారుచెయ్యలేక కష్ట పడిన కుమ్మరిబొమ్మలకి ఎక్కువ ఆహారం అవసరం అయింది. వంట బొమ్మలకి పని ఎక్కువ! వాటిని కొట్టేడే బొమ్మలు సరేసరి ! ఎక్కడ చూసిన పోట్లాటలే !

కాని, అసలు గొడవ కుక్కల్నీ, పిల్లుల్నీ గదమాయించటంతో మొదలయింది. ఈ నతాయింపు సహించలేని జంతువులు కలియ బడ్డాయి. ఇది చూసిన పాత్రలూ, కుంపట్లూకూడా ఎదురుతిరిగాయి ! తిరగలిరాళ్లు తమ హద్దుమీరి పోయాయి !

అతి హడావుడిగా వచ్చి తిరగలిని మందలించ పోయిన ఒక బొమ్మ రాళ్లమధ్య పడినలిగి పోయింది. ఇంకేముంది ! కుండలూ, పాత్రలూ తక్కిన బొమ్మల్ని తిరగలిలోకి తొయ్యటం నేర్చుకున్నాయి !! గందరగోళం ఎక్కువయి పోయింది. నిప్పంటుకుంది. అన్నీ పరుగు లంకించుకున్నాయి.

ఇంతలో ఒకపెద్ద మెరుపు మెరి సింది. వాన విపరీతంగా కురవటం మొదలుపెట్టింది. హడిలిపోయిన బొమ్మలన్నీ అడవిలోకి పారిపోయి చెట్లెక్కాయి! అప్పటినుంచీ చెట్ల మీదనే ఉండిపోయిన ఆ బొమ్మలు నేటి కోతులుగా మారాయి.

అయితే వాటికి తమ పాత చరిత్ర అంతా ఇంకా గుర్తుంది. మనుష్యులంటే ఇష్టంలేదు వాటికి. మరి కోతులు మనమీద పళ్లూ కాయలూ ఎందుకు విసురుతాయను కున్నారు ?



"ఏమో ! నేను మా అమ్మకే చెప్తాను."
విసురుగా వెళ్లబోయింది సుధ, సుందరమ్మగారు సుధ చెయ్యి పట్టుకొని మధుకేసి చూస్తూ— "నువ్వు ఎవరి నన్నావో నాకు తెలుసుకానీ పాపం సుధ నీ పెళ్లామే కదా ? పెళ్లాన్ని అలా వెక్కిరించ వచ్చునా ? మొగుడూ పెళ్లాలు ఎక్కడేనా దెబ్బ లాడుకుంటారా ?"

అప్పుడే వస్తూ సావిత్రి అత్తగారి మాటలు విని మొహం చిట్లించింది. — "గొప్ప మొగుడే దొరి కాడు." సుందరమ్మగారు కోడలికేసి చూడబోతే సావిత్రి మొహం తిప్పేసుకొంది. సుధ వాళ్లమ్మ వెనకే వెళ్లింది. — ఎవరో మందలించినట్లు మధు అరుగు చివరకెళ్లి కూరున్నాడు. — "సుధ నీ పెళ్లాం కాదుట్రా ?" అని అమ్మమ్మ చాలాసార్లు అంటూ వుంటుంది. పెళ్లాం అంటే పెద్దమామయ్య పెద్దత్తలాగ — చిన్నమామయ్యకి చిన్నత్తలాగానే కాబోలు. అసలు సుధ పుట్టినప్పుడు అమ్మ "ఇది మామధూ పెళ్లామే." అందట. అందుకే దానికి గొలుసు కూడా ఇచ్చేసిందట. పెళ్లాం అయితే పోట్లాడుకోకూడదు కాబోలు. అవును. అత్తయ్యలూ, మామయ్యలూ ఎప్పుడూ పోట్లాడుకోరు. మరి సుధ ఎప్పుడూ తనతో జట్టు కట్టకుండా వెధవ అల్లరి పనులు చేస్తుందేం ? చక్కగా మాట్లాడితే తను మాత్రం ఎందుకు వెక్కిరిస్తాడు ?

* * *

"సుధా ! మాట." మధు అనునయంగా పిలిచాడు. "నాకేం మాట అక్కర్లా !" చేతులు తిప్పేసింది సుధ. "ఆడుకుందాం. వస్తావా ? నిన్ను ఎప్పుడూ వెక్కిరించనుగా ?"

"నేనేం రాను. నీతో నేనసలు ఆడనే ఆడను."

"అదికాదు. సుధా !"

"ఛీ. ఫో !" పరిగెత్తింది వీధిలోకి.

మధుకి కోపం వచ్చేసింది. కాస్సేపు అలాగే నిలబడ్డాడు. మధు కూడా వీధిలోకి వెళ్లేసరికి సుధని వెక్కిరిస్తూ రాముా కన్పించాడు. సుధ భయంగా చూస్తూ నిలబడివుంది.

"ఏయ్ ! ఎందుకురా ? మా సుధని వెక్కిరిస్తావ్ ?" మధూకేకతో పరుగెత్తాడు రాము. వాడిని వీధి చివరి వరకూ తరిమి వచ్చాడు మధు.

మధూ పసిహృదయంలో సుధపట్ల ప్రత్యేక అభిమానం — సుధకో చిత్రమైన స్థానం లేకపోలేదు. ఒగుర్చుకొంటూ తిరిగి వస్తే, సుధ మధుకేసి చూడనైనా లేదు. వాణితో కబుర్లు చెప్తూ ఇసకతో గూళ్లు కడ్తూ కూర్చుంది. మధూకి చిర్రెత్తు కొచ్చింది. కసిగా సుధ కట్టిన గూళ్లన్నీ తన్నుకొంటూ నడిచాడు. సుధ దిగ్గునలేచి నిలబడింది — "నాగూళ్లెందుకు పడగొట్టావు ?" అంటూ అరిచింది.

"ఈ గూళ్లు నాకేం బాగులేవు."

"నాగూళ్లు బాగాలేకపోతే నీకేం ?"

"ఛీ! అందంగా లేకపోతే వుంచుకోటం ఎందుకు" నేను అందంగా కట్టి పెట్టనా ?"

"నాకేం అక్కరలేదు."

"అయితే నువ్వే అందంగా కట్టుకో."

"అందంగా కట్టుకోనే కట్టుకోను."

"మళ్లా పడగొట్టేస్తాను."

"మా అమ్మతో చెప్తాను."

"చెప్పుకో."

# కూలిన గోడలు

18వ పేజీ తరువాయి

"నిజంగా చెప్పేస్తాను."

"చెప్పుకోవోయ్ మహా ! ఎవడికి భయం? మీ అమ్మతో కాదు, మీనాన్నతో చెప్పుకో.

చెప్పుకో — చెప్పుకో — చెవులెక్క దీసుకో !
మందారాకు తెస్తా — మందు వేసుకో ! "

అంటూ పాటకూడా సాగించాడు.

"ఉండు. పెదనాన్నతో చెప్తాను. " సుధ పరుగెత్తింది — టక్కున పాట ఆపేశాడు మధు. "సుధా ! సుధా ! మాట. " — ఎంత అరిచినా సుధ వెనక్కి రాలేదు. మధూ భయంగా హారీవాళ్ల ఇంటికేసి పరిగెత్తాడు.

విశ్వనాథం — అంటే మాత్రం మధూకి చాలా భయం. — కారణం అతను మధు పెంకితనాన్ని అణగదొక్కుతానని కంకణం కట్టుకుని చీటికీ మాటికీ మధు వీపు దారుణంగా చిట్లగొట్టటమే.

"ఇప్పటినుంచీ ఇంత రౌడీ వెధవ్వి అయితే ఇక నువ్వేం పనికి వస్తావురా ?" అంటాడు విశ్వనాథం.

---

ఒక డాక్టరు దగ్గరకు రోగి వెళ్లి పరీక్ష చేయించుకుని, "మరి డాక్టరుగారూ ఏమీ చెప్పరేం ! నాలో లోపం ఏమిటి ?" అన్నాడు.

వెంటనే డాక్టరు అందుకొని "శవపరీక్ష చేసేవరకూ ఏమీ చెప్పలేనండీ" అన్నాడు, నిరాశతో నిట్టూర్పు విడుస్తూ.

సోమశేఖర్ (గుడివాడ)

---

మరీ కోపం వస్తే — "దిక్కులేని వెధవ్వి. వేలెడు లేవు. ఇంత తలతిరుగుడా నీకు? కాస్త గుణం, గుట్టూ వంటపట్టించుకొని నాలుగు ముక్కలు నేర్చుకోకపోతే ఇక బాగుపడ్డట్టే." అంటూ హుంకరిస్తాడు. సుందరమ్మగారు ఆ మాటలు వినటం తటస్థిస్తే ఆవిడ మనస్సు విలవిల్లాడి పోతుంది — "వాడికి కాస్త చురుకుపాలు ఎక్కువ. చిన్నవాణ్ణి పట్టుకుని ఎందుకు నాయనా అటువంటి మాటలు ?" అన్నదానికి విశ్వనాథం ఒక్కసారి ఉగ్రుడై పోయాడు — "చిన్నవాణ్ణి చిన్నవాడిలా వదిలేస్తే ఎల్లకాలం చిన్నవాడు గానే వుంటాడా ఏమిటమ్మా ? నీఅండ చూసుకునే వాడు కోతిలా తయారవుతున్నాడు. భయానికి కూడా మందలించనివ్వవు. ఇలాగే పెరిగి పెద్దవాడైతే ఇక చిప్పా, కర్రా చేతికి తీసుకోవలసిందే. మరేం లేదు."

సుందరమ్మగారు తిరిగి మాట్లాడలేక పోయింది. పోనీ మనవడికే నచ్చచెబుదామని మధు ఎన్ని బోధించినా దురుసుతనం ఆ పెంకి జవాబులూ మానుకోడు. ఒళ్లు అప్పగించి దెబ్బలు వోర్చుకుంటాడుగాని ఒక మాటపడి నోరు మూసుకోడు.

మధూ అన్నానికి రాలేదని సుందరమ్మగారు కంగారు పడింది. మిట్టమధ్యాన్నం వేళ సూర్యాన్ని వీధిలోకి పంపించింది. ఎంతమంది స్నేహితుల ఇళ్లు గాలించినా మధు కన్పించలేదు. అన్నీ వెదికిన తర్వాత తోటలోకి వెళ్లాడు సూర్యం — మధు సపోటా చెట్టుకింద పండుటాకుల్లో పడి నిద్ర పోతున్నాడు. సూర్యం తట్టి లేపితే వులిక్కిపడి లేచాడు. — "సుధ .... సుధ ..... చెప్పేసిందా ? మామయ్య ఏం చేస్తున్నాడు ?" కంగారు కంగారుగా అడిగాడు. సూర్యం మధు చెయ్యి పట్టుకుని లేవదీస్తూ అన్నాడు — "మామయ్య అసలు వూళ్లో లేడులే. రెండు రోజుల వరకూ రాడట. అమ్మమ్మ చెప్పమంది. లేచిరా !" — మధు కళ్లు నులుము కున్నాడు. సుధ చిన్నత్తకి చెప్పలేదూ ?"

"ఎందుకు చెప్పలేదు ? అమ్మమ్మ కూడా నిన్ను తిడుతోంది. అయినా నువ్వు దాని గూళ్లెందుకు పడగొట్టావ్ ? ఇలాంటి పనులు చేస్తే కొట్టరా ఏమిటి ?"

మధు బిక్కమొహం వేశాడు.

"రావేం ?"

"నేను రాను. నాకేం ఆకలిగా లేదు."

సూర్యానికి జాలివేసింది — "ఫర్వాలేదులే. మామయ్య లేడుగా ? ఇంకెవరు కొడతారు ?"

మధు సూర్యం మొహంలోకి ఆశగా చూస్తూ అన్నాడు. "అయినా అన్నయ్యా ! మనం జమీందారు గారింటికి వెళ్లిపోకూడదూ ? అమ్మగారు వచ్చెయ్యమన్నారుగా ?"

మధు పొద్దుటినుంచీ వీధులన్నీ తిరిగి తిరిగి ఆకలి కడుపుతో నీరసంగా తోటలోకి వచ్చి సపోటా చెట్టుకింద కూర్చున్నాడు. అన్నం తినటానికి ఇంట్లోకి వెళ్దామా అంటే మామయ్య చితగ్గొడతాడని భయం. అక్కడ నుంచి కదలనివ్వలేదు — నిశ్శబ్దంగా కూర్చుంటే మధు వూహలు శ్యామసుందరీ దేవి సన్నిధికి వెళ్లిపోయాయి.

"అమ్మగారే అయితే దగ్గిర నిలబడి మరీ ఎన్నో ఫలహారాలు తినిపించేవారు కదూ ? పద్మావతి అయినా కావలసినవి పెట్టేది." మధు కళ్లల్లో నీళ్లు తిరిగాయి — తను వచ్చేస్తుంటే — "వెళ్లి పోతావా మధుబాబూ ? మళ్లా ఎప్పుడొస్తావు ?" అంటూ రాగిణి కూడా ఏడ్చింది. అమ్మగారు వచ్చెయ్యమన్నారు కదా ? అక్కడికి వెళ్లిపోతే ? మధుకి అప్పుడప్పుడూ జమీందారుగారి సంస్థానంలోని విషయాలన్నీ జ్ఞాపకం వస్తూనే వుంటాయి. ఆ కాసేపూ దిగాలు పడి కూర్చుని అంతలో ఏపిల్లవాడో పిలిస్తే అంతా మర్చిపోయి పరిగెత్తుతాడు.

"లేవవేంరా ?" అన్నాడు సూర్యం విసుగ్గా.

మధు దీనంగా చూశాడు — "నేను అమ్మగారి దగ్గిరికి వెళ్లిపోతా నన్నయ్యా !"

"అమ్మమ్మ పంపుతుందేమిటి ?"

"అమ్మమ్మ కేమీ తెలీదు. ఇక్కడసలు ఏం బావుందనీ ! అస్తమానూ అత్తలు తిట్టటం మామయ్య కొట్టటమూనూ. కృష్ణుడు, సుధా మాట్లాడనే మాట్లాడరు. ఛీ ! ఇక్కడసలు ఏం బావుందనీ !" మధుకి విరక్తి కలిగింది. సూర్యం మాట్లాడలేదు. మధుకి అందరిమీదా కోపం వచ్చేసింది. ఇంట్లోకి వెళ్లేసరికి కృష్ణుడూ సుధా సుశీలా మధ్యాన్నం అన్నాలు తింటున్నారు.

"చిన్నత్త అన్నాలు పెడుతోంది. నువ్వూ వెళ్లి కూర్చో." అంది సుందరమ్మగారు పొడిగా. అన్నం తింటేగాని వాణ్ణి ఏం మందలించకూడదని ఆవిడ

వుద్దేశ్యం. మధు ఒప్పుకోలేదు — "అత్త నాకు సరిగ్గా పెట్టదు. నువ్వేరా అమ్మమ్మా!"

"ఛా! తప్పుడు వెధవా! అత్త ఎందుకు పెట్టదు?"

"నీకేం తెలీదు అమ్మమ్మా! మొన్న కృష్ణుడికి నెయ్యివేసి నాకు లేదనేసింది చిన్నత్త. వాడికెప్పుడూ పెరుగు వేస్తుంది. నాకూ, అన్నయ్యకూ నీళ్ల మజ్జిగ పోస్తుంది."

"చాల్లే. నోరు మూసుకో." కసిరింది సుంద రమ్మగారు.

అంతా వింటూనేవుంది సావిత్రి — "ఆ పిల్లాడెందుకూ నోరు మూసుకోవటం? మేమే నోళ్లు మూసుకోవాల్సిన రోజు వచ్చింది. మీ మనవడేం వెర్రి వాడుకాడు మీరు సమర్థించటానికి. వేలెడు లేడు. ఎన్ని అబద్ధాలో చూడండి."

మధు సిసింద్రీలా లేచాడు — పెద్దమామయ్య వూళ్లో లేడన్నసంగతి అంతర్గతంగా మరీ ధైర్యాన్నిచ్చింది. — "అబద్ధాలా? నేనా? — ముందు నువ్వు మజ్జిగ పొయ్యబోతే నేను వద్దనలేదూ? అప్పుడు పెద్దత్త జడవేసుకుంటూ వచ్చి — "పోనీ కొంచెం పెరుగు వేద్దూ!" అంటే కదూ వేశావు? "అంతటితోవూరుకోక గది గుమ్మంలో కూర్చుని ఏదో కుట్టుకుంటూన్న పార్వతిని చూస్తూ అన్నాడు — "ఏం పెద్దత్తా! నువ్వేచెప్పు. నేను అబద్ధమాడానా?"

"అబ్బ! ఏదో అయిందిగాని వూరుకుందూ? నేను సాక్షమా ఏమిటి నీకు?" అంది విసుగ్గా పార్వతి. సావిత్రికి తల తీసేసినట్టయింది — "సూర్యానికి ఎన్నిసార్లు నేను అన్నం పెట్టలేదు? ఎప్పుడైనా ఇలా కల్పించి చెప్పాడా?" అంది వుండబట్టలేక. మధు అతి తేలిగ్గా నవ్వేశాడు — "మా అన్నయ్యకైతే ఏం చేస్తున్నా తెలీదులే."

మధు ధోరణికి సుందరమ్మగారు భయపడింది. దిక్కులేక చేరినచోట దెబ్బలాడి తినాలంటే ఒప్పుతుందా? పరిస్థితి వీడికెప్పుడు అర్థమౌతుంది? దిగాలుపడి కూర్చున్న సుందరమ్మగారికి ఒకనాటి వైభవం కళ్లముందు కదులాడింది — ఆ మహాత్ముడు వున్న రోజుల్లో ఇంట్లో దేనికీ కొరత వుండేది కాదు. అంతా తన అధికారం! — తన పెత్తనం! కోడళ్లిద్దరూ కూతుళ్లలాగే మసులుకునేవారు. కల్యాణి వచ్చినప్పుడల్లా అంతులేనన్ని మర్యాదలు జరిగేవి. "నేను పరాయిదాన్నా ఏమిట్రా?" అని మొత్తుకుంటూన్నా వినకుండా వదిన లిద్దరూ కలిసి ఏవో వంటలూ వార్పులూ చేస్తూనే వుండేవారు. ఆనాటి అనురాగాలన్నీ చచ్చిన వాళ్లతోనే అంతరించి పోయాయి — ఈనాడు కల్యాణి బిడ్డలకు కడుపు నిండా కూడేలేదు. "అమ్మమ్మా! అన్నం పెట్టవా?" బిక్కమొహం వేసుకు నించున్నాడు మధు.

సుందరమ్మగారు తీక్షణంగా మనవడి మొహంలోకి చూసింది. ప్రొద్దున్న చద్దన్నం కూడా తినని మధు నీరసంగా ఎండిన తోటకూరకాడలా వాడు దిగజారిపోయాడు. ఆకలి బాధ వాడి మొహంలో కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది. సుందరమ్మగారి గుండె తరుక్కుపోయింది. — అయినా తెచ్చిపెట్టుకున్న కాఠిన్యంతో — "నేను పెట్టను. ఎక్కడికి పోతావో పో! వామాట నీకింత లెక్కలేనప్పుడు

వి గురించి నేనెందుకు బాధ పడాలి ? ఏవీ చెయ్యను. వెళ్ళు. వెళ్లవేం ? " అంటూ అరిచింది.

" నిన్ను నేనేం చేశానేమిటి ? " మధు గొంతు ఏడుపుతో పూడిపోయింది.

" ఇంకా ఏం చెయ్యాలి ? ఎవరేం చేసినా అడక్కుండా తిరిగి జవాబులివ్వకుండా నోరు మూసుకు వూరుకోవాలని చెప్పానా? నామాట నువ్వు ఎన్నడైనా ఖాతరు చేశావూ ? "

" మరి నేనే అబద్ధాలాడుతున్నాన....ని ..."

" మరీ లేదు. గిరీ లేదు. వెళ్ళు."

" నేనేం వెళ్లను. ఆకలి వేస్తోంది. అన్నంపెట్టు."

" నేను పెట్టనని చెప్పానుగా ? వెళ్లవేం ? "

" ఎక్కడికి వెళ్లనేమిటి ? "

" ఎక్కడికో పో ! ఈ వూళ్లో లేకుండా పో !"

మధు గిరుక్కున వెనక్కి తిరిగాడు — " అయితే వెళ్తానులే." ఒక్కటే పరుగు తీశాడు.

" ఒరేయ్ ! మధూ ! మధూ ! రారా ! అన్నం పెడతాను. రారా ! " సుందరమ్మగారు పొలికేకలు పెడుతూ వీధి గుమ్మం వరకూ వెళ్లింది. అప్పటికే మధు మాయమయ్యాడు. నిర్ఘాంతపోయి నిలబడిపోయింది. ఆవిడ గుండెలు దడదడ కొట్టుకున్నాయి. " అసలే దుడుకు వెధవ. నిజంగానే పోతాడా ఏం ఖర్మ ? "

"అయ్యో! వాణ్ణెందుకు బెదర గొట్టావమ్మా?" జానకి కూడా హొచ్చుకుంది. వీధివెంట మాటిమాటికీ గాలిస్తూ గుమ్మంలో నిలబడింది.

ఇళ్లన్నీదాటి వీధులన్నీదాటి ఎక్కడికో పిచ్చి వాడిలా నడిచిపోతూన్న మధు ఎదురుగా వస్తూన్న వ్యక్తిని చూశాడు—ఆగిపోయాడు అకస్మాత్తుగా. భయం భయంగా నిలబడ్డాడు.

"ఎందుకురా ఇలా వచ్చావ్ ?"

"ఎ.... ఎ.... ఎవరు ?"

"ఎవరేమిటి ? నువ్వే ఇక్కడ తిరుగుతున్నావెందుకు ?"

"వూరికేనే మా...మయ్యా !"

"వూరికే ఏమిటి ? నిజం చెప్తావా ? తగలనిమన్నావా ? కోతి వెధవా ! నీకు తోక ఒక్కటే తక్కువ."

మధు మాట్లాడలేక పోయాడు.

"నేను వూళ్లో లేనని వీధులట్టుకు తిరుగుతున్నావ్ కదూ ? అంతేనా ? మాట్లాడవేం ?"

"కాదు.... మామయ్యా ! అమ్మమ్మ తిట్టిందని."

"నీ ఎత్తులు నాకు తెలుసులేరా ! నడు ఇంటికి."

ఆ గర్జనతో పిల్లిలా విశ్వనాధాన్ని అనుసరించాడు మధు— మధుకి ఆపుకోలేనంత దుఃఖం ముంచుకొచ్చింది.

ఆకలి బాధతో ఒళ్ళు తూలిపోతోంటే చొక్కాతో కళ్ళు తుడుచుకొంటూ నడిచాడు. విశ్వనాథం దారిలో మరేమీ పల్కరించలేదు— ఇంటికి వస్తూనే "అమ్మా ! సుధా !" అంటూ కేక పెట్టాడు. సుధతో పాటు అనుకోని విధంగా వూరు నుంచి వచ్చేసిన విశ్వనాథం రాకకు దాదాపు ఇంట్లో వాళ్లాంతా చావిట్లో కొచ్చారు. స్తంభం చాటున నిలబడి ఉన్న మధుని చూసింది జానకి— "అమ్మా! అడుగోనే మధు. ఏంరా ? అక్కడ నిలబడ్డావ్ రావేం ?" అంది సంభ్రమంగా.

సుందరమ్మగారు గబగబా మధు దగ్గిరికి వెళ్తూ— "మాట వరసకి ఏదో అన్నానని అలా అన్నం తినకుండా వెళ్లిపోవటమేనట్రా ?" అంది మందలింపుగా.

మధు స్తంభాన్ని ఆనుకొని మాట్లాడకుండా నించున్నాడు— "ఓహో ! అందుకే నేమిటి అలా వీధులట్టుకు తిరుగుతున్నాడు ? ఏంరా ? ఇలారా ?" కటువుగా పిలిచాడు విశ్వనాథం. మధు కదల్లేదు.

"పెదనాన్నా ! బావ పొద్దున నా గూళ్లన్నీ పాడు చేశాడు.... మరేమో ఇందాక అమ్మని కూడా తిట్టాడు" ముద్దుగా పెదనాన్న చెంపలు చేతులతో రాస్తూ చెప్పింది సుధ.

"ఆఁ ఏదో అయింది లెద్దూ ! ఎన్ని అనుభవించటం లేదూ? అందులో ఇదొకటి. ఈ మాత్రానికి మగవాళ్ల దాకా దేనికి ?" గొడవలేమీ నచ్చని దానిలా సహనవంతురాలిలా.... అంది. సావిత్రి తలుపు దగ్గిరి నుంచి.

"నువ్వే కదమ్మా పెదనాన్న రాగానే చెప్పమన్నావు ?" కూతురి మాటలతో, తుపాకీ చూసిన పక్షిలా తప్పుకు పోయింది సావిత్రి. నెమ్మదిగా సుందరమ్మగారి వెనక్కు నడుస్తూన్న మధుని చూస్తూ గర్జించాడు విశ్వనాథం "ఒరేయ్ ! ఆగు. చిన్నత్తని తిట్టావా ?" బిత్తర పోయిన మధు అడ్డంగా తల వూపాడు.

"సుధ గూళ్ళు పాడు చేశావా ? నిజం చెప్పు."

మధు మాట్లాడలేక పోయాడు.

"చిన్నవాణ్ణి అంతగా నిలవెయ్యటం ఏమిటి ? పిల్లలు అల్లరి పనులు చెయ్యరా ?" తనలో తను సణుక్కొంది జానకి. వెధవ గొడవంతా నా కెందుకన్నట్టు తన గదిలోకి వెళ్లిపోయింది పార్వతి.

"ఏంరా మాట్లాడవ్ ?" మధని దింపి దగ్గిరిగా వస్తోంటే మధు భయంగా సుందరమ్మగార్ని చుట్టబెట్టేసుకున్నాడు— "అమ్మమ్మోయ్ ! అమ్మమ్మా !"

"ఇక నుంచి అలాంటి పనులు చెయ్యకుండా నేను చూసుకుంటాను గాని ఈ సారికి వూరుకోవాయనా !" ప్రాధేయపడింది సుందరమ్మగారు.

"అబ్బే ! అలాక్కాదు. వాడికి భయం ఉండితీరాలి." సరిగ్గా దేవుడు పంపినట్టే వచ్చాడు సీతాపతి. సంగతంతా గ్రహించి సమర్థింపుగా అన్నాడు— "పోనీ చిన్న వాడితో ఏమిటిలే అన్నయ్యా ! నాలుగేళ్ళు పోతే వాడికే బుద్ధి వస్తుంది"

విశ్వనాథం కస్సుమన్నాడు— "మొక్కై వంగందే మానై వంగుతాడట్రా ? వీడి అల్లరి ఎంతకనీ భరించటం ?" (సశేషం)



## ఆడంబరాలను విడనాడండి
## దేశసంపదను వృధా కానీయకండి

శాంతం చెందింది.

సత్యానందాన్ని మనసారా శ్లాఘించింది.

తన వాదనలో నెగ్గగలిగినందుకు మాత్రం లోలోపల పట్టరాని సంతోషం పొందింది.

రెండు రోజులు గడిచాయి.

మూడవరోజు హైస్కూలులో నా ఆఫీసు గదిలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాను. నే నిన్నాళ్లూ నమ్ముతున్న సిద్ధాంతాలకు ఈ కాలంలో తావులేదా? శాంత అనుకున్నట్లు నేనే అమాయకుడినా ? విజ్ఞానికి ఈ సంఘంలో చోటు లేనప్పుడు శాంత చెప్పినట్లు నా ఉపన్యాసాలన్నీ శుద్ధ దండుగలే నేమో ?

నా ఆలోచనలకు భంగం కలిగిస్తూ పోస్టుమాన్ గుమ్మం దగ్గర నిలబడ్డాడు. నా అనుమతితో లోపలకు వచ్చి, ఉత్తరాలన్నీ మేజా బల్లమీద ఉంచాడు. ఒక మనియార్డర్ ఫారమ్ బయటకు తీస్తూ, "ఎస్. సత్యానందం అని ఫిఫ్త్ ఫారమ్‌లో ఎవరో అబ్బాయి ఉన్నాట్ట పిలిపిస్తారాండి ?" అంటూ ఆ ఫారమ్ నా చేతి కిచ్చాడు. గుంటూరు నుండి ఒక కాలేజీ విద్యార్థి ఆరు రూపాయలు మనియార్డరు చేశాడు సత్యానందానికి. నేను పట్టలేని సంతోషాన్ని పొందాను. మనియార్డరు కూపన్‌లో ఇలా రాసి ఉంది.

"తమ్ముడూ ! నీవు చేసిన మేలు మా రూమ్ మేట్స్ నలుగురం కూడా మరువలేము. ఈ వూళ్లో

# పరిష్కారం

14వ పేజీ తరువాయి

ఆ పుస్తకం ఎక్కడా దొరకడంలేదు. నీ దగ్గర డబ్బు తీసుకున్న మాధవరావు, వాళ్ల చుట్టాల వూరికి వెళ్లి వస్తుండగా ఒక కారు ప్రమాదంలో చిక్కుకున్నాడు. నిన్నటి వరకు అతనితో మేం మాట్లాడడం కుదరలేదు. అతనికి స్పృహ వచ్చిన వెంటనే నీ విషయం చెప్పాడు. ఇప్పుడు కులాసాగానే ఉన్నాడు. మేమందరం నీకు మా ధన్యవాదాలర్పించుకుంటున్నాం !

ఇట్లు,
టి. బి. శర్మ"

సత్యానందం ముఖంలోకి చూశాను. వాడు సార్థక నామధేయుడులా కనుపించాడు. వాడిమీద నాకు ప్రత్యేకమయిన అభిమానం ఏర్పడింది.

స్కూలు వదలగానే తిన్నగా మా యింటికే పరుగెత్తాడు సత్యానందం. శాంత తెల్లబోయింది! వాడి లేత హృదయాన్ని అంతలా బాధపెట్టినందుకు నొచ్చుకుంది. సత్యానందం, ఆ వూళ్లో చదువు పూర్తి చేసుకునేటంతవరకూ, మా ఇంట్లోనే ఉండిపోవాలని కోరుకుంది. ఆమె కోరిక విన్న నేను చాలా ఆశ్చర్యపడ్డాను. ఆమెలో కలిగిన పరివర్తనకు ఎన్నో జోహార్లర్పించుకున్నాను.

రెండేళ్ల పాలతిని భుజంమీద వేసుకుని ఆడిస్తూ నిండు గర్భవతి అయిన శాంతకు ఇంటి పనుల్లో చేదోడు వాదోడుగా ఉంటూ సత్యానందం ఇంట్లో మసులుతుంటే చూస్తూ అప్రయత్నంగా ఆనందబాష్పాలు రాల్చేవాడిని. మమకారం, స్నేహం ఈ లోకంలో ఎవరెవరి మధ్య ఎలా కలుగుతాయో చెప్పలేం కదా ?!

స్కూల్ ఫైనల్ పరీక్షలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడయాడు సత్యానందం. కరణంగారు అప్పుడప్పుడు వచ్చి చూచిపోతూండటమే కాని, సత్యానందం ఇంకెప్పుడూ వాళ్ల వూరు వెళ్లలేదు—ఆ యేడే నాకు విశాఖపట్నం దగ్గర పల్లెటూరు, పట్నవాసంగాని, ఒక వూరుకు ట్రాన్స్ఫర్ అయింది నాతోపాటే సత్యానందాన్ని కూడా తీసుకువెళ్దామని అనుకుంటున్నాను —కరణంగారు వచ్చారు. సత్యానందానికి బాపట్లలోనే ఒక కాలేజీ సీటు, స్కాలరుషిప్పు కూడా సంపాదించారు. గడచిన మూడేళ్లుగా నే తీసుకున్న బాధ్యతకు నాకు ధన్యవాదాలర్పిస్తూ బాపట్లలోనే సత్యానందాన్ని చదివించదల్చుకున్నట్లు ఆయన నిశ్చయాన్ని వెలిబుచ్చారు. అనుభవజ్ఞులైన ఆయన నిశ్చయాన్ని ప్రశ్నించడానికి కూడా నాలో ధైర్యం లేకపోయింది.

సత్యానందం కంటె ఎక్కువగా తన మనస్సు



పాడుచేసుకుంది శాంతి. ప్రతి ఏడూ విద్యార్థులతో పాటే వియోగబాధ తప్పనందువలన నే వెలాగో మనసు దిట్టపరచుకో గలిగాను. శాంతకు కూడా ధైర్యం చెప్పాను. నాకు బదిలీ అయిన వూరు వచ్చేశాము.

...... అప్పుడప్పుడు ఉత్తరాల ద్వారా తప్ప సత్యానందాన్ని ముఖాముఖీగా కలుసుకోవడం మళ్లీ కుదరనే లేదు. సత్యానందం మమ్మల్ని కలుసుకోడానికి ప్రయత్నించినట్లు కూడా కనుపించదు. అలాగని వాడిమీద నా కేమీ కోపం రాలేదు. సత్యానందం సైన్సు డిగ్రీ సంపాదించుకున్నాట్ట. వెంటనే ఒక మంచి ఉద్యోగం కూడా దొరికిందట. ఉద్యోగంలో ప్రవేశించిన ఒక ఏడాది లోపునే కరణంగారు కూడా గతించారుట. సత్యానందం జీవితంలో ఇన్ని మార్పులు జరిగినా ఒక్కసారీ అతడు నన్ను కలుసుకోలేనందుకు నా కేమీ కారణం కన్పించేది కాదు. ఒక ఏడాది నుండి మాత్రం రాస్తున్నాడు. త్వరలోనే వచ్చి నన్ను కలుసుకుంటానని. మాటు, బూటులో సత్యానందం ఎలాగుంటాడో నిజంగానే చూడాలనిపించింది .......

ఇంతలో "మేష్టారూ !" అంటూ ఎవరో పిలిచే సరికి మడత కుర్చీలోంచి, గుమ్మంలోకి వెళ్లి చూశాను.... సత్యానందమే ! !

ఆరడుగుల పొడుగు. పొడుగుకు తగిన ఛాతి. యవ్వనం ఉట్టిపడే ముచ్చటైన ముఖం. నల్లని మీసం.... సూటూ.... బూటూ.... ! ఒక్క క్షణం, మాట్లాడకుండా అతనివైపే చూసే సరికి కొంచెం సిగ్గుపడే ముఖం క్రిందకు వాల్చుకున్నాడు సత్యానందం. వెంటనే వచ్చి మా ఉభయుల పాదాలకూ నమస్కరించాడు. నిద్రపోతున్న

# పరిష్కారం

'మాలతి, రాంబాబులను ఆప్యాయంగా చేత్తో నిమిరాడు. పది నిముషాలపాటు చాలా విషయాలు మాట్లాడుకున్నాక, మనిద్దరం ఒకచోటుకు వెళ్లాలి మేష్టారూ ! తిరిగి సాయంత్రానికల్లా వచ్చేద్దాం ! వస్తారా ?" అని అతడు కోరగానే ఎందుకో ఎక్కడికో కూడా అడక్కుండానే బయల్దేరాను. పైమీద కండువా వేసుకుని.

"అమ్మగారూ ! రాత్రికి మీ చేతి భోజనమే రుచి చూస్తాను. మరి నాక్కావలసినవి చేసి పెడతారుగా !" సత్యానందం మాటలకు శాంత ఉబ్బి తబ్బిబ్బయింది. సత్యానందం ప్రవర్తనలోని మార్పు, మెరుగుతనం చూసి మనసులోనే, మెచ్చుకున్నాను.

* * *

శాంతి ఆశ్రమ ప్రాకారం దాటి రోడ్డుమీదకు వచ్చాము.

ఎదురుగా నున్న ఒక కారును చూపించి, "మా కంపెనీ కారేనండి మేష్టారూ ! కూర్చోండి" అంటూ తలుపు తెరిచాడు. తను స్టీరింగు ముందు కూర్చుని కారు స్టార్ట్ చేశాడు. ఆశ్చర్యం, ఆనందం కూడా నాలో అవధులు దాటాయి. సన్నని వంకర టింకర రోడ్డు మీద కారు సాఫీగా నడుస్తోంది. ఒక్కొక్క మలుపు తిరిగే సరికి ఒక్కొక దృశ్యం రమణీయంగా మా కనుల ముందు ప్రత్యక్ష మవుతోంది. అతను కారునడిపించే మార్గం గురించీ, అతడు చెప్పబోయే విషయం గురించీ ఏమీ తెలియక అయోమయంగా చూస్తున్నాను.

ఒక్కసారి కంఠం సవరించుకొని గంభీరంగా చెప్పుకు పోయాడు సత్యానందం.




"మా స్వగ్రామం ఇక్కడకు పదిమైళ్ళ దూరంలో ఉంది మేష్టారూ ! బాపట్లలో ఫోర్త్‌ఫారం చదువుతుండగా అక్కడకు నే వెళ్లివచ్చినట్లు మీకు తెలిసిన విషయమే ! తరువాత ఇంతవరకూ నేను ఎప్పుడూ వెళ్లనేలేదు. మిమ్మల్ని ఒక ప్రత్యేకమయిన పని మీద ఇప్పుడు మా వూరికి తీసుకు వెళ్తున్నాను."

ఏమిటో ఆ పని అని చెవులు రిక్కించుకు విన్నాను.

"అవి నేను ఎనిమిదవ తరగతి చదువుతున్న రోజులు మేష్టారూ ! నాకు పన్నెండేళ్లు కూడా పూర్తిగా ఉండవు. ఆ నాడు దీపావళి. అంతకు రెండేళ్ల ముందే చనిపోయిన అమ్మను గుర్తుకు తెచ్చుకుంటూ నాన్నగారు పడక గదిలో విచార గ్రస్తులై కూర్చున్నారు. ఆయన మనసులోని కలవరాన్ని అర్థం చేసుకోలేని నేను, దీపావళి నాడు నాకు కావలసిన సామానులన్నీ కొని పెట్టమని పేచీ పెట్టాను. నాపై జాలిపడి, అందరిళ్లల్లో లాగే మా ఇంట్లోనూ దీపావళి జరుగుతుందని నాన్నగారు నా కెంతో ఉత్సాహం కలిగించారు. అందరిళ్లల్లోలాగే మా ఇంట్లోనూ దీపాలు వెలిగాయి. ఆయన కొని తీసుకువచ్చిన 'తీపి' తిన్నాక దీపావళి సామానుతో వీధి గుమ్మం దగ్గరకు వచ్చాను. అందరు పిల్లలూ చుట్టూ మూగి, నే కాల్చే మతాబాలూ అవీ చూస్తున్నారు. మా ఇంటి కెదురుగా పెద్ద కాళీ స్థలం ఉండేది. ఆ కాళీ స్థలాని కవతల వైపున మామయ్యగారిల్లు ఉండేది. గుమ్మం దగ్గర నిలబడి, సంతోషంగా, తృప్తిగా నన్ను చూస్తున్నారు" నాన్నగారు.

"పక్కింటి బుల్లెబ్బాయి" గారు వచ్చి, 'ఇవి మా అబ్బాయిలు కట్టేరండి. ఈ ఐదూ మీరు వదిలి చూడండి. ఇదంతా కాళీ స్థలమేగా. ఏం ఫర్వాలేదు. కాల్చండి !' అంటూ అయిదు తారాజువ్వలు నాన్నగారి చేతిలో ఉంచారు. భయపడుతూనే ఒక తారాజువ్వ వదిలారు నాన్న గారు. రివ్వున ఆకాశంలోకి దూసుకు పోయింది. 'అబ్బా ! ఎంత బాగుంది !' అనుకుని ఇంకోటి వదలమని నాన్నగార్ని బలవంత పెట్టాను. మొదట నాకోర్కెను తిరస్కరించినా నాన్నగారు, నా మంకుపట్టుకు లొంగిపోయి ఇంకో తారాజువ్వ వదిలారు ! అంతే !! అది తిన్నగా వెళ్లి మామయ్యగారి తాటాకుల ఇంటిమీద పడింది. ఆ ఇల్లు వెంటనే అంటుకుంది. నాన్నగారు వెంటనే అక్కడికి పరుగెత్తారు.

"మరుక్షణంలో అంతా కల్లోలం. ఆ ఇల్లు ఒక్కటే కాలి పోయింది. మేష్టారూ ! అది పూర్తిగా కాలిపోకముందే నా గుండెల్లో మంట పుట్టింది. ఎవరి నోటమ్మట చూసినా అదేమాట — 'పలపతి రావుగారు వాళ్ల బావ గారింటికి అగ్గి పెట్టాడంట !'

"రెండువేల రూపాయల వరకూ మామయ్యగారికి నష్టం కలిగి వుంటుందని పెద్దలు అంచనా వేశారు. జీవిత ప్రారంభం నుంచి ఒక ఎలిమెంటరీ స్కూలులో టీచరుగా పనిచేసి, గొర్రెతోక ఆదాయంతో కాలక్షేపం చేసిన నాన్నగార్కి అప్పుడున్న ఆస్తి అంతా మా పూరి ఇల్లొక్కటే ! రెండువేల రూపాయలు నాన్నగారెలా ఇచ్చుకుంటారు ? మామయ్య గారింటికి వెళ్లాను. ఎవరూ నావంక చూడలేదు. మామయ్య మాత్రం కొరకొరా చూశాడు

వా శ్రైవ్రు. భయపడి పోయూను మేస్టారూ! సిగ్గుతో తిరిగి ఇంటికి వచ్చేశాను."

"నాన్నగారు ఇల్లు కదలి బయట అడుగు పెట్ట లేక పోయారు. ఏ మూల చూసినా అదే మాట! ఎవరి నోటవిన్నా అదేమాట ! నాన్నగార్ని ఓదార్చిన కరణం గారిలాంటి పెద్దమనుషులు లేక పోలేదు. కాని నాన్నగారు మనోవ్యాకులతకు తట్టుకోలేకపోయి నట్టున్నారు ! ఆమూడవనాడు రాత్రి ఎవరికీ తెలియ కుండా ఎక్కడికో వెళ్లిపోయారు."

"చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టు కున్న నన్ను ఒక్క కరణంగారే దగ్గరకు తీసుకున్నారు. వూళ్లో వాళ్ల మాటలకు వాలేత మనసు తట్టుకో లేదని తెలిసే ఆయన నన్నంత దూరంలో ఉంచి










అదిలించారు.

"మరుసటి సంవత్సరం నేను మావూరు వెళ్ళినప్పుడు కూడా మామయ్య మనసు మార్చుకోలేదు. వూళ్ళో వాళ్ళందరూ నాన్నగార్ని చేతకానివాడన్నారు. ఆయన కంటే ఆడది నయమన్నారు. అప్పుడు నేననుకున్నాను మేష్టారూ ! 'మామయ్య నష్టపోయిన రెండువేల రూపాయలూ మామయ్యకు వడ్డీతోసహా చెల్లించాలి! అప్పుడే నేను మావూరు చూడాలి !' అని. కరణంగారి చేతి చలవ వలన మీరు నాయందు చూపిన ఆదరాభిమానాల వలన ఈనాటి కింత వాణ్ణయ్యాను. ఒక మంచి కన్స్ట్రక్షనరీ కంపెనీకి సేల్సు ఏజంటుగా ఉంటున్నాను. ఉద్యోగంలో చేరిన నాటినుండీ, ఇంత వరకూ మూడువేల రూపాయలు పోగుచేయగలిగాను. ఈ డబ్బు మీ చేత్తో మామయ్య కిప్పించాలని నా ఉద్దేశ్యం ! నా ఈ కోర్కెను మీరు మన్నిస్తారని ఆశిస్తాను !"

సత్యానందంలో ఏదో ప్రత్యేకత ఉందని నాకేనాడో తెలుసు ! అతనంత వరకూ నన్ను కలుసుకోకుండా ఉండానికి ఏదో కారణం ఉండాలని నేననుకుంటూనే ఉన్నాను. అతని గంభీరమైన మాటలు వింటూ ఆశ్చర్యచకితుణ్ణయ్యాను. అతని కోర్కెను మనసారా మన్నిస్తున్నట్లు తల మాత్రం ఆడించగల్గాను.

ఆ పల్లెటూళ్ళో మాకారు ప్రవేశించే సరికి ప్రజలంతా వింతగా మావేపే చూశారు. కారు తిన్నగా ఒక ఇంటి ముందు ఆగింది.

సత్యానందం కారు దిగి గుమ్మం మెట్లు ఎక్కి, వీధి తలుపు తట్టాడు. నేను కారులో కూర్చుని అటు వైపు చూస్తున్నాను. తలుపులు తెరుచుకున్నాయి. ఒక లావణ్యవతి ( యవ్వన 'లక్ష్మి' ) తన ఎదురుగా ప్రత్యక్షమయ్యేసరికి కొంచెం తడబడ్డ సత్యానందం, వెంటనే సర్దుకుని, ఒక్క క్షణం ఆమెవైపు చూశాడు. శీతహరిణేక్షణ అయిన ఆ బేల ముఖం ప్రక్కకి తొల్చుకుంది. ఒక్కసారి అతని ముఖంలోకి చూసి, మందహాసంతో వెనుదిరిగి పారిపోయింది.

సిగ్గు పడిపోయిన సత్యానందం నాతో ఎలా మాట్లాడాలో ఆలోచించుకుంటున్నాడు.

నేను కారుదిగి మెల్లిగా గుమ్మం దగ్గరకు వెళ్ళాను.

"అమ్మా! అప్పారావుగారున్నారా?" ఇంట్లోకి తొంగిచూస్తూ, స్థంభం చాటుగా నిలబడిన ఆ అమ్మాయిని అడిగాను.

"అలా వూళ్ళోకి వెళ్ళారండి ! ఇప్పుడే వస్తారు. కూర్చోండి." ఆ బాల సమాధానంతో పాటే ఆమె అమ్మగారు, సత్యానందం అత్తయ్యగారు నడవలోకి వచ్చారు. సత్యానందంలో వచ్చిన మార్పును చూసి ఆశ్చర్య పడుతూ అతని యోగక్షేమాలు అడిగి తెలుసుకుంటున్నారు.

ఇంతలోనే అప్పారావుగారు, గ్రామమునసబు గారు, అక్కడకు వచ్చారు. అప్పారావుగార్ని మునసబుగార్ని నాకు పరిచయం చేశాడు సత్యానందం. వీధి అరుగుమీద సిద్ధంగా ఉన్న కుర్చీల మీద మేము నలుగురం కూర్చున్నాం. ఆ గ్రామ నాతా వరణం గురించి, పంచాయితీ గురించి, పరిసర ప్రాంత విశేషాల గురించీ మునసబుగారు నాకు చెప్తున్నారు. అప్పారావుగారి కుటుంబ విశేషాలన్నీ కనుక్కుంటున్నాడు సత్యానందం.

మునసబుగారు కబురు చేసినట్లున్నారు. పంచాయితీ ప్రెసిడెంటుగారు కూడా కొంతసేపటికి

# పరిష్కారం

అక్కడకు వచ్చారు. అందరం ఒకసారి లేచి నిలబడ్డాం. గ్రామ పెద్దలందరూ మా ప్రయత్నం ఏమీ లేకుండానే అక్కడ సమావేశ మవడంతో మేము వచ్చిన పని తెల్పమన్నట్లు నా వైపు చూశాడు సత్యానందం.

గొంతు సవరించుకొని నేను ఇలా అన్నాను: "ఈ గ్రామాన్ని సక్రమంగా నడిపిస్తూ గ్రామాభివృద్ధికి పాటుబడుతున్న మీ పెద్దలందర్నీ కలుసుకోవడం నా అదృష్టం. ఇంత మారుమూల గ్రామంలో పుట్టిన సత్యానందం నాకు శిష్యుడవడం, రెండు మూడేళ్ళ పాటు నా ఇంట్లో ఒకడుగా మసలడం నాకే వింతగా తోస్తోంది. చిన్న తనంలోనే పెద్ద సమస్యలకు గురి అయినా కష్టపడి చదువుకోగల్గి, పైకి రాగల్గిన సత్యానందాన్ని కన్న ఈ వూరు చాలా ధన్యురాలని చెప్పాలి ! ఇతని తండ్రి చలపతి రావుగారు వినోదార్థం కాల్చిన తారాజువ్వ అప్పారావుగారి ఇంటి మీద పడి, ఆయనకు రెండు వేల రూపాయలు దాకా నష్టం కలిగించిందని మీ అందరకూ తెలిసిన విషయమే ! నిస్సహాయులైన చలపతిరావుగారు చేసేదేమీ లేక ఎక్కడికో

---

భాటసారి: రామారావుగారిల్లెక్కడా?

మరొకడు: ఎక్కడనుకున్నావు! ఆయనకేం ఖర్మ; ఇల్లెక్కడానికి ?

సుబ్బారెడ్డి (కోవలికుంట్ల)

---

పోయారు. ఆ అప్పు మాత్రం బహుశా అప్పుగానే ఉండిపోయి ఉంటుంది. ఇప్పుడు వడ్డీతో సహా ఆ అప్పు తీర్చే బాధ్యత సత్యానందం తనపై పెట్టు కున్నాడు. మీ అందరి సమక్షంలో ఈ మూడు వేల రూపాయిలూ అప్పారావుగారికి ముట్ట చెప్ప మని కోరుకుంటున్నాను." అక్కడ పెద్దలందరూ ఆశ్చర్య చకితులయ్యారు.

అప్పారావుగారు గద్గద కంఠంతో జవాబిచ్చాడు.

"ఇన్నాళ్ళకు మా సత్యానందం మా వూరికి రావడమే మాకెంతో గొప్పగా ఉంది. అప్పటి నా మూర్ఖత్వాన్ని నేనే ఎన్నోసార్లు నిందించు కుంటున్నాను. దైవకల్పితంగా జరిగిన ఆ సంఘటనకు ఎవరూ బాధ్యులు కారు. ఇప్పుడు నేనీ డబ్బు తీసుకోవడం నా కుటుంబానికే ఒక కళంకంగా అవుతుంది. క్షమించండి మేష్టారూ ! వద్దని సత్యానందానికి మీరే నచ్చచెప్పండి !"

సత్యానందం వైపు చూశాను. అతని ముఖ కవళికలు అర్థం చేసుకొని, తిరిగి అప్పారావు గారితో నేనన్నాను.

"చలపతిరావుగా రెక్కడున్నారో ఎవరికీ తెలియదు — మీ ఇంటి మంటలు ఆ రోజునే ఆరి పోయినా ఆయన హృదయంలో మంటలు ఇంకా ఆయన్ను వేధిస్తూనే ఉంటాయి. అవి చల్లారా లంటే మీరీ డబ్బు తీసుకోవాలి !"

అప్పారావుగారు ప్రాధేయపడ్డారు. "మేష్టారూ! ఇంత ఖచ్చితంగా మీరు మాట్లాడుతోంటే నేనేం చేయగలను చెప్పండి ? ఆ నాడు ఆయన మీదకు నన్ను ఉసికొలిపిన ప్రజలే ఈ నాడు ఈ వార్త విని నా ముఖం మీద ఉమ్మేయకుండా ఉంటారా? మీరే ఆలోచించండి. నా పొరపాటు నేనే చెప్పుకుంటున్నా నన్ను క్షమించలేరా మీరు ?"

ఆయన్ను చూసి నిజంగా జాలివేసింది నాకు. ఏమి చేయడానికీ పాలుపడక సందిగ్ధావస్థలో పడ్డాను. ప్రెసిడెంటుగారు నన్ను దగ్గరకు పిలిచి రహస్యంగా రెండు మూడు విషయాలు కనుక్కున్నారు. ఒక్క క్షణంపాటు ఆలోచించి తీర్పుచెప్పారు.

"ఈ సమస్య పరిష్కరించాలంటే ఒకటే ఒక మార్గం ఉంది. తన తండ్రి బాధ్యత నిర్వహించటం కోసం పాటుబడుతున్న సత్యానందం ఇంకొక చిన్న బాధ్యత కూడా వహించవలసి ఉంటుంది. అలా చేయడంవలన చలపతిరావుగారి ఆత్మ శాంతిస్తుంది. పశ్చాత్తాపం చెందుతున్న అప్పారావుగారికీ సంతోష మవుతుంది."

అందరూ కళ్ళప్పగించి ఆయనవైపు చూశారు. వసారా ప్రక్క నున్న గదిలోని కిటికీ తలుపు పక్కన నిలబడ్డ ఆ 'యవ్వన లక్ష్మి', నే నావైపు చూశానని తెలుసుకొని చాటుగా వెళ్ళిపోయింది.

"సత్యానందం ఇస్తున్న ఈ మూడు వేల రూపాయలూ అప్పారావుగారు తీసుకుంటారు. సత్యానందం అంగీకారంతో, ఐదువేల రూపాయలు ఆయన కూతురు 'లక్ష్మి'తోపాటు కానుకగా అతనికి ఇస్తారు."

అప్పారావుగారి కళ్ళు మెరిశాయి. సత్యానందం వహించిన మౌనం అర్ధాంగీకారాన్ని సూచించింది. మునసబుగారూ, నేనూ ఒకరి వంక మరియొకరు చూచుకొని చిన్నగా నవ్వుకున్నాం.

అప్పారావుగారు నాచే ఇవ్వబడిన మూడువేల రూపాయలూ ఆ పెద్దల సమక్షాన్ని అంగీకరించడం, అదే పెద్దల సమక్షాన్న నా చేతుల్లో పెళ్ళి తాంబూలం ఉంచడం మరుక్షణంలో జరిగిపోయాయి.

ఆ రాత్రి వారింట్లో విందు ఏర్పాటు చేస్తామన్నారు. 'శాంత' చేతి భోజనం గుర్తుకు తెచ్చుకున్న సత్యానందం వారి కోరిక తిరస్కరించక తప్పలేదు. ఇద్దరం తిరిగి ఇంటికి వస్తుండగా అతన్ని అడిగాను 'లక్ష్మి'ని వివాహ మాడడం తనకు ఎంత వరకు ఇష్టమోనని. సత్యానందం చిరునవ్వుతో సమాధాన మిచ్చాడు. "ఇంతవరకూ మీరు నా శ్రేయస్సుకే పాటుబడ్డారు. నన్నొక ఇంటివాణ్ణిగా చెయ్యడంలో మీ ఇష్టం కాక పోతే నాదేముంది మేష్టారూ !"

చమత్కారమయిన అతని సమాధానంలో నాకేదో నిగూఢార్థం స్ఫురించింది.

ఆ నాటి రాత్రి ఇద్దరం కలిపి భోంచేస్తున్నాం. 'శాంతా' సత్యానందం ప్రక్క కూర్చుని వింతగా చూస్తున్నాడు. 'మాలతి' నెయ్యి వడ్డిస్తూ "ఇంకొంచెం వేసుకో అన్నయ్యా !" అంది. శాంతను మన్నించకుండా, "అమ్మా !" అని పిలిచాడు సత్యానందం. ★

## న్యూఢిల్లీ లేఖ

8 వ పేజీ తరువాయి

ధూళిని తప్పించుకోలేరు. ఆర్థికశాఖకు ఈ సౌకర్యం ప్రత్యేకం. ఆర్థికశాఖ సహాయ మంత్రిణి గది ముందు ఎన్నో వారాలనుంచి సున్నమూ, నిచ్చెనలూ ఉన్నాయి. పైగా, వాటిని ఎవడూ ఎత్తుకపోకుండా గొలుసులతో కట్టేశారు. 'బోర్డ్ ఆఫ్ రెవెన్యూ' ఆఫీసు ముందు కూడా అంతే.

ఈ భవనానికి పథకాలు వేసినవారు మొదట్లోనే, ఆఫీసుల ముందు ఒక కాలువలాంటి దాన్ని తవ్వి ఉంచారు. అందులో టెలిఫోను, విద్యుచ్ఛక్తి తీగెలను ఉంచుతారట. దీన్ని యర్రరాతితో కప్పేయటం జరిగింది. మరోచోట, లోపలే నేల గచ్చు పూర్తిగా ముక్కలయిపోయి ఉంది.

**ఏరోజు కారోజు కిటికీల అద్దాలను తలుపులను శుభ్రం చేయటం ఒక ఆచారం, అవసరమూ. పైగా అందుకోసం బోలెడంత డబ్బు ఖర్చుచేశారు, చేస్తున్నారు. ఫలితం శూన్యం.**

'ఉద్యోగ్ భవన్' అని మరో భవనం ఉంది. అందులోనే వాణిజ్యం, పరిశ్రమ, ఉక్కు, భారీ ఇంజనీరింగు, గనుల మొదలైన శాఖ లున్నాయి. స్వాతంత్రం వచ్చిన తరువాత నిర్మించబడిన భవనమే ఇది. మెట్లమీద, రహదార్లమీద వేసిన ఆ జనపనార పట్టాలు చినిగిపోయి ఉన్నాయి. వాటిమీద నడవటం ప్రమాదకరం అని తేలిపోయింది.

**ఈ సందర్భంలో కాస్త వివరణ అవసరం. భారతదేశం సచివాలయ భవనాల నిర్వహణకోసం ఏటా, రెండుకోట్ల రూపాయిలను ఖర్చు చేస్తున్నది. కిటికీలను తలుపులను ఫర్నిచర్‌ను శుభ్రంగా వుంచేందుకు కొందరు పనివాళ్లున్నారు. వాళ్లు పనిచేస్తున్నదీ లేనిదీ చూచేందుకు కొందరు అధికార్లూవున్నారు.**

అవసరమయిన వస్తుసామగ్రి సరఫరా అవుతున్నది. కాని, మురికి మురికిగానే ఉంటుంది. విదేశీ రాయబార కార్యాలయాల తీరు వేరు .... అక్కడ ఈ పనివాళ్లు ఇలా తలాయిస్తే ఉద్యోగాలు క్షణాల మీద వూడిపోతాయి. కాని, సచివాలయం లాంటి ముఖ్యమైన ప్రదేశాలు మాత్రం మురికివాడలుగా ఉండిపోవటానికి బాధ్యు లెవరు ?

మామూలు పరిస్థితుల్లో అయితే హిందూ తత్వాన్ని నేను నిందించేవాణ్ణి. ఎందుకంటే, వీళ్లకు అంతర్ పారిశుధ్యమే ముఖ్యంకాని, వెలుపలి పరిశుభ్రత అంతా పట్టించుకోదగ్గ విషయం కాదు. అంచేత, ఇప్పటి పరిస్థితులకు పార్లమెంట్ హౌస్‌కూ, పునరావాస మంత్రిత్వశాఖ భవనానికీ కార్యదర్శులు ఇద్దరూ హిందువులే కనుక పరిస్థితులను మనం నిందించనవసరంలేదు.

ఏమయితేనేం, ఈవిధంగా మురికి, దుమ్ము కొండలు కొండలుగా పేరుకుపోవటానికి 'వర్క్స్' మంత్రిత్వశాఖయే కారణం. మనిషి స్వతహాగా బద్ధకస్తుడు—పని చేయటానికి అతనికి మనసొప్పదు. కాని, పనిచేయటం బలవంతమైపోయింది. ఆ రోజుల్లో పరిస్థితి వేరు. ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యులూ, వివిధ శాఖల కార్యదర్శులూ కలిసి పనిచేసేవారు. అందువల్ల, 'వర్క్స్' శాఖ కూడా సమర్థవంతంగా పనిచేసేది. కాని, ఆ పరిస్థితి అంతా తారుమారయింది. ఈనాడు; బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపినవారే, బ్రిటిష్‌వారి పరిశుభ్రతను కూడా విస్మరించారు. బ్రిటిష్‌వారు పరిశుభ్రత విషయమై నెలకొల్పిన ప్రమాణాలు నశించాయి. అందువల్ల ఈనాడు రెండు రకాల వ్యవహారం జరుగుతున్నది. ఒకవైపు మురికివాడల నిర్మూలనకు డబ్బు విపరీతంగా ఖర్చు చేస్తున్నారు—మరోవైపు మురికివాడలనే తయారు చేస్తున్నారు. విషాదం ఏమంటే, మురికివాడల తయారీకి కూడా డబ్బు చెల్లించవలసిన వారు ప్రజలే.

ప్రభుత్వ రంగంలోని భవనా లన్నింటికీ ఈ తత్వం వ్యాప్తి చెందుతున్నది. పార్లమెంటు వీధిలో ఉన్న రిజర్వుబ్యాంకు భవనం దుమ్ములో మునిగి తేలుతున్నది. లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ భవనమూ అంతే.

సోషలిజం సాధనకై కృషి జరుగుతున్న ఇండియా నిజస్వరూపమిది.

శ్రీకృష. ★

## రాజధాని కబుర్లు

11 వ పేజీ తరువాయి

గానసభలు, ఆటలు మొదలైన కార్యకలాపాలతో, ఈ సంస్థ యెప్పుడూ, సభ్యులకు, వారి కుటుంబాలకు, ఆనందాన్ని, వినోదాన్ని కలిగిస్తూ ఉంటుంది. దీనితోపాటు నాటకాలు వ్రాయించటం, వాటిని పోటీలకు పంపి సభ్యులను ప్రోత్సహించటం, ఈ మధ్య చేస్తున్న పనులలో ఒకటి. ఈ సెంట్రల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ వారికి ఆర్థికంగా ఆట్టే బాధ పడాలసిన అవసరం లేదు కాబట్టి, ముందు ముందు రచయితలను, దర్శకులను, నటీ నటులను ఇతోధికంగా ప్రోత్సాహమిస్తూ, ఈ ఏడు పొందిన గౌరవాభిమానాలను, నిలబెట్టుకుంటూ, ముందు, ముందు, ఇంకా సాహిత్య కృషి చెయ్యగలదని ఆశించవచ్చు.

ఇక సినిమా రంగంలోకి వస్తే, చెప్పుకోతగ్గ ఒకే ఒక విషయం ఉంది. "మూగ మనసుల' శతదినోత్సవాలు ఆంధ్ర దేశంలో ఎన్నో చోట్ల చేసుకుంటున్నారు. ప్రత్యేకంగా ఇక్కడి విశేషమేమిటంటే ఈ సందర్భంలో డాక్టర్ చెన్నారెడ్డి (ప్రణాళికా మంత్రి) గారు ప్రసంగిస్తూ, "సినిమా పరిశ్రమను అభివృద్ధి పరచటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తలపెట్టిన, సహాయ, ప్రోత్సాహకర ప్రణాళికలు నిష్పాక్షికంగానూ, భేదభావం లేకుండానూ అమలు పరచాలనే సదుద్దేశంతో తయారు చేసినవే, మద్రాసులో కొంతమంది, వీటిపట్ల అనుమానాలు వెల్లడించటం నిజంగా దురదృష్టకరమే" అన్నారు. ఈ హామీ, అనుమానాలు వెల్లడించిన ప్రముఖులను ఎంతవరకు తృప్తి పరచగలదో చూడాలసిఉంది.

ఐ. ఎల్. ఎన్. ★

## సరాగమాల

15 వ పేజీ తరువాయి

చేయడం జరిగి వుండాలి. లేకపోతే ఒక పాటలోకి ఇంత గ్లామర్ రాగలదా ! రెండవ ప్రక్క జానకి, శ్రీనివాస్ యుగళగీతం. కొంత " చిటారుకొమ్మన చిలకమ్మా" (మంచిరోజులువస్తాయి) పోలిక వున్నా, సినిమాలో చిత్రీకరణ బాగులేక పోయినా, వింటానికి హాయి తక్కువ లేదు. కారణం ? శ్రీనివాస్, జానకీల మేలిమి బంగారం, మంచి ముత్యాలకంఠాల కలయిక. అయినా ఈ రికార్డు వింటే తెలుస్తుంది. ఈ రెండు పాటలో వున్న విలక్షణమైన అందం.

* * *

నవగ్రహ పూజామహిమ జి. ఇ. 35443.

ఈ సినిమాలో భరింపదగ్గ కొద్దిక్షణాల్లో చాలమటుకు ఈ రికార్డున భద్రపరచబడ్డాయి. వికారమైన ఆంగిక విన్యాసం చూడనవసరం లేకుండా రికార్డు వినవచ్చునుగాని సినిమాలో కంటే విడిగా వింటేనే బాగున్నాయి రెండు పాటలు. ఆరుద్ర "వయసూ వలపూ నీదేసుమా, వలదంటే నేను పోనుసుమా, నిదురే కంటికి రాదుసుమా ఇదియే తొలిప్రేమ" రెండవ ప్రక్క జి. కె. మూర్తి రచన "మగువ తనే పిలువ, మగవాడా జంకుతావ" అన్నది. ఈ రెండు పాటల్లో చెప్పుకోవలసినంత (వీరి పాత పాటలతో సరి పోల్చితే) మాధుర్యాన్నికన్నా రాజన్నాగేంద్రలు నయ్యారానుకరణల మహత్యంకన్నా జానకి కంఠం మహిమ, పాటలను ఇంత మృదువుగా రికార్డు చేసిన మోహనసుందరం (గోల్డెన్) సువర్ణ హస్తం మెచ్చుకోదగ్గవి. నిజానికి ఇంతటి అందం ఇందులో కనబడటానికి కారణం మోహనసుందర సమ్మోహన శబ్దగ్రహణమే అంటే అంత అతిశయోక్తి కాదేమో ! జానకి పాటలు ప్రతి విరుపులో అంత హాయి రంగరించి వున్నది. రాజన్నాగేంద్రల వాద్యగోష్ఠిలో అంతటి మార్దవం మేళవించి వున్నది. ముందే చెప్పినట్లు సహారా యెడారిలో రెండు పన్నీళ్ల ఒయాసిస్సులివి.

కలవారి కోడలు ఎన్. 69808

సంవత్సరానికి కొక నిజమైన, విలువైన హాస్యగీతం మన సినిమాలో వినిపిస్తుంది. "తొయ్యెరా పడవా" పద్ధతిలో తయారు కాబడిన డజన్ల కొద్ది సరదా గీతాలలో గులక రాళ్లలో గురివింద గింజలా మెరుస్తుంది. క్రిందటేడు గోపాలం, స్వర్ణలత పింగళి, పెండ్యాల తయారింపు "అంచెలంచెలు" ఆ స్థానాన్ని ఆక్రమించినది. ఈ యేడు మాధవపెద్ది, పిఠాపురం, కొసరాజు చలపతిరావు కలసి ప్రాణం పోసిన గీతం "నీ సొగసే లాగుచున్నది" ఆ మాత్రం ఘనత కలిగినది. సరదాకు మారుపేరు. ఒకసారి వినండి. రెండవ ప్రక్క చాల రోజుల తరువాత జిక్కి ఘంటసాలతో పాడిన యుగళ గీతం "దొంగ చూపులన్నాది" సి. నా. రే రచన. ఇందులో సంగీతంలో జానపద ధోరణి తీయగా శ్రోతలను ముగ్ధులను కావిస్తుంది. ★



"రాముడు - భీముడు"లో రామారావు, యల్. విజయలక్ష్మి.

# 'రాముడు - భీముడు' చిత్రసమీక్ష

ఆస్తి ఉండీ అనుభవించే అదృష్టం లేక అమాయకుడుగా జీవిస్తున్న రాముడు, అచ్చం అవే ముఖ పోలికలు ఉన్న పల్లెటూరి యువకుడు భీముడు— అనే ద్విపాత్రల జీవిత సంఘర్షణయే ఈ చిత్రం.

రాముడు సంపన్న కుటుంబానికి చెందిన వాడు. చిన్నతనంలోనే తండ్రికీ, తల్లికీ దూరం కావటం వల్ల అక్కయ్య వద్దనే, తన ఇంట పెరిగి పెద్దవాడవుతాడు, కాని పతి వెర్రిబాగుల వాడు. తన ఆస్తినీ ఫ్యాక్టరీని నడిపిస్తున్న బావ పానకాలరావంటే తగని భయం— అంతేకాదు పానకాలరావు చేత ఎన్ని దెబ్బలు తిన్నాడో లెక్కలేదు.

భీముడిదొక పల్లెసీమ. నాటకాలంటే సరదా పడి వేసిన పౌరాణిక నాటకంలో 'భీముని' పాత్రకు బహుమతి లభిస్తుంది. కాని, భీముడు నాటకాలు వేయటం అతని తల్లికి నచ్చదు. అందువల్ల తల్లిని చూచి భయపడ్డ భీముడు సినిమా కంపెనీల చుట్టూ తిరిగేందుకు పట్టణానికి బయులు దేరాడు.

అటు రాముడూ అంతే. బావ దౌర్జన్యాలను భరించలేక ఇంటినుంచి పారిపోతాడు. కాని ఈలోగా సినిమా కంపెనీల చుట్టూ తిరిగేందుకు వెళ్లిన భీముడు పానకాలరావు దృష్టిలో పడటంతో, రాముని స్థానాన్ని పొంది, ఆ ఇంట చేరుతాడు. చెరువు గట్టున నీళ్లు తాగుతున్న రాముణ్ణి చూసి, పల్లెటూరి వాళ్లు భీముడే అనుకొని, వూరికి లాక్కెడతారు. తల్లి ప్రేమ కరువైన రాముకి, తల్లికాని తల్లి లభిస్తుంది. కార్మిక జీవనంతో అక్కడ జీవిస్తూ ఉంటాడు.

తెలివిగలవాడైన భీముడు అక్కడ పానకాలరావును ఎదిరించి పెత్తనాన్ని చేజిక్కించుకొంటాడు. ఫ్యాక్టరీ నిర్వహణకూడా తానే చేస్తుంటాడు. రాముడులాగా చలామణీ అవుతున్న భీమునికి పెద్దింటి అమ్మాయి 'లీల' తటస్థ పడటం, ఇరువురూ ప్రేమించుకోవటం జరుగుతుంది.

కాని, అదే లీల పల్లెసీమకు వెళ్లేసరికి, అక్కడ అసలు రాముడు కనుపిస్తాడు. అక్కడ ఆ రాముడు పేదింటి అమ్మాయి శాంతతో కలిసి, మెలిసి తిర్గుతూ ఉండటం చూచి లీల అపార్థం చేసుకొంటుంది.

చివరకు ఎలాగయితేం, రాముడు— భీముడు కలుస్తారు. పైగా, ఇద్దరూ ఒకప్పటి కవల పిల్లలు. తిరుపతి కొండమీద తప్పిపోయిన పిల్లలు. భీముడు లీలను, రాముడు శాంతను పెళ్లిళ్లు చేసికొంటారు. ఇదీ కథ.

సినిమా కథ కావటం వల్ల, (అందులోనూ తెలుగు సినిమా కావటం వల్ల) ఈ కథ హేతువాదం ఎదుట వటాపంచలు కావచ్చును. అయినా, ఉన్న కథ బిగువుగా నడిచింది. చెప్పదలచుకొన్న భావాలేవో కథకుడు పరిశుభ్రంగా, ముక్కుకు సూటిగా చెప్ప గలిగాడు.

సంభాషణలు చక్కగా ఉన్నాయి. పాటలకు గురించి చెప్పదలచుకొంటే, కొంత విపులీకరించక తప్పదు. అవి జనాదరణ పొందవచ్చును. కాని.... ఒకటి, రెండు పాటలు సాహిత్యానికి సంబంధించి నంతవరకు జుగుప్సాకరంగా ఉన్నాయి. రేలంగి, గిరిజ చేత పాడించిన 'సిగరెట్టు' పాట యొక్క ఔచిత్యం దర్శకునికే తెలియాలి.

సంగీతం, మధురమేనని చెప్పాలి. సంగీత దర్శకుడు కూర్చిన బాణీలు కూడా ఆహ్లాదకరంగా ఉన్నాయి.

నటన : అందరి నటులలోనూ ఉన్న నటనా సామర్థ్యాన్ని, ప్రతిభను దర్శకుడు చక్కగా వినియోగించుకో గలిగాడు. నర్తకిగా పేరు పొందిన యల్. విజయలక్ష్మి 'కార్మిక స్త్రీ'గాను, రాముని ప్రియురాలుగాను సమయోచితమైన నటనను ప్రదర్శించింది. నటనలో, నానాటికి కొత్తదనాన్ని సంతరించుకొంటున్న రాజనాల, పానకాలరావుగా బాగా నటించారు. రాముడు, భీముడు అనే రెండు వేర్వేరు తత్వాల పాత్రలను రామారావు బాగా పోషించ గలిగారు. దుఃఖ సన్నివేశాలలోనూ, అమాయకుడుగానూ రామారావు ప్రదర్శించిన నటన ప్రేక్షకుల హృదయాలను కదిలించి వేయటం తథ్యం. జమున నటనలో కొత్తదనం లేకపోయినా, పాత్రకు సరిపోయిందని చెప్పాలి. రేలంగి, గిరిజలు 'ఆంధ్ర సినీరంగపు ఆదర్శ హాస్యజంట' అని మరో మారు నిరూపించుకొన్నారు. అవ్వగా హేమలత నటన, ఆమె ప్రతిభకు గీటురాయి. రమణారెడ్డి, యస్. వి. రంగారావు, సూర్యకాంతం, శాంత కుమారి, బుష్యేంద్రమణి వారిపాత్రలకు యధోచితంగా న్యాయం చేకూర్చారు.

నాగార్జునసాగర్ ఔట్‌డోర్ దృశ్యాల చిత్రీకరణ రమ్యంగా ఉంది.

మొత్తం మీద చిత్రం ఒడుదుడుకులులేకుండా, విసుగెత్తించకుండా నడచి పోతుంది. ఈ సంవత్సరంలో ఇంతవరకు విడుదలయిన రెండు, మూడు మంచి చిత్రాలలో ఇదీ ఒకటి.

వాశిరాజు ప్రకాశం ★




"రాముడు—భీముడు" చిత్రంలో సంభాషణలు :

సినిమా దర్శకుడు : అమ్మా! చిత్ర పరిశ్రమ ఒక పవిత్రమైన కళ.

భీముని తల్లి : ఆఁ. నా బొంద కళ.

నిర్మాత రామానాయుడు, దర్శకుడు తాపీ చాణక్య, సంభాషణలు వ్రాసిన నరసరాజు ఇన్ని రోజుల నుంచి ఆ బొంద కళనే ఆరాధిస్తున్నారన్న మాట. అయితే కపిల కాశీపతి యేమిటి చేస్తున్నట్టు? "పగలే" (రాముడు—భీముడు), "ధైర్యం చేసి" (డాక్టర్ చక్రవర్తి) మాటల్లో కత్తిరింపు పడవలసిన దోషం చూశారే, మరి బొందకళ వారి ఆమోద ముద్రను పొందినదా ?

* * *

ఈ మధ్యన ప్రభాకరరెడ్డి ఆరు చిత్రము లలో నటించుచున్నాడని ఒక ప్రెస్—సర్క్యులర్ పరిభ్రమించింది. అయితే ఆ చిత్రాల జాబితాలో "బొబ్బిలి యుద్ధం" "వేములవాడ భీమకవి", "అమ్మా—నాన్నా", తిరువేంకటావారి పేరు పెట్టని చిత్రం కనపడలేదేం ? ఒక వేళ ఈ చిత్రాలు పూర్తి కావని, తెరపైకి రావని ఆ వర్ధమాన విలనుని ఉద్దేశమా ? ఆ మాట తక్కినవాటి గురించి అయితే కొంతయినా సమంజసమేనా ! కాని వచ్చే నెలలో విడుదల కాబోతున్న "బొబ్బిలియుద్ధం" సంగతి యేమిటి ! చిన్న వేషమని చిన్న చూపా ?

* * *

ప్రజలు పతి బుద్ధి తక్కువ వాళ్ళు. రెండు మగ ముఖాలలో గాని, ఆడ ముఖాలలోగాని తేడా కనిపెట్టలేని శుద్ధ దద్దమ్మలు. ఏది చూపిస్తే అదే చూసే బడుద్ధాయిలు. ఇవి నా ఉద్దేశాలు కావు. వారివారి చిత్రాలనుబట్టి చూస్తే ఆ ఉద్దేశాలు "జక్కన్న", "మైరావణ" నిర్మాతలైన బి. ఎన్. రంగా, బి. ఎ. సుబ్బారావుల కున్నట్టు న్నాయి.

లేకపోతే ఛాయ వేషం, "జక్కన్న"లో, కాస్సేపు రాజశ్రీ చేత కాస్సేపు హెచ్. పి. శకుంతల చేత వేయించటానికి కారణం ? "మైరావణ"లో, అంతకన్న అన్యాయం. పేకేటి శివరాంని, లంకసత్యాన్ని ఒక వేషం మార్చిమార్చి వేయించ టానికి హేతువు ? ఇవే కాదు. ఇటువంటి నిర్లక్ష్యవైఖరికి ఉదాహరణలు రెండు చిత్రాలలోనూ ఇంతే కొల్లలు. రాజాగారి ప్రధాన వేశ్య ఇంటిలో ఉన్న ఒక పులిబొమ్మ వర్ణ చిత్రం ఇంటర్వెల్ తరువాత బెస్తలరాజా గుడిసెలో ఉంటుంది. వీటన్నిటికన్న ఘోరమైనది "మైరావణ"లో. ఆంజనేయుడు ఒడలంతా బక్కురు కోవటం, తోకలో పేళ్ళు చూసుకొనడం ! ముసల్మానులకైనా, క్రైస్తవుల కైనా తెలుస్తుందే ఆంజనేయుడు దైవాంశ సంభూతుడని. ఆ సంగతి బి. ఏ. సుబ్బారావుకీ, రేలంగికీ తెలియలేదా ?

* * *

ఈ మధ్య తెలుగు చిత్రాలలో "టైటిల్ కార్డ్స్" విపరీతంగా పెరిగిపోతున్నాయి. పోలో (ఒకే పేరు ఉండేవి) కార్డ్స్, సంగీత దర్శకునికీ, రచయితకూ, ఛాయాగ్రహకునికీ, నిర్మాతకూ, దర్శకునికీ ఉండటం సహజమే ! కాని ప్రొడక్షన్ కంట్రోలర్‌కీ సింగిల్ కార్డ్ యెందుకు వేయాలి? ఆఫీసు కుర్రాళ్ళకీ, సెట్ మీద కాఫీ అందించే వాయర్‌కీ, సెన్సార్ స్క్రిప్ట్ టైపు చేసే రంగ నాధానికీ, వీళ్ళందరికీ కార్డులు పేర్లెందుకో! చూసేవాళ్ళు చూస్తున్నారు కాబట్టి తీసేవాళ్ళు తీస్తామనా ?

* * *

"రాముడు—భీముడు" చిత్రం గురించి మద్రాసు ప్రేక్షకుని లేఖ: "అతి నటన అనే గంజాయి మహా వనంలో లలిత నటననే చందనపు తరువు శాంతకుమారి నటన," శభాష్ ! ఎవడో మగవాడనవలసిన మాటనేశాడు !

* * *

"అయితే ఎక్స్ట్రా నటీమణి వెంకాయమ్మా! సినిమా వాళ్లలో ఒకళ్ళు చేసిన తప్పు ఒకరి మీద రుద్ది వేస్తారట నిజమేనమ్మా ? ఉదాహరణ: "మురళీకృష్ణ" కొన్ని చోట్ల రెండు జత వారోత్సవాలైనా చేసుకోక పోవడానికి కారణం కుమారి రాధ కథ అన్నారు కొందరు పెద్దలు. తన కథనే సినిమా తీయమని రాధ బలవంతం చేసిందా ! తీసుకున్న కథను తెరకు సరిగ్గా మలుచుకోవద్దని నిర్మాతనూ, రచయితనూ నిర్బంధించినదా ! కథలా చూసుకొంటే కథ బాగానే ఉంది. ఎటొచ్చీ దానిని ఏళ్ళు వచ్చిన దర్శకుడు, చెయ్యి తిరిగిన రచయిత సక్రమంగా ఉపయోగించుకొన లేక పోయారు. పి. పుల్లయ్య, ఆత్రేయల పనికి అమాయకురాలైన ఆ అమ్మాయినటంలో సబబేమి ఉంది ? అంతకు ముందు ఇదే కథను పినిశెట్టికి చూపగా సినిమాకు పనికిరాదని ఆయ నన్న సంగతి యెంత మందికి తెలుసు ?

* * *

"వివాహ బంధం" చిత్రంలో "నగుమోము గనలేని" పాటలో త్యాగరాజ పద్ధతినే ధిక్కరించ బోయిందటగా భానుమతి ? ఎంత భానుమతైనా ఇది మాత్రం దుస్సాహసమని చెప్పక తప్పదు ! గగనానికి ఇలకు యెచటి సాపత్యం. యెంతటి దూరం ? ★



"పీటలమీది పెళ్లి"లో కృష్ణకుమారి, చలం.



# కేశవర్ధని

వాడి నల్లని, నిడుపు వెంట్రుకలను పెంచుకోండి




**కేశవర్ధని ప్రొడక్ట్స్,**
**జైల్ రోడ్, కోయంబత్తూరు-1.**

తూర్పు గోదావరి, శ్రీకాకుళం, విశాఖ జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు:
మెస్సర్స్ ఓమ్ ఏజన్సీస్, 45, మహాత్మాగాంధి రోడ్, సికిందరాబాద్.

---

**ఉబ్బసము (అస్తమా) నకు ప్రతిక్రియున్న చేపతో**

ఈ దిగువచోట్ల ది 7–6–64 నుండి ది 30–6–64 వరకు ఔషధ మొసంగబడును. 42 సం॥లనుండి ప్రఖ్యాతి జెందుచూ అనేకులచే యోగ్యతాపత్రము లందుకొనుచున్న దివ్యౌషధం. పథ్యం 3 రోజులు మాత్రమే. ఒక్కొక్కరికి రు.10

హైదరాబాదు, వరంగల్; ఖమ్మం, గుంటూరు, గుడివాడ, బందరు, విజయవాడ, ఏలూరు, తాడేపల్లిగూడెం, తణుకు, భీమవరం, నర్సాపురం, రాజోలు రాజమండ్రి, రామచంద్రపురం, కాకినాడ, విశాఖ, పార్వతీపురం, బరంపురం.

ఎరుపు, తెలుపు, కుసుమ మొదలగు స్త్రీల సమస్త ఋతుదోషములకు పరిణామశూల (కడుపు నొప్పులు)లకు ప్రత్యేక చికిత్స చేయబడును.

వివరములకు :

**డా॥ కొమ్మవరపు విశ్వానందం (రిజిస్టర్డు)**
అస్తమా స్పెషలిస్టు
హెడ్డాఫీసు: రాఘవాపురం పి. ఓ; (వయా) నందిగామ, కృష్ణా.

---




## కాఫీ త్రాగే అసలైన ఆనందం గింజలను "పరిపక్వంగా" వేయించుటవల్లనే లభించుతుంది

పోల్సన్స్ యందు, ప్రతిగింజయున్న "పరిపక్వంగా" వేగునట్లు వేయించే నిమిత్తం మేము మిషన్లను పద్ధతులను కలిగియున్నాము. అత్యుత్తమ రుచి మరియు సువాసన కలిగించే నిమిత్తం. అవి వైజ్ఞానికంగా గుండ చేయబడుచున్నవి. ఈ సువాసన పోకుండా గాలి చొరని డబ్బాలలో సీలు చేయబడి మీ దుకాణదారువల్ల మీకు ఆ డబ్బాలు అమ్మబడుచున్నవి. ప్రతిపర్యాయమూ మంచి కప్ కాఫీ ఆనందంగా త్రాగండి—పోల్సన్ కాఫీయే తయారు చేసుకోండి.

# పోల్సన్స్ కాఫీ
## సంతృప్తికరంగా వేయించబడినది

బహుమాన కూపన్‌లను కూడబెట్టండి. పోల్సన్ వెన్న, నెయ్యి పిండి మరియు టీ వాడకంలో ఇంట్లో వాడుకపదం కూడాను.

పోల్సన్ లిమిటెడ్—బొంబాయి • ఆనంద్ • పాట్నా

PL 1155 A TEL EA

# మద్రాస్ సినిమా వార్తలు

## వీనస్ అండ్ అశోక్ వారి "సుమంగళి"

సుమంగళి చిత్రానికి మరి రెండు పాటలు ఆత్రేయ వ్రాశారు. ఒకటి సుశీల పాడింది. రెండవది ఘంటసాల, సుశీల పాడగా రికార్డు చేశారు.

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి, జగ్గయ్య, యస్. వి. రంగారావు, రేలంగి, జి. వరలక్ష్మి, గిరిజ, వాసంతి, పద్మ మొదలగు వారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు, పాటలు : ఆత్రేయ, సంగీతం : కె. వి. మహాదేవన్, ఛాయ : పి. ఎల్. రాయ్, కళ : జి. వి. సుబ్బారావు, కూర్పు: కృష్ణ, దర్శకత్వం : ఆదుర్తి సుబ్బారావు.

* * *

పి. పుల్లయ్యగారి దర్శకత్వం క్రింద తయారు కాబోయే తాజా తెలుగు చిత్రం (అరవంలో కాద లిక్క నేరమిల్లై")కు ముళ్లపూడి వెంకట రమణ మాటలు వ్రాయనున్నారు.

* * *

ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వం వహించబోయే "తేనె మనసులు" చిత్రానికి ఇంత వరకు 12 మంది క్రొత్త వారిని ఎన్నుకున్నట్లు తెలుస్తుంది.

* * *

శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు సంగీత దర్శకునిగా సుగంధి ఫిలింస్ "గ్రామ దేవతలు" చిత్రానికి, అనుపమా వారి "ఉయ్యాలా— జంపాలా" చిత్రానికి, యస్. ఆర్. మూవీస్ వారి "ప్రమీలార్జునీయానికి", విజయావారి "హరిశ్చంద్ర" చిత్రానికి పని చేయనున్నారు.

## శ్రీదేవిపిక్చర్సు 'విచిత్రవ్యక్తులు' రికార్డింగ్

శ్రీ దేవి పిక్చరు వారు ఈ మధ్య కర్ణాటక సంగీతంతో కూడిన ఒక పాటను రేవతి స్టూడియోలో బి. గోపాలం పాడగా రికార్డు చేశారు. ఈ పాటతో ఈ చిత్రంలోని అన్ని పాటలు రికార్డింగ్ అయినవి.

"నీవే నాకింతోడు— మరి నీడవు......
దయ చూపించి, నడిపించు— హా దేవ
దేవా......!"

ఈ పాటతో సహా ఈ చిత్రంలోని మాటలు, పాటలు : రాజశ్రీ వ్రాశారు. సంగీతం : పుహళేంది, కూర్పు : బాబు, బి. ఏ., ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : కె. యమ్. నాయుడు, నిర్మాత : జి. రామభూపాల్ రెడ్డి.

ఈ చిత్రంలో దేవిక, వాసంతి, సంధ్య, శివాజీ గణేశన్, యమ్. ఆర్. రాధా, బాలాజీ మొదలగు వారు నటించారు.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4"×2", 4"×4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.

## సినిమా వార్తలు

### మెర్క్యూరీ సినీ ప్రొడక్షన్సు

మెర్క్యూరీ సినీ ప్రొడక్షన్సు వారు హాస్యరస ప్రధానమైన చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఇంత వరకు 5 రీళ్ల చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో కాంతారావు, రాజనాల, రేలంగి, రమణారెడ్డి, చలం, బాలకృష్ణ, రాజబాబు, కృష్ణకుమారి, గిరిజ, హేమలత, వాణిశ్రీ, మొదలగు వారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన : కొండముది గోపాలరాయ శర్మ., ఛాయ : కె. రామచంద్ర., సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు., కళ : చలం., సహాయ



"పీటలమీది పెళ్లిలో" జానకి.

దర్శకులు : శ్రీనివాసరావు అండ్ ధనకోటేశ్వరరావు., దర్శకుడు : బి. యస్. నారాయణ.

### అశ్వరాజ్ ప్రొడక్షన్సువారి 'శ్రీసత్యనారాయణమహాత్మ్యం'

కె. గోపాలరావు సమర్పించు అశ్వరాజ్ ప్రొడక్షన్సువారి "శ్రీ సత్యనారాయణ మహాత్యం" మార్చి 9వ తేదీ ప్రారంభించారు. ఇప్పటికి 13 రీళ్లకు పైగా చిత్రం పూర్తి చేశారు. క్లైమాక్సు సెట్ ఒకటే మాత్రం చిత్రీకరించాలి. చిత్రంలోని పాటలు, పద్యాలు అన్ని రికార్డు చేయబడి చిత్రీకరించారు. ఈ చిత్రాన్ని జూన్ నెలాఖరులోగా విడుదల చేస్తారు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, కాంతారావు, రేలంగి, రమణారెడ్డి, చలం, ముక్కామల, అల్లురామలింగయ్య, రామకోటి, డా. శివరామ కృష్ణయ్య, కృష్ణకుమారి, గిరిజ, గీతాంజలి, సూర్యకళ, ఛాయాదేవి, జూనియర్ ఏ. వి. సుబ్బారావు మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు : పాటలు : సముద్రాల (జూనియర్), సంగీతం : ఘంటసాల, ఛాయ: సి. నాగేశ్వరరావు, కళ : వాలి, నృత్యం : వెంపటి, స్టూడియో : వాహిని, విజయ, నిర్మాత : పి. వి. సత్యనారాయణ.

సి. ధర్మారావు ★

## బ్రహ్మానందరెడ్డితో ఇంటర్వ్యూ

25 వ పేజీ తరువాయి

అల్పసంఖ్యాకులకు ప్రాతినిధ్యం ఉండేదిగాదేమో ! వోటర్ల జాబితాలే లేవనడం అతిశయోక్తి."

### పెరుగుతున్న విధము

"రోజురోజుకు పెరిగే ధరలకు విరుగుడు ఏమిటన్నది ప్రజలను కలతపెడ్తున్న ఒక సమస్య. దానికి పరిష్కారం వేరే ఉన్నది. ఉత్పత్తిదారుకు వాడకందారుకు నష్టం లేకుండా ఉండాలి. ఉపన్యాసాల ద్వారా ఆకాశాన్నంటే ధరలు క్రిందికి దిగిరావు. అందుకు కొన్ని కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తోడ్పడాలి. అందుకే కృషిచేస్తున్నాము."

### అదనపుశిస్తు సత్యాగ్రహం

"భూమిపై శిస్తు కొన్నిచోట్ల 500%, 600% గూడా రైతులపై పెరిగినదని సత్యాగ్రహం చేస్తున్నారు. చట్టం క్రింద జరిగిన పెరుగుదల అంత శాస్త్రీయంగా జరగలేదంటే కొంతవరకు ఒప్పుకుంటాను. ప్రజాస్వామ్య వ్యవస్థలో సత్యాగ్రహాల ద్వారా ప్రభుత్వ విధానాలను మార్చ జూడటం మార్గంకాదు. పెంచిన శిస్తులో వాస్తవంగా రైతుకు నష్టమై మేము అనుకున్న దొకటి, జరిగిన దొకటి అయితే మాత్రం సర్దుబాటుకు మేము సిద్ధంగానే ఉన్నామని పదేపదే చెప్పనే చెప్పాను."

### క్రీడలు

"ఇక రాష్ట్రంలో దేశీయ విదేశీయమైన క్రీడల వికాసానికి ప్రభుత్వం యథోచితంగా తోడ్పడుతున్నది. రాజధానీ నగరంలో చక్కని క్రీడామందిరాన్ని నిర్మించాము. క్రీడా సలహా మండలిని ఏర్పరిచాము. నాకు మటుకు టెన్నిస్ ఆట అంటే మక్కువ. హాకీ ఆడ్తాను. ఫుట్‌బాల్ క్రికెట్ ఆడ్తాను. మిత్రశా వంటి ఆటగాళ్లకు ప్రోత్సాహం ఇస్తున్నాము. జిల్లాల్లో, తాలూకాల్లో, గ్రామాల్లో ఉన్న నేర్పరులైన ఆటగాళ్లను తెలుసుకొని వారికి తగు ప్రోత్సాహాన్ని ఇవ్వాలన్నదే మా ఉద్దేశ్యం. యువక బృందం దృఢకాయులై, దార్ఢ్యవంతులై, నీతిపరులై మనిన నాడే సంఘం బాగుపడ్తుంది. ముందుకు అడుగు వేస్తుంది అని నా విశ్వాసం." ★

## శ్రీ శంభుప్రసాద్‌గారి కుమార్తె వివాహం

ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్, తమ ద్వితీయ పుత్రిక చి. సౌ. నాగేశ్వరిని యలమంచిలి వాస్తవ్యులు డాక్టర్ పి. ఎన్. వెంకటరావుగారి జ్యేష్ఠ కుమారుడు చి. సత్యనారాయణమూర్తికి ఇచ్చి 29, చామియర్సు రోడ్డులోని తమ స్వగృహములో మే 22వ తేదీ శుక్రవారము ఉదయం గం. 9—44 ని॥లకు వైభవంగా వివాహం జరిపించారు.

అనేకమంది బంధుమిత్రులు ముహూర్తమునకు విచ్చేసి వధూవరులను ఆశీర్వదించారు. వీరిలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, కేంద్రమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య, పార్లమెంటు సభ్యులు శ్రీయుతులు మోటూరి సత్యనారాయణ, మొసలికంటి తిరుమలరావు, అమెరికా సమాచార శాఖాధికారి శ్రీ విల్‌కాక్సు, బ్రిటిష్ సమాచార శాఖ అధిపతి శ్రీ రౌడెన్, శ్రీమతి రౌడెన్, ఫిలిం పరిశ్రమ ప్రముఖులు శ్రీయుతులు నాగిరెడ్డి, చక్రపాణి, ఎస్. ఎస్. వాసన్, బి. ఎన్. రెడ్డి, కె. వి. రెడ్డి, పి. పుల్లయ్య, వై. రామకృష్ణప్రసాద్, యన్. త్రివిక్రమరావు, కలికి పత్రికాధిపతి శ్రీ సదాశివన్, శ్రీ భగవాన్‌దాస్ (ఇండియన్ ఎక్స్‌ప్రెస్) హిందూ డిప్యూటీ సంపాదకుడు శ్రీ వి. కె. నరసింహన్, శ్రీ ఆర్. కే. స్వామి (వాల్టర్ థాంప్సన్) శ్రీ న్యాపతి రామారావు, ఆంధ్ర విశ్వవిద్యాలయం మాజీ రిజిస్ట్రారు శ్రీ సి. డి. ఎస్. చెట్టి, డాక్టర్ సదాశివన్, డాక్టర్ హెచ్. టి. వీరారెడ్డి ప్రభృతులు ఉన్నారు.

ఆ సాయంకాలం జరిగిన అతిథి సత్కారానికి విందునకు కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజు, కేంద్ర మంత్రులు శ్రీ కొత్త రఘురామయ్య, శ్రీ ఒ.వి.అలగేశన్, ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడు, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారు, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. వెంకటరమణరావు, పార్లమెంటు సభ్యులు శ్రీ ఎం. తిరుమలరావు, శ్రీ మెయ్యప్పచెట్టియార్, (ఏ. వి. ఎం. స్టూడియోస్), మెయిల్ పత్రికా సంపాదకులు శ్రీ రాజన్, శ్రీ పంచాగ్నుల సూర్యనారాయణ, శ్రీ జె. వి. సోమయాజులు, శ్రీ సముద్రాల రాఘవాచారి, శ్రీ డి. వి. నరసరాజు, శ్రీ ఆరుద్ర, శ్రీ కొసరాజు, శ్రీ కె. లింగరాజు, శ్రీ నాగలింగం, (బరోడా బ్యాంకు), శ్రీ బి.ఎన్. రెడ్డి, శ్రీ సుర్జిత్ సింగ్, శ్రీమతి సుర్జిత్‌సింగ్, (కేంద్ర సమాచార శాఖ), శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీ చక్రపాణి, శ్రీ కె. వి. రెడ్డి, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ప్రభృతులు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు. ఈ సందర్భమున శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారి పాటకచేరి జరిగింది. ★

Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

